ఆంధ్ర గ్రంథ రత్నాకరము, ౬ వ రత్నము.

# భీష్మ.

నాటక రచనా ధురంధరులగు

శ్రీ ద్విజేంద్రలాల్ రాయుల

వంగాళీ గ్రంథమునకు

అనువాదకర్తలు,

జంధ్యాల శివన్న శాస్త్రిగారు

ప్రకాశకులు

ఆంధ్ర గ్రంథ రత్నాకర

కార్యాలయము,

గుడివాడ.

1926.



చందాదార్లకు 1—0—0] [ఇతరులకు రు 1—4—0

౧౪ ,, ఉప్పలపాటి నాగయ్యగారు, గురజ
౧౫ ,, జొన్నలగడ్డ శ్రీరామచంద్రయ్యగారు, గుడివాడ.
౧౬ ,, రాళ్ళభండి కుటుంబరావుగారు, బల్లిపఱ్ఱు.
౧౭ ,, చాపగాల వెంకటాద్రిగారు, కోడూరు.
౧౮ ,, గూడవల్లి గోపాలకృష్ణయ్య అండ్ బ్రదర్సు
౧౯ ,, శిష్ట్లా లక్ష్మీపతిసోమయాజులుగారు
౨౦ ,, డా॥ సి. కే. దుర్గాప్రసాదరావుగారు గుడివాడ.

పోషకులు.

౧ ,, కుందూరు వరాహలక్ష్మీనృసింహంగారు
౨ ,, సింగలి కుటుంబరావుగారు, లింగాల.
౩ ,, కూచిభట్ల వెంకటాచలపతిశాస్త్రిగారు కొర్నిపాడు.
౪ ,, గో॥ భా॥ రామచంద్రరావు దొరగారు, ఉలవభద్ర
౫ ,, యలమంచలి నాగయ్యగారు, నూజెళ్ల
౬ ,, శిరిపురపు వెంకటరత్నంగారు, ఎలమఱ్ఱు.
౭ ,, కోనేరు నారాయణరావుగారు బార్లపూడి
౮ ,, అట్లూరు వెంకటపతిగారు, చవుటపల్లి.
౯ ,, పాటిబండ్ల సీతారామయ్యగారు, ఆరుకొలను.
౧౦ ,, సీతారాజు హనుమంతరావుగారు, జువ్వనపూడి.
౧౧ ,, కూరాడ వెంకటాచలంగారు, కూరాడ.
౧౨ ,, మొవ్వ భూషయ్యగారు, ముకునూరు
౧౩ ,, పర్వతనేని గంగయ్యగారు, పోలుకొండ.
౧౪ ,, శివలెంక మల్లికార్జునరావుగారు. పెసరమిల్లి.
౧౫ ,, చెలసాని వెంకటరత్నంగారు, చిరుచింతల.
౧౬ ,, వల్లభనేని చౌదరయ్యగారు, గొలివేపల్లి.
౧౭ ,, వల్లభనేని రామశాస్త్రులుగారు, డిటో
౧౮ ,, శింగవరపు రామయ్యగారు, కొమరవోలు.
౧౯ ,, పొట్లూరి సీతయ్యగారు, డిటో

౨౦ ,, ముదునూరు గురురాజుగారు, గుడివాడ.
౨౧ ,, పొట్లూరి వెంకటరత్నంగారు, డిటో
౨౨ ,, హరి గుండేరావుగారు, కల్వపాముల.
౨3 ,, మానికొండ కుటుంబరావుగారు, ఉరుటూరు.
౨౪ ,, కోవెలమూడి పరంధామయ్యగారు, కోలవెన్ను.
౨౫ ,, ఈడుపుగంటి సీతయ్యగారు, నందివాడ.
౨౬ ,, కొత్తపల్లి రామకుటుంబయ్యగారు, గుడివాడ.
౨౭ ,, బ్రహ్మభొట్ల పట్టాభిరామశర్మగారు, డిటో
౨౮ ,, రాజ వెంకట్రామయ్యగారు, పసుమర్రు
౨౯ ,, నూకల వీరరాఘవయ్యగారు, కానుమోలు.
30 ,, పోతిన శ్రీనివాసరావుగారు, బెజవాడ.
3౧ ,, అడుసుమిల్లి వెంకటకృష్ణయ్యగారు, చిరుచింతల
3౨ ,, ఉప్పులూరి ఆదినారాయణమూర్తిగారు గుడివాడ.
33 ,, తిపిర్నేని సుబ్రహ్మణ్యంగారు, డిటో
3౪ ,, పరిమి వెంకటపిచ్చయ్యగారు, వడాలి.
3౫ ,, కొల్లి చినవెంకటరామయ్యగారు, అప్పికట్ల.
3౬ శ్రీమతి వల్లూరిపల్లి కనకసుగ్గమ్మగారు, వేలూరు.
3౭ మ॥ రా॥ శ్రీ॥ పిసికిట సూర్యనారాయణగారు, పునాదిపాడు.
3౮ ,, పాలపర్తి వాలేశంగారు పాలపర్రు.
3౯ ,, గూడూరు మల్లికార్జునరావుగారు, వంగూరు.
౪౦ ,, కోడూరు రంగయ్యగారు, కోసూరు.
౪౧ ,, అడుసుమిల్లి కృష్ణయ్యగారు, డిటో
౪౨ ,, కొండపల్లి నారాయణస్వామి రెడ్డిగారు, జొన్నపాడు.
౪3 ,, కొడాలి వీరభద్రయ్యగారు, చినపారుపూడి.
౪౪ ,, కరెడ్ల రామయ్యగారు, గుడివాడ.
౪౫ ,, గూడవల్లి రామబ్రహ్మంగారు, బెజవాడ.

☞ ఇంతవఱకు చందాసొమ్ము బాకీయున్న పోషకులు దయచేసి వెంటనే చెల్లింపఁ బ్రార్థిలు. నం॥ శివరావు

సంపాదకుఁడు.

# భూమిక.

సుమారు మూడుసంవత్సరములకు పూర్వమే నేనీనాటకమును బంగాళీభాషనుండి తెనిఁగించి కృష్ణాపత్రికలోఁ బ్రకటింపఁజేసితిని. కొన్ని నాటకసమాజములవారు దీనిని గ్రంథరూపమునఁ బ్రకటింపుఁడని కోరుటయు నింతదనుక ఆంధ్రగ్రంథ రత్నాకరమువారు ద్విజేంద్రుని చారిత్రికనాటకములనే ప్రచురింపుచు నిపుడు ఆతని పౌరాణిక నాటకములలో నగ్రగణ్యమగు నీ 'భీష్మ' ను బ్రకటింపవలెనని తలంచుటయు నేతద్గ్రంథప్రకాశమునకు హేతువులయ్యెను.

చరిత్రానుసరణము నాటకమునకుఁ బ్రధానముగాదను నంశమును సంస్కృతాలంకారికులును ఒప్పుకొనిరి. చరిత్రవిరుద్ధవిషయములు సంస్కృతనాటకమునందు పెక్కుగలవు, కానియస్వాభావికతకునందు పర్యాప్తమగు స్థానముగలదు. అనైసర్గికమగు గుణైకవర్ణనముకన్న మానవసహజమగు దౌర్బల్యముతోడి క్రమవికాసజీవితమే ఆదర్శపాత్రముల చరిత్రము నుజ్జ్వలముఁజేయునని ద్విజేంద్రుని తలంపు. (కాళిదాసభవభూతులు చూడుఁడు.) తక్కునాటకములందువలె ద్విజేంద్రుఁడు ఈ నాటకమందును తనసమాజ ప్రతిభాలబ్ధమగు స్వాతంత్ర్యమును పూర్తిగ నుపయోగించెను. సత్యవతి తనకన్యావస్థలో ధర్మభ్రష్టయగుటయు ఋషివరముచే ననంతయౌవనయగుటయు భారతప్రసిద్ధములే. దాని నాధారముగఁగొని ద్విజేంద్రుఁడు మానవసహజములగు నాపెయుత్థానపతనములను చిత్రించెను. భీష్మ పతనవార్తవిని నిమేషములో ఆపె వృద్ధయగుటయు ద్విజేంద్రుని సృష్టియే. ఇట్లే భీష్ముని యాదర్శమును అత్యున్నతముగఁజేయుటకును కవి కల్పనను స్వీకరించెను. భీష్ముని యాదర్శమునింతకంటె నుజ్జ్వలముచేయుటకు మఱియొకరికి సాధ్యముగాదు. ఇట్టి యాదర్శనాటకములఁ బ్రయోగించి ఆంధ్రనాట్యరంగమునున్నత దశకుఁ దెచ్చుట నాటకాభిమానుల కర్తవ్యము. ఈనాటకము ప్రదర్శించుటకు పెద్దదని భావించువారు కథాంశమునకు బాధలేని కొన్నిదృశ్యములను తగ్గించి మొదటినుండి చతుర్థాంకమందలి చతుర్థదృశ్యము వఱకును, ఆయంకాంతమునందలి అంబాభీష్ముల భాషణములను గ్రహించి నాటకమును ముగింపవచ్చును

జంధ్యాల శివన్న శాస్త్రి.

## సమర్పణము.

సీ॥ జన్మమాదిగ బ్రహ్మచర్యవ్రతంబును
నిష్కళంకమ్ముగా నెఱపెనెవఁడు
దీనజనోద్ధార దీక్షితుఁడై తన
సర్వస్వమర్పింపఁ జాలెనెవఁడు
తానుపూనిన మహాకార్యమ్ము నెఱవేఱు
దన్కదృఢాత్ముఁడై దనరునెవఁడు
జగదీశుపూజ, ప్రజాహితసేవయు
సమమని యొకభంగి సలుపునెవఁడు
గీ॥ అమలహృదయుఁడు నాదుశ్రేయోభిలాషి
రమ్యనిజవంశకైరవారామచంద్రు
డయిన గూడూరి రామచంద్రార్యవర్యు
పాణికంకేరుహాముల నర్పణముసేతు॥

జంధ్యాల శివన్నశాస్త్రి.

# పాత్ర సూచిక.



## పురుషులు.

శంతనుఁడు — హస్తినాపురము రాజు.

భీష్ముఁడు
చిత్రాంగదుఁడు } శంతనుని పుత్రులు
విచిత్రవీర్యుఁడు

మాధవ్యుఁడు — శంతనుని నర్మసఖుఁడు

శాల్వుఁడు — సౌభరాజు

వ్యాసుఁడు, దాశరాజు, మంత్రి, కాశీరాజు, పాండవులు కౌరవపక్షమువారు, శివుఁడు, శ్రీకృష్ణుఁడు, పరశురాముఁడు.

## స్త్రీలు.

అంబ
అంబిక } కాశీరాజు కూతుళ్ళు
అంబాలిక

గాంధారి — కౌరవుల తల్లి

కుంతి — పాండవులతల్లి

సునంద, దాశరాజ్ఞి, వేశ్యలు, మొదలగువారు.

# భీష్మ.



## ప్రథమాంకము.

### ప్రథమదృశ్యము.

స్థానము - వ్యాసుని ఆశ్రమోద్యానము, సమయము—ప్రభాతము.

[వ్యాసభీష్ముల ప్రవేశము]

వ్యాస—

భూపాల - ఏకతాళము

నీవు, హితుఁడవు, త్యాగమూర్తివి నిరుపమ, ము ॥నీవు॥
ప్రేమ నీనామము - ప్రేమ నీధామము దేవా
ప్రేమ మంత్రోచ్చారి — ప్రేమమూర్త్యద్భుత పూత ॥నీవు॥
మనుజులహిత సాధనము చేయఁగ
ఘనదుస్సహము గాఁదాన మొసఁగుటయు
నిను గనుంగొనంగ మార్గము కద్దె
నిఖిలలోక - భరణ శ్రీకర - రా ॥నీవు॥

వత్సా! ఈస్మరణము ప్రాణసగాథము.

భీష్మ- స్వామీ! నేను దాని నెచ్చట నన్వేషింపను?

వ్యాస— నీ హృదయమునందే యన్వేషింపుము

భీష్మ— నేను దాని నెవ్విధమునఁ బొందఁ గలను?

వ్యాస— వత్సా! సమాహితమనస్కుఁడవై చెవియొగ్గి వినుము.
సుమధురమును, ఆహ్లాదితమును, ధ్రువమును, గాఢము
నగు నాగంభీరగీతము నీహృదయమందే వినఁబడును.

భీష్మ— ఎచ్చట?— ఏమియు వినఁబడుటలేదు స్వామీ!

వ్యాస— తప్పక వినఁబడును. నేను నీకు దివ్యజ్ఞానము నిచ్చితిని.
దేవవ్రతా! ఈమాటలు వినుము. హృదయవీణాతంత్రిపై

౧౪ ,, ఉప్పలపాటి నాగయ్యగారు, గురజ
౧౫ ,, జొన్నలగడ్డ శ్రీరామచంద్రయ్యగారు, గుడివాడ.
౧౬ ,, రాళ్ళభండి కుటుంబరావుగారు, బల్లిపర్రు.
౧౭ ,, చాపరాల వెంకటాద్రిగారు, కోడూరు.
౧౮ ,, గూడవల్లి గోపాలకృష్ణయ్య అండ్ బ్రదర్సు
౧౯ ,, శిష్ట్లా లక్ష్మీపతిసోమయాజులుగారు
౨౦ ,, డా సి. కే. దుర్గాప్రసాదరావుగారు గుడివాడ.

పో ష కు లు.

౧ ,, కుండూరు వరాహాలక్ష్మీనృసింహంగారు
౨ ,, పింగలి కుటుంబరావుగారు, లింగాల.
౩ ,, కూచిభట్ల వెంకటాచలపతిశాస్త్రిగారు కొర్నిపాడు.
౪ ,, గో॥ భా॥ రామచంద్రరావు నాకగారు, ఉలవభద్ర
౫ ,, యలమంచలి నాగయ్యగారు, నాజెళ్ల
౬ ,, శిరిపురపు వెంకటరత్నంగారు, ఎలమర్రు.
౭ ,, కోనేరు నారాయణరావుగారు బార్లపూడి
౮ ,, అల్లూరు వెంకటపతిగారు, చవుటపల్లి.
౯ ,, పాటిబండ్ల సీతారామయ్యగారు, ఆరుకొలను.
౧౦ ,, సీతంరాజు హనుమంతరావుగారు, జువ్వనపూడి.
౧౧ ,, కూరాడ వెంకటాచలంగారు, కూరాడ.
౧౨ ,, మొవ్వ భూషయ్యగారు, ముకునూరు
౧౩ ,, పర్వతనేని గంగయ్యగారు, పోలుకొండ
౧౪ ,, శివలెంక మల్లికార్జునరావుగారు. పెసరమిల్లి.
౧౫ ,, చెలసాని వెంకటరత్నంగారు, చిరుచింతల.
౧౬ ,, వల్లభనేని చౌదరయ్యగారు, గొలివేపల్లి.
౧౭ ,, వల్లభనేని రామశాస్త్రులుగారు, డిటో
౧౮ ,, శింగవరపు రామయ్యగారు, కొమరవోలు.
౧౯ ,, పొట్లూరి సీతయ్యగారు, డిటో

మునకో శోకమునిపుణుండు వచ్చెననిం(బడి సుందరీ! నన్నావలిద కే కన్నులు. ప్రతిఫలముగ నాశీర్వాదము గొనుము అనగా ఆయన నెరసిన గడ్డపు వెండ్రుకలు గాలికి కదలుచుండెను. ఆయన స్వరము జాలిగను, దీనముగను ఉండెను అంత నేను నావను ఒడ్డునకు బట్టించి యమ్మునిని నాగృహమునకు గొంటిని. యమునానదిలోన నావ నడచుచుండెను నేను నన్ను మరచి నదీజలములందు ప్రతిబింబితమగు సంధ్యారాగమును జూచుచును, తరళ తరంగ సంగీతము వినుచును ఉంటిని. ఇంతలో నాయువలికి జేయితగులుటచే నా సుఖస్వప్నము భగ్నమయ్యెను తరువాత నొక—

(సఖి ప్రవేశము)

౧ స— ఇదిగో నమ్మా! మత్స్యగంధి యిచ్చటనేయున్నది

౨ స— ఏమె యంటరిగ నేయున్నది

౩ — రమ్ము సఖి! యింటికి పోదము

౪ స— రమ్ము పోదము

సత్య— నేను వచ్చుచున్నాను. మీరు పొండు.

౧స— సఖీ మత్స్యగంధీ! నిన్నొకతెను ఇచ్చట విడచిపోదుమా?

సత్య— (కోపముతో) నేను వచ్చుచున్నాను మీరు పొండు.

౨ స— ఏల యిట్లు కోపగించెదవు సఖి? మేమేమి తప్పుచేసితిమి?

సత్య— (శాంతముగా) మీరేమియును తప్పు చేయలేదు. సఖులారా! నాయొక్కకోపమును క్షమింపుడు. (చేతులొగ్గును.)

౩ స— రాజకుమారీ! అది యేమిచటి?

సత్య— నిజముగ నన్ను క్షమింపుడు.

౪ స— మంచిది. క్షమించితిమి! ఇంటికి రమ్ము

సత్య— మీరు నన్ను ప్రేమించుచుంటిరా?

౧ స— (నవ్వి) ప్రేమింపుచుంటిమా? ఎవ్వరన్నారు?

౨ స— ప్రేమింపుచుంటిమా? నేడు — పట్టినది

౩ స— ప్రేమింపుచుంటిమో లేదో యని అడుగుచుంటివా?

సత్య— నిజముగఁ బ్రేమింపుచోఁ బాపినియగు నీధీవరకన్యను పెవగింపుఁడు.

౧ స— ఏమి అట్లనెదవు?

సత్య—మీ రేమని యెఱుఁగుదురా నే నెవ్వతెనో?

౨స—ఎఱుఁగుదుము. సత్యవతివి.

సత్య—ఇంక నేమేని యెఱుఁగుదురా?

౩స—దాశరాజకన్యవు, అనంతయౌవనవు.

సత్య—ఇంక నేమైన?

౪స—ఇంతయే. ఇంక మేమేమియు నెఱుఁగము

సత్య—అయితే మీ కేమియు తెలియదు. ఇంక తెలియఁబోదు. పొండు ప్రియసఖులారా! అందఱు నింటికింబొండు. నేను రాను

౧స—ఏమి?

సత్య—నేను చెప్పను

౨స—ఏమి?

సత్య—ఈ 'ఏమి' కి సరియైనజబాబు ఎన్నటికిని బొందఁజాలరు. పొండు. ఇంటికి పొండు నేను రాను నా కిల్లువాకిలి యేమియు లేవు (ఏడ్చును)

౧స—ఏలయేడ్చెదవు సఖీ?

సత్య—లేదు లేదు మీరు పొండు.

౨స—ఏమి సమాచారము?

(సత్యవతి యూరకొనును.)

౩స—మత్స్యగంధీ! ఊరకొంటివి ఏమి ఆలోచించుచుంటివి?

సత్య—ఏమియు లేదు.

౪స—చెప్పవా?

సత్య—ఏమి ఆలోచించుచుంటినో నాకే తెలియదు.

౩స—చెప్పవుగాదు సఖీ?

౪స—నీ వెప్పుడు సుందరప్రభాతసమయమున దూరమున గనుపట్టు

౧బె—సంద్రుడ్డా ద్దేమంచోడో సూరుడో సెప్పూ?

౨బె—సూరుడే

౧బె—పోఅన్నే

౨బె—ఊం?

౧బె—సంద్రుడే మంచోడు

౨బె—ఎందుకో సెప్పూ?

౧బె—ఎందుకంటే సంద్రుడు లేకపోతే ప్రపంచకంఅంతా సీకటిగా వుండేది సంద్రుడే మాపటేల యెలుగిచ్చేది.

౨బె—మరి సూరుడో?

౧బె—ఆడేంటో పగటేల యెల్తురిత్తాడా యేను పగటేల సూరుడక్కర్లేదసలు

౨బె—నువ్వు బాగా ఆలోసించావురా

౧బె—ఏం మోత్ర ఆలోసించి ఆలోసించే నేనింత సిక్కిపోయాను.
(వాడు అసలు స్థూలకాయుడు)

౨బె—అది ఆసాడతునేవుందిలే.

౧బె—అరె అదేంటిరా?

౨బె—ఏదర?

౧బె—(శంతనుని చూపించి) అదుగో! అదుగో!

౨బె—మడిసేరా.

౧బె—మడిసేరా

౨బె—మడిసేగాని బతికినోడా సచ్చినోడా?

౧బె—సచ్చినోడేరా

౨బె—ఎట్టాగో సెప్పూ?

౧బె—అదేం కదలడం లేండే. బతికినోడైతే కదలడూ?

౨బె—సచ్చినోడు తాడిసెట్టాలే నిలమడి వుంటాడేం?

౧బె—నిజమేరో. ఇది పెద్దసిక్కే.

౨బె—సిక్కన్నసిక్కా సాల పెద్దసిక్కు. ఇది ఇయ్యాలొదలదు.

౧బె—ఇది వొదిలేది కాదు. ఈమడిసి బతికుంటే కదలకుండా

ఎట్టుం టాడు?

౨బె—ఎవళ్ళైనా కగలొద్దని వొట్టెట్టారేమో?

౧బె....సచ్చిమోతే నిలాగ్గామాత్రం ఎట్టాఖిలముడుతాడు? ఇట్లాంటి దెక్కడ సూడలా.

౨బె—సూసినట్టు నాకూ గేపకం లేదు.

౧బె—ఈసందేగ మెట్టా మోతుంది?

౨బె—ఊఁహూ మోయేతట్టు లేదు.

౧బె—అయితేసూడూ ఆణ్ణే అడిగిసూద్దారే?

౨బె—(ఆలోచించి) ఆఁ ఇది కూస్త బాగుంది

౧బె—పదా. అడుగుదాము (ఇద్దఱు శంతనువద్దకుఁ బోయెదరు)

౨బె—ఏహే! ఏహే!

౧బె—ఓపెద్దమడిసోయ్! మాటాడ్డేం?

౨బె—సచ్చాడల్లేవుంది రా!

౧బె—పోనీ నేను సచ్చిమొయ్యాలని ఆమాటే సెప్పరాదూ? ఈ పాటికి నిచ్చింతగా మనం ఇంటి కెళ్ళిమోదుంగా!

౨బె—అదే యేం తేల్లా. పదా ఇంటికిమోదాం.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

శం—ప్రావృడాగమమున నినుపడించిన సర్వాదానది ఇరుప్రక్కల నొరయుచుఁ గడువేగమునఁ బ్రవహించుచున్నది. పూర్ణచంద్రుఁ డుదయించినాడు. కలువలు వికసించినవి ఏమియుఁ గొఱంత లేదు. ఇదియంతయు నీరూపరాశియొక్క పూర్ణసన్నాహము. ఈరూపవర్ణనమున భాష అశక్తయై మౌనము నహించినది. ఈరూపమపూర్వము. ఇదియొకస్వర్గీయజ్యోతి. విశ్వముయొక్క విస్మయము. ఇంతదనుక నేను తన్మయుఁడనగుటచే నేమియునాలోచింపఁ జాలకపోయితిని. ఇప్పుడు మరల నాలోచనశక్తి వచ్చుచున్నది. ఈసుందరి యెవరు? ఎవరికన్య? ఈమె యుల్లెక్కడ? ఈవైపుగా వెళ్ళినది. ఈమెయుండు జాడ నెవ్వరు సెప్పుదురు.

సీ॥ దినదినమ్మును దఱుంగనిమోము సొగసుగు ను
షఃకాల ప్రకృతిసౌష్ఠవపు కల్మి
అంటినఁ గందెడు నతికోమలత యొప్పు
గొజ్జఁగిమొగ్గల జొజ్జతనము
మల్లెపూమాలికల్ మాసియొత్తెంచు వ
సంత వాతముల సౌజన్యగరిమ
తగు నలంకారపదన్యాసములు గ
గఱచు కవిబ్రహ్మకల్పితసృష్టిఁ
గీ॥ కలఁగఁ జేసి సుఖాంతమై సరసు మధుర
బంధురస్వప్నమట్టులఁ బాయునపుడ
ఖండవేదనఁ గూర్చ నేకలికఁ గనిన
నెంతమాత్ర కేలొకో చిగుళ్ళెత్తుచుండె॥

మాధవుఁడు—(ప్రవేశించి) రమ్ము నేను జెప్పెదను. ఇదియేమి ఇం
కిఁ గొంతెమగుచో గా నేవచ్చునది

శాంత—ఏమి?

మాధ—ఇంక నేమున్నది? ముఖ్య నేను మాట్లాడునపుడికి నీవు
పిడుగుపడినట్లు ఉలికిపడితివి

శంత—లేదు లేదు. మిత్రమా! ఏమి సమాచారము?

మాధ—మృగము పాఱిపోయినది

శంత—పోనిమ్ము కాని — అపూర్వసుందరి.

మాధ—ఎవరు?

శంత—ఒకయువతి. ఇంతనుక నేను నిశ్చలముగనుండి—

మాధ—ఓహో! తెలసినది, మదనబాణమునకు లక్ష్యమైతివి.

శంత—అబ్బా!

మాధ—పాపము చాల గొప్ప బాధ! చాలగొప్పబాధ! ప్రాణము
లు పోవుచున్నవి. అంతేకాదు?

శంత—వయస్యా!

మాధ—కాని ఆమె ధీవరకన్య

శాంత—నీవు చూచితివా?

మాధ—చూచితిని.

శాంత—మరల నొకమారు చూపింపఁగలవా?

మాధ—చూచి ఏమి చేసెదవు?

శాంత—నే నామెను బాగుగఁ జూడలేదు మఱియొకమారు చూచెదను.

మాధ—మంచిది. తెలసినది రమ్ము ఈదారిని నడువుము,

(ఇద్దఱు నిష్క్రమింతురు)

---

తృతీయ దృశ్యము

స్థానము—దాశరాజు గృహము సమయము—ప్రాతఃకాలము

(దాశరాజు అతికోపముతోఁ దిరుగుచుండును. ఆతని మంత్రికూడ నతనివెంట తిరుగుచుండును.)

దాశ—ఇగో నాకు కోపంవచ్చింది—సాలా కోపంవచ్చింది. రాణికొకక్కతెకే ముట్టుగిపుట్టలా. ఇంటిల్లిపాతికిన్ని ఉఁహూ! నేను రేపే రాజ్జెం ఇడిసిమోతాను

మంత్రి—సత్తెంసామీ—

దాశ—నాకీ 'సిత్తంసామి' అక్కర్లా పని కావాలి. పని సేయలేకమోతే తోకముడతెయ్యి

మంత్రి—సిత్తం పణిసేస్తాను. ఐతే—

దాశ—ఐతేలేదు. కైతేలేదు అందరి నోటంబడీ ఇదేమాట ఐతే ఐతే ఈఅయితేలో ఏమంత ఇసేసింగం వుందో నాకేం తెలియలా నేను—లేదు నేను సచ్చిమోతాను,

(దాశరాజురాణి ప్రవేశించును)

రాణి—సత్తేసావరాదూ. సావడంఅంటే అంత సులకంగావుందేం? పతిరోజూ సత్తాసత్తానని బెదిరిత్తావు. మళ్ళి వొకనాడూ సచ్చేదిలేదు. ఆపదేచ్చేంటో నాయెదుటసావు, ఊఁ సావూ. సావవేం? సావూ.

దాశ అయితే సావనుంటావా?

రాణి—సావమనేదేంటి. సావూ

దాశ—ఇదుగో మంతిరీ! సావనా?

మంత్రి—ఇట్టా వ్రాళ్లైనా సేత్తారా?

దాశ—అవును వోళ్లైనా సేత్తారా? విన్నావా రాణీ! మంతిరి వోద్దు అంటున్నాడు లేకమోతే ఇయ్యాల తప్పక సాచ్చి మొయ్యే వోణ్ణే

రాణి... యాంటి?? (మంత్రితో) యాంటికి నువ్వు వద్దంటుండావు ఎవోడవు వొద్దంటానికి? నేను రాణ్ణి ఆగ్నాపిస్తుండాను. నామాటకు అడ్డమా? పో నిన్ను పనిలోనుంచి తీసేశాను.

దాశ—ఆఁఆఁ' మంతిరి లేకమోతే రాజ్జెకారం జరిగేదెట్టా?

రాణి. అగో! నీదమూ పగ్గ రాజ్జెం బెస్తలోళ్లకు పెద్దా తేనే రాజ్జె నావేం? రాజ్జైమంట! వోళ్లవూరూరూ ఏట్లో సాహం బాఘుం. అదేకా నీరాజ్జెం? ఏట్లోనూ సెర్లోనూ వొలేసి నేపలుపట్టడం ఇదేకా నీరాజకారెం? రాజకారెం ఎట్టాజరుగుతోందని అడిగిత్తుండావా? నాడు జరిపిస్తుంటే సువ్వు సచ్చిమో.

దాశ...నువ్వు సెప్పుతే సచ్చిమోతానా? రాణీ! ఇంటోకిపా.

రాణి—ఓరీ నాబ్యాభాగ్యం పాచ్చినోడా! మంత్రికి నీగొప్పతనం చూపిస్తుండావే? సత్తానని బెదిరిత్తుండావా? నేనురాణిని, నా మాటకెదుర్లేదు

దాశ..ఛీ సిగ్గుమాలిందానా—రాణి!

రాణి. పదా ఇంటికి పదా లేకమోతే—

దాశ—లేమోతే యాంచేస్తా?

రాణి...సీపిరికట్టటి నాలుగుటికి గెంటుతాను.

దాశ—సీపిరికట్టటా గెంటుతావా?

రాణి....సీపిరికట్టతో గొట్టి మరీ గెంటుతాను.

దాశ... బలే! ఏదేశం రాజైనా రాజును సీపురుకట్టతో గొట్టి గెంటడం సూశైనా యున్నారా? మంతిరీ నువ్విన్నావు?

మంత్రి.. .లేదు సామీ!
రాణి—ఇప్పుడు ఎగాత్రావులే. (నిష్క్రమించును.)
మంత్రి....మీరు పారిపోండిదొరా! ఇదేసమయం. రాణి మాంచి కోపంమీన వుంది. ముందేపారిపోండి.
దాశ.. ఏమీ? నేనురాజుని ఆడదాని కెరసి పారిపోతానా? ఎవరురా అక్కడ? నాఇల్లింటులు ఇట్టా తీసుకురా
మంత్రి ఏమీ సేయలేరు నామాటిని పారిపోండి.
దాశ—అట్టాగా.
మంత్రి—నాను సెపుతుండాను పారిపోండి.
దాశ...మంచిది నువ్వు సెపుతుండావు. నువ్వే నామంతిరివి. సిమాట యిటాను (వెళ్లబోవును)
(శంతనుడు మాధవుడు ప్రవేశించెదరు.)
మాధ—బహుశః ఈయనయే దాశరాజు — ఇక్కడి రాజుగారు మీరేనా?
దాశ—నేనుకాకపోతే నీవారాజు? సూడు — కబురంపకుండా లోనికెందుకొచ్చారు? పైగా మీరేనా రాజని అడుగుతుండారు? నావద్ద కొచ్చేవోళ్ళు ఏం చేస్తారో మీకు తెల్సునా?
మాధ—లేదండీ! మేమెఱుగము.
దాశ.. ఆళ్ళు ముందిస్తిగా మామంతిరి మేనత్తకొడుక్కి సజరానా పంపుతారు
మాధ. చిత్తము మేనత్తకొడుకునకా!—
దాశ—గరిమిలాన మామంతిరి పిన్నమ్మ కొడుక్కు దగ్గరిగా సేతులు జోడించి నిలబడుతారు.
మాధ...బాబో యింతమున్నాదా!
దాశ—నాను రాజును. యీరెవరుంతిరి?
మంత్రి—సిత్తం పభో!
మాధ—ఇది యెవ్వరోప్పుకొనరు?
దాశ—వప్పుకుంటుండారా?

మాంధ—మీప్రశ్నకిప్పుడే నే నుత్తర మిచ్చుచున్నాను. మామిత్రుడు హస్తినాపురమునకు రాజు

మంత్రి—(ఆశ్చర్యముతో) అస్థినాపురంమారాజా?

మాంధ. చిత్తము.

మంత్రి. సంతనుమారాజా?

మాంధ అవును

మంత్రి—(దాశరాజుతో) చిమ్మాసనం దిగండి, చిమ్మాసనం దిగండి

దాశ—యాంటికి? చిమ్మాసనంగిగేది యాంటికి?

మంత్రి ముందు దిగండి తరాత సెప్పుతా. లేకమోతే—

దాశ—లేకపోతే యాం?

మంత్రి. లేకపోతే మనరాజెం పోయిందేయిక.

దాశ—ఆ! ఆ! లేకమోతే రాజెంపోయిందా? (కొంచెములేచి) లేకమోతే రాజెం పోయిందా?

మంత్రి— [illegible]

(దాశరాజు సింహాసనముకుండి లేచి నిలఁబడును.)

మంత్రి—మారాజ! 'హస్తినాపుర మారాజ!' ఇయాల మేం తరించాం మీరిసి చిమ్మాసనంబూద కూకోండి

దాశ (ఆశ్చర్యముతో) ఆఁ అదేంది?

శంత.. అవసరము లేదు దాశరాజా! మీరు సింహాసనముమీఁద కూర్చుండుడు

దాశ—(తత్తరపాటుతో) మంత్రీ!—

మంత్రి. ..కూకోండి. మారాజుగారు సెలవిత్తుండారు. సేతులు జోడించి మరీ కూకోండి.

(దాశరాజు అటులనే చేయును.)

మంత్రి ....ఇంకమా ప్రార్థన—

దాశ—మంత్రీ!— (మంత్రి దాశరాజు చెవిలో నేదియో చెప్పును)

దాశ—అంట్టాగే మారాజా! నే నిప్పుడే వొస్తాను.

(దాశరాజు మంత్రితో నిష్క్రమించును.)

మాంధ. దాశరాజు తనభార్యతో నాలోచించుటకు వెళ్ళినట్లున్నది మహారాజా! ఈయనాగరికుని జూచికూడ నింతకు నీతని పిల్లను పెండ్లియాడఁగోరుచుంటిరా!

శంత— అయితే నాకీసుందరి ధీవరకన్యగాదని తెలిసినది.

మాంధ— ఈతఁడు పెంచినకన్యయేకదా? ఈయనాగరికుని యొద్దనేగదా ఆమె శిక్షపడసినది?

శంత— ఒకానొకఋషివరముచే నామె అనంతయౌవనయు బుద్ధిమతియు నయ్యెనని వింటిని

మాంధ— ఆఁ ఇది నిజమేకాని దీనికి గొప్పగాథగూడ నున్నదని వింటిని ఇట్టి యజ్ఞాతకులశీలను పెండ్లియాడుట అంత యుచితము లేదు

శంత— మిత్రమా! నాకిదియంతయు విచారించుట కవకాశములేదు. నా కామె కావలయును.

(దాశరాజు మంత్రితో ప్రవేశించును.)

మాంధ— రాణి యేమి నిశ్చయించినది?

దాశ— రాణెందుకూ?

మంత్రి .. మహారాజుగారికి మొగసంతానం వున్నదా!

మాంధ. .ఉన్నది

మంత్రి— ఉందే,

మాంధ...అకే అనఁగా?

మంత్రి . మహారాజా! అదే,

దాశ ఆఁ అదే.

మాంధ .మహారాజా! అయితే పెండ్లిసేయుట మీకిష్టము లేదా?

దాశ— అదే,

మాంధ...అయితే యిష్టము లేదా?

దాశ— అదే— యేం మంతిరీ?

మంత్రి— అదే

దాశ—అదే.
మంత్రి—అదే.
మాధ—ఇష్టమా కాదా?
దాశ—అదే
మంత్రి—అదే
మాధ—ఒకటేజవాబీయుచున్నారు.
దాశ—అదే
మాధ—'అదే'అనుటయేనా మీయంగీకారోత్తరము?
దాశ—మంత్రీ (మంత్రి దాశరాజుచెవిలో నేదో చెప్పును)
దాశ—ఇనండి. పానంపోయినాసరే వృన్నావరే,నాకూతురిబిడ్డే సింహాసనకె రాజుకావాలని నాకోరిక్కట్టు దీనికి మహారాజొప్పుకుంటాడా? సులభంమాట మంతిరీ' ఇప్పిసెప్పు.
మంత్రి—మహారాజా! మహారాజుగారిపతిగ్గ యాంటిదంటే ఏలిన్నోరి అనంతరం సూప్పుకొట్టినోళ్ల అత్తినాపురానికి రాజు కావాలనుకుంట దీనికి మీరొప్పుకుంటారా?
శంత—లేదు—అదియెట్లు? నాకు జ్యేష్ఠపుత్రుండు గలఁడు.
దాశ—అయితే ఇంక ఈపెళ్లికాదు సులబంమాట మంతిరీ! ఇప్పిసెప్పు
మంత్రి—ఇంకేనుమహారాజా!యివాగం కాదు.
శంత—ఇదియె మీస్థిరసంకల్పము?
దాశ—ఔఁ ఇదియే మా—ఏమిమంతిరి—థిరచంక—ఇప్పుతన్న మంతరయేటి?
మాధ—సంకల్పము రెండు మహారాజా! ఇంక నేమియాలోచించుచున్నారు?
శంత—దాశరాజా! మీయిచ్చకు విరుద్ధముగా మీకన్యనుపెండ్లి యాడుటలేదు. అవివాహితయగుకన్యపైతండ్రి కధికారముగలదు దాశరాజా! యింక వెళ్ళుచున్నాము. రమ్ముమిత్రమా (ఇద్దరునిష్క్రమింతురు.)

గీ॥ వేడ్క దేవవ్రతా యంచుఁ బిలచి తొలుత,
నేమి లేదని తుదకుఁ బూరించు వడిని
జనకునిచిత్తవిభ్రమమునకు హేతు
వరయ నేనఁట నాకన్న నధముఁడున్నె?॥

హాతండ్రీ! నీమనోరథమును ఇంతగనుక నాకేల చెప్పక దాచితివి? దేవవ్రతుఁడు పితృతుష్టికై సర్వము చేయుటకు సమర్థుఁడని యెఱుఁగవా? ఈయధమపుత్రునిపై నీ కింత మమకారమా!— మంచిది. నీయాయగాధ ప్రేమమునకు నే ననర్హుఁడఁగానని చూపించెదను. నీసుఖమునకై నాప్రాణ మర్పించెదను.

(ప్రస్థానము.)

(ఆకాశమున గౌరీశంకరులు ప్రవేశించెదరు.)

శంక.... నేఁడు మానవజాతియొక్క ఇతిహాసములో నూతనాధ్యాయము ప్రారంభమైనది పార్వతీ! చూడుము ఆచెట్టుక్రింద చింతామగ్నుఁడై కూర్చునియున్న గౌరవర్ణుఁడును. దీర్ఘకాయుఁడునగు సుందరయువకుఁడు ప్రపంచమునకు గంభీరమగు నొకనూతనసంగీతము వినిపించును. ఆసంగీతము నింతవఱకు నెవ్వఁడు నెన్నఁడును వినలేదు.

గౌరి... ఏమిసంగీతము ప్రాణేశ్వరా?

శంక.... స్వార్థత్యాగసంగీతము ఈత్యాగము శుష్కతపస్య, శాస్త్రవిచారము, ధర్మప్రచారములందే కట్టుపడియుండలేదు. ఈ త్యాగము కర్మమార్గమునుండి లోకహితమునకు వ్యాపించినది ప్రేయసీ! ఈపిల్లవాఁడు త్యాగమంత్రమును వేదవాక్యముచేఁగాక జీవితసర్వస్వముందలి యాచరణముచే లోకమునకు వినిపించును.

గౌరి — ఈయువకుఁడా? వీనిపేరు?

శంక — దేవవ్రతుఁడు.

గౌరి — వీనితండ్రియెవరు?

శంక—శంతను మహారాజు.
గౌరి. నీనితల్లి?
శంక—నీసవతియగుగంగ.

## పంచమదృశ్యము.

### దాశరాజు గృహము — ప్రభాతము.

(దాశరాజు, మంత్రి, భీష్ముఁడు నిలచియుందురు.)

దాశ—ఈయనేనా అతినాపురం రాజుకొడుకు?
మంత్రి—అవును. ఈనే అత్తినాపురం యువరాజు.
దాశ—(భీష్మునితో) నీపేరేటయ్యా?
భీష్మ—దేవవ్రతుఁడు.
దాశ—బలేపేరు. ఈడకెందుకొచ్చావు?
భీష్మ—ఆత్మసమర్పణముచేయుటకు?
దాశ—ఏంసేయడానికి?
భీష్మ—ఆత్మసమర్పణముచేయుటకు
దాశ—అంటేయాంటిమంతిరీ?
మంత్రి—యువరాజుగారూ! మీకోరిక వాఁడికబాసలోసెప్పండి. మీరేంకోరుతుండారు?
భీష్మ—దాశరాజుకన్యను.
దాశ—అయితేఇప్పుడేంటోసేయడాని కొచ్చానన్నావుకా దంటయ్యా? (మంత్రిరాజుచెవిలో నేదో చెప్పును.)
దాశ—ఇదివాడుకబాసలోసెప్పరాదూ? నీకింకా పెళ్ళికాలేదూ?
భీష్మ—నేనుఅవివాహితుఁడను
మంత్రి—అంటే మీకు పెళ్ళికాలేదన్నమాటేకాదూ?
భీష్మ—అవును.
దాశ—మంతిరీ!—(మంత్రితో నాలోచించి) నువ్వు పెళ్ళాడితే మామ్మాయిపిల్లాడే రాజౌతాడుగాదూ?
భీష్మ—మీరు పొరపడుచున్నారు దాశరాజా! నేను మీపిల్లను స్వయముగా పెండ్లియాడుతలంపుతో రాలేదు. నేనామెను

తల్లిగా వరించుటకు వచ్చితిని

దాశ—మళ్ళీ ఇంకోమాటా? మంత్రీ! నువ్వు ఈయనతో మా
ట్లాడుము. నాకీనమాట బొత్తుగా తెలియడంలా.

మంత్రి—యువరాజా! దయచేసి చెప్పవలసింది వాడుకభాసలో సె
ప్పండి తల్లిగావరించుటకు వచ్చితినంటే యేంటి అర్ధం?

భీష్మ—నేను దాశరాజకన్యను నాయనగారికి పట్టమహిషినిగాఁ
బ్రార్థించుటకు వచ్చితిని

దాశ ఈయనెక్కడో పిచ్చోడల్లేవుండాడు. మంత్రీ!—

మంత్రి..అయితే సూడండీయువరాజా! సంతనమా రాజుకున్నా,
సత్తెన్నకున్నా పెళ్ళివిషయంలో నోమాటు వట్టివసంగం జ
రిగిందే?

భీష్మ—అది నేనెఱుఁగుదును.

మంత్రి. అయితే మరేంటి?

భీష్మ... నే నాన్నర్థ ప్రస్తావమునే మరలఁ గొనివచ్చితిని. నాయన
గారిపిల్లకుపుట్టినవానికి రాజ్యమీయనొల్లక వెళ్ళిరికాదు?

మంత్రి—ఆఁ అంతే [illegible]ప్పుడు జరిగింది.

భీష్మ—వారు నాకతముననే ఒప్పుకొనలేదు. మహారాజునకు నే
నేకపుత్రుఁడను

మంత్రి. ఆమాట యిన్నాం యువరాజా.

భీష్మ... నే నిప్పుడాప్రస్తావము నొప్పుకొనుచున్నాను.

మంత్రి—అయితే మరి సంతనుమారాజు వొప్పుకోలేదుగా?

భీష్మ—ఆయన దేమున్నది? రాజ్యముపై హక్కునాది నాహక్కు
ను వదలుకొనుచున్నాను.

మంత్రి.. (ఆశ్చర్యముతో) మీరు రాజ్జెంపైనిహక్కు వదలుకోం
టున్నారా?

భీష్మ—అవును వదలుకొనుచున్నాను.

మంత్రి—మీస్వబుద్ధితో?

భీష్మ ...ఆఁ నాస్వబుద్ధితో.

దాశ—పిచ్చోడు. వట్టి పిచ్చోడు.

మంత్రి—ఆచ్ఛర్యం!

భీష్మ—ప్రపంచములో నేమియు నాశ్చర్యము లేదు మంత్రీ! ఎవ్వని కేది యసాధ్యమో వాని కది యాశ్చర్యముగానుండును. ఒకనికి దస్సాధ్యముగుపని మఱియొకనికి సులభముగ నుండును నేఁడొకనికి కఠినముగనున్న పని రేపు సులభముగఁగూడ నుండవచ్చును. గనుకనే ప్రపంచమున నేమియు నాశ్చర్యము లేదు.

మంత్రి—మీరు మీరాజ్జెంహక్కు వదలుకుంటుండారా?

భీష్మ...ఆఁ వదలుకొనుచుంటిని.

మంత్రి..బాగా ఆలోసించుకుండారా యువరాజా? గుప్పిట్లోవున్న రాజ్యానికి—ఏరాజ్జెంకోసరం సభ్యజాతులు పోట్లాడుకొంటారో, మడిసి మడిసిని సంపుతాడో, అన్నతమ్ములు ఒకళ్ళ నొకళ్ళు సంపుకుంటారో, కొడుకు తండ్రికి యిరోది అవుతాడో, మీరారాజ్జానికి అకహక్కు వదలుకుంటుండారూ? మళ్ళీ యింకోమారి బాగా ఆలోసించుకోండి.

భీష్మ—గుప్పిటనున్న దుమ్మువలె వదలుచుంటిని.

మంత్రి....యాంటికి?

భీష్మ...తండ్రిగారి సంతుష్టికై.

మంత్రి—ఇప్పుడేనా?

భీష్మ...ఇప్పుడే.

దాశ—అబ్బాయీ! నీకేదో మతిబ్బమ కలిగింది.

భీష్మ...లేదు. దాశరాజా! నాకు మతిభ్రమ కలుగలేదు, నన్ను పరీక్షింపఁజేయుఁడు. నేఁడునాకంటె స్వస్థచిత్తుఁడును. స్థిరసంకల్పుఁడునగు మానవుఁడు ప్రపంచమున లేడు.

దాశ—నువ్వు నిజంగా రాజ్జెం విడిసిపెడుతున్నావా?

భీష్మ...నిజముగ విడిచిపెట్టుచుంటిని.

దాశ—సపధం శాస్తుండావా?

భీష్మ—చేయుచుంటిని. ఇది క్షత్రియశపథము.

(దాశరాజు మంత్రితో నాలోచించును.)

దాశ—మంచిది. ఇహ పెళ్లిసేయడానికి నాకేం బాధలేదు.

దాశరాజురాణి—(ప్రవేశించి) బాదవుంది

దాశ—యేంటి రాణి?

రాణి—మాట్టాడమోకు. నేను రాణ్ణి నాకు బాదవుందంటున్నాను.

భీష్మ—ఏమి?

రాణి—నువ్వు రాజ్జెనికి తగూతీస్కురావుసరే, నీతర్వాత నీపిల్లలు తగూతె స్తే?

దాశ—ఇదీ నిబద్ధమే.

భీష్మ—అవును. వారు తేవచ్చును కాని దానికి నే నేమి చేయుదును?

రాణి—నువ్వు సేయతల్సుకుంటే సేయొచ్చు నువ్వు పెళ్ళాడకమోతే ఈగడబిడవుండదు—ఏంమంతిరీ?

మంత్రి—రాణిసెప్పింది బాగోంది. పెళ్ళిలేకమోతే పిల్లలుపుట్టరుగా.

భీష్మ—వివాహసంకల్పముగూడ విడువవలయునా?

మంత్రి—ఇదితప్పితే రెండోవుపాయం లేదు.

భీష్మ—(తనలో) ఇన్నిరోజులనుండి తలపోసిన నా యభిలాషను, ఏకాంతలాలితయగు నాయాశనుగూడ తుదకుఁ ద్యజింపవలయునా? ఇది చాలకష్టమైన త్యాగము! దీనిపై పిండతర్పణములు లేక అనంతకాలము పున్నామనరకమునఁబడి కొట్టుకొనవలయును!—ఇది చాలకఠినము! చాలకఠినము!

సీ॥ అలిధికత్యాగతి కన్యోదకము లిచ్చి
ధర జీవితముఁ బరార్థమ్ముఁ జేయు
జవరాలిసహజప్రేమవిశిష్టమైన యా
త్మార్పణమ్మునకు మాధుర్యమ్ము గొలుపు
పసికందువుల మిసిపసపుబుగ్గల ముద్దు

లిఁకుపట్లఁ జింతలనెల్లఁ బాపి
పితృదేవతర్షి దేవతల ఋణమ్ములను
దీర్చ సాధనమయి తేజరిల్లు
గీ॥ ఆదియు నిదియన నేల గృహస్థమార్గ
మవనిఁ గల్యాణములకెల్ల నాలవాల
హారా! దీనినిఁద్యజియించుటనఁగ నింక
వేఱయున్నదె ప్రాణము ల్విడుటగాక॥
సీ॥ శారదచంద్రికాసాంద్రరాత్రులను నే
ర్పడిచిన యల్లికావ్యక్రమమ్ము
నీలజలమ్ముల కేళికూళులకును
నొసగిన వాగ్దానవిసరములను
ఆమని నవమల్లికామనోజ్ఞము వన
మ్మున కానగట్టిన ముడిపములను
తొలకరిమబ్బులతొలిగర్జితములకై
కట్టిన కల్పనాగారములను
గీ॥ భవ్యహేమంతశృంగారభవనములను
గుదువయుంచిన వెలలేనిగొప్పధనము,
అక్కటా! చేతులారగ నొక్కమాఱు
విస్మృతిమహాబ్ధి నియెడవిడ మెట్లు?॥
గీ॥ పెద్దకాలమ్ముఁ గల్పనాబ్ధిని మథింపఁ
బుట్టిన యనేక సందేహములను బొక్క
ప్రశ్నల సమస్యలను నివారణముసేయ
వేచియుంటిని నిఁక నవి వీడు టెట్లు?
ఇదిచాలకష్టసాధ్యము!

మంత్రి—అయితే మీ రిందు కొప్పుకోరా?

భీష్మ....(తనలో) చాల కఠినము—కాని నాత్యాగమహావ్రతమునకు ప్రథమపరీక్షాసంఘాతమున నే చూర్ణమగుదునా? నేనుమను ష్యుఁడనుగానా?

దాశ.. ఐతే నీకొప్పుదల లేదా?

భీష్మ...(మోకరిలఁబడి చేతులు పైకెత్తి) ఓ స్వర్గీయ దేవతలారా! బలహీనుండను, దుచ్ఛుఁడన్, గువిషయవ్యాపారలోలుండ, దు

ర్గలితస్వార్థపరత్వహస్తయుగఖేలత్కాష్ఠపాంచాలికా
కలనోపేతుఁడ, నిస్సహాయుఁడ నన్నుఁ గావఁ గృపఁ బూనకే
ఛలశూన్యంబొనరించి యాత్మకు మహాశక్తిం బ్రసాదింపరే।

ఓ దేవతలారా! దుర్బలుఁడను, అశక్తుఁడనగు నాకు బలమొసంగుఁడు. నా యీ హృదయవాసనను నిర్దయభావముతోఁ జూర్ణము సేయుఁడు. నా యహంకారము నెల్లఁ దొలగింపుఁడు. నా స్వార్థమునంతయు భస్మము సేయుఁడు. నా మర్మమును (హృదయమును) గాఢాంధకారముచేఁ గప్పుఁడు. దానిపై కేమాత్రమును బ్రకాశము రానీయవలదు. ఓ దేవతలారా! నాకు శక్తి నొసంగుఁడు.

బాగేశ్వరి = కురుజంపె.

సురలార! కర్తవ్య - శూన్యుండ నే నైతిఁ
గరుణావలోకమునఁ - గావుఁడీ నన్ను
బలితంపు స్వార్థమ్ము - బలిమిమై నన్నుఁబట్టి
కలుషితహృదయుని - గాఁజేయ సమకట్టె
హృదయదౌర్బల్యమ్ము - నెడబాపి సుజ్ఞాన
మొదవఁ బరీక్షలో - నుత్తీర్ణుఁ జేయుఁడు ॥సుర॥

రాణి పిచ్చోఁడు! పిచ్చోఁడు!

మంత్రి—యువరాజా! నిచ్చయం చేసుకున్నారా?

భీష్మ...(లేచి) దాశరాజా! నా యీ క్షణికమగు దౌర్బల్యమును క్షమింపుఁడు. మంత్రీ! నిశ్చయించుకొంటిని, వివాహసంకల్పమును గూడ విడిచితిని.

రాణి—ఎప్పటికి పెళ్లిసేసుకోవా?

భీష్మ...చేసికొనను,

మంత్రి—ఇది యే నిశ్చయమమ్మా?

భీష్మ—ఇదియే నిశ్చయము.

మ॥ నిజకర్తవ్యపదారవిందములపై నే నైహికాముష్మిక
ద్విజగమ్ముల్ త్యజియించి నేఁడుమొదలైతిన్ సత్యసన్న్యాసిన
న్కుజ మవ్వాసనయుం దొలంగె నద,శంకాచ్ఛిత్తినాకయ్యె,న
ద్విజయంబున్ సమకూరె స్వార్థపరతావిచ్ఛిత్తిమై నీయెడన్॥

ఝంఝూమారుతమెల్ల శాంతించినది పైన కేవలము శాంత
మగు నీలాకాశమున్నది. క్రింద దానిపాదములపై గంభీరసా
గరము గర్జించుచున్నది.

రాణి...సపదం సేసుండావా?

భీష్మ—నాయీశపథమునకు దేవతలెల్లరు సాక్షులు.

గీ॥ గగనమండలమెల్ల వ్రక్కలగుఁగాక
కువలయము రసాతలమునఁ గ్రుంకుఁగాక
ఏడుసంద్రమ్ములొకపరి నింకుఁగాక
పట్టినప్రతిజ్ఞ విడఁడు దేవవ్రతుండు॥

రాణి...మంత్రీ! నేను సెప్పలా ఒట్టిపిచ్చిపిల్లోడు.

భీష్మ...నేనుపిచ్చివాఁడనుగాను. నేనునాతండ్రినిఁ బ్రసన్నునిఁ జేసి స
మస్త దేవతలను సంతుష్టులఁ జేసితిని
పితా ధర్మః పితా స్వర్గః పితాహి పరమం తపః
పితరి ప్రీతి మాపన్నే ప్రీయంతే సర్వదేవతాః

---

షష్ఠదృశ్యము

హస్తినాపురరాజభవనము — ప్రభాతము.

(శంతను మాధవుల ప్రవేశము)

శంత—నాకుగా దేవవ్రతుఁడు సన్న్యాసిఅయ్యెనా?

మాధ—అవును.

శంత. ఆశ్చర్యము!

మాధ—నిజముగ నాశ్చర్యము.

శంత...నాపుత్రుఁడింత ఉన్నతహృదయుఁడా? పుత్రగర్వముచే నేఁడు నాహృదయ ముప్పొంగుచున్నది.

మాధ....నీకై నీవు గర్వపడుట కేమియు లేదు.

శంత—నాకుగా నాపుత్రుఁడు బ్రహ్మచారియయ్యెనా?

మాధ—మహారాజా! మీరీసత్యపాశమునుండి పుత్రునివిడిపింపుఁడు.

శంత—ఎట్లు?

మాధ—మీరీధీవరకన్యను పెండ్లియాడకుఁడు.

శంత—ఆమె ధర్మభ్రష్టకావలసివచ్చును.

మాధ...ఎందుకు? ఆమె స్వబుద్ధిచే మిమ్ములను బలిగా వరించలేదుగదా?

శంత.... దేవవ్రతునకుఁ గష్టముగనుండును

మాధ—ఏమియు నుండదు.మీరీముసలితనమున సుందరియగు నాజవరాలిని గ్రహించి యేమి చేసెదరు? మీరీతలఁపు మానుఁడు.

శంత—నాకీ వృద్ధాప్యములో నొకస్త్రీయుండుట యేలాగో తప్పదు మంచానఁగుంచానఁబడిన నాకుపచార మెవ్వరు చేసెదరు?

మాధ—దాసదాసీజను లెందరో కలరు.

శంత—వ రియుపచారమునఁ బ్రేమభావముండదు.

మాధ.. ఇంక నామెవచ్చి మీపై ప్రేమతో నుండునని మీరనుకొనుచుంటిరా? మీరు వృద్ధులు. ఇంకనామె ఋషి వరముచే నసంతయౌవనయని వింటిని. ఇంక నీపొత్తేమియు నతుకదు

శంత—ఎందుకుఁగాదు? సాఖొత్తు శంకిరుఁడే—

మాధ—మహారాజా! ఇచ్ఛకనుకూలముగ యుక్తులెన్నియైనిదొరకును. మీకీవివాహము వద్దు. దీనిచేసర్వనాశనమగును

శంత...మిత్రమా! నీవు నావిదూషకుఁడవు. మంత్రివిగావు.

మాధ...మహారాజునకు ఇచ్ఛావిరుద్ధముగా సఫలయుక్తి చెప్పగల మంత్రి ప్రపంచమునఁ బుట్టలేదు. విదూషకుఁడు విదూషకుఁ

ఓ మహారాజా! మీరు తర్వాత పస్తాయించెదరు.

శంత... పస్తాయించవలసియున్నచో పస్తాయించెదను.

మాధ... అయితే పోఁడు. మీకై సర్వనాశనద్వారము తెఱచియే యున్నది పొండు. (కోపముతోఁ బోవును)

శంత—ఏమిసుందరి! అపూర్వసుందరి! నాగుప్పిటలోనికి వచ్చిన దా నిని విడిచెదనా? మాధవా! నీవు నీరసబ్రాహ్మణుఁడవు నీకే మి తెలియును—

(భీష్ముఁడు ప్రవేశించును.)

శంత—ప్రియకుమారా! నీవు నాకై ఆజన్మబ్రహ్మచర్యమూనితివా?

భీష్మ—నాయనగారికోరికయే నాకోరిక.

శా॥ గార్హస్థ్యమ్ము పితౄణముక్తికని వక్కాణించు శాస్త్రమ్ము, లా
గార్హస్థ్యమ్ము తలంగియుం బితృఋణాఖ్యాకంబుబంధమ్ము త్యా
గార్హంబౌనెడ నింతకంటె వలెనే లేకున్న నామేనిలం
గర్హాయోగ్యము గాదె పిత్రభిమతాకాంక్షా విధానమ్మునన్॥

శంత. నీయీభీష్మప్రతిజ్ఞకుమెచ్చి దేవతలు నీపేరుభీష్ముఁడనియుంచిరి. వత్సా! నేనును నీయపూర్వ పితృభక్తికిఁ బురస్కారము గ స్వచ్ఛందమరణము నొసఁగుచున్నాను.

శా॥ కలవు ధరిత్రిపై జనకుకార్యము నొదలఁ దాల్చి చేయు పు
త్రులు పలువుంది, కాని పితృతుష్టికి జీవితమెల్ల హోమముం
సలిపిన గొప్పత్యాగి భువనమ్ముల వేఱొకఁడుండఁబోఁడు సు
జ్జ్వలచరితమ్మునన్ భరతవంశము దన్పితివయ్య పుత్రకా॥

భీష్మ—పితృదేవుని యాశీర్వాదము శిరోధార్యము. (ప్రస్థానము.)

(రెండవవైపునుండి చింతితభావముతో శంతనుఁడు పోవును)

---

## సప్తమ దృశ్యము.

కాశీరాజప్రమదావనము — ప్రభాతము.

(రాజపుత్రికయగు అంబ ఒకచెట్టుక్రింద నిలఁబడియుండును)

అంబ—ఈసమయమునఁ గేవలమాతఁడే స్మరణకు వచ్చుచున్నాఁ

డు. చల్లని యీ మఱ్ఱినీడను, ఈగంగ యొడ్డున వల్లవితప్రకృతిశోభితంబగు వసంతోత్సవమున నాతనిసుందరసౌమ్యముఖము స్మృతికివచ్చుచున్నది, ఓవిశ్వసౌందర్యసారమా! ఈకుంజవనమునందే నిశ్శబ్దమగు నీయేకాంతస్థానమునందే తొలుదొల్త నాకనులముందు ప్రభాతసూర్యునివలె నుదయించితివి. పసిమివన్నె మిసిమిఁదోడుగ నీయొడలునఁ గావిపుట్టము గ్రాలుచుండెను నీలనేత్రములతో నీవు నావంక తెప్పయార్పక చూచితివి. నేనులికిపడి నీవెవరవు సన్న్యాసీ! అని అడిగితిని. నీనిమ్నదృష్టిని నమ్రమగు నీయుత్తరమును నేనింతదనుక మరవలేదు. నీవు సుందరీ! నేనునీరూపభిక్షుకుఁడ నని యంటివి. నీవుభరతఖండమునకుఁ గాఁబోవు చక్రవర్తివని యెవ్వరెఱుఁగుదురు?—ఆశ్చర్యము! నాకిప్పుఁడును మనమ్ములో శంకయేకలుఁగలేదు. ఆశాంతసుకుమారమూర్తి, సౌమ్యమగు నాస్మేరాననము. విస్మయభరితమగునాదృష్టి, ఆమంథరగమనము. ఆగంభీరస్వరము. ఆనీటు సామాన్యులకు సంభవమా? చంద్రుఁడెన్నఁడేని పృథ్విపై నుదయించునా?

శా॥ ఆమందస్మితసుందరాననము నాయౌదార్యశాంతిచ్ఛటా
ప్రేమావిష్కృతమై కన్నుగవ యావిఖ్యాతగాంభీర్య మా
శ్యామామండలవాంఛనీయమగు సర్వాంగీణసౌందర్య మా
హా! మన్మానసమిల్లు కొల్లగొనె నేకాలోకమాత్రంబునన్॥

గీ॥ కరమున శరాసనమ్ము వెన్కను నిషంగ
మాస్యమున సుప్రసన్నత యలర రూపు
దాల్చు వీరశృంగార శాంతములరాసి
నాఁగ, దేవవ్రతుఁడు మనోజ్ఞతవహించు॥

హిందోల్ - ఆదితాళము

సుకుమారాకారుఁడే సమర - శూరుఁడే
అకళంకధీరుఁడే గు - ణాకరుఁడే శ్రీకరుఁడే ॥సుకు॥
ఆకమనీయుని పక్కనఁజేర్చుచు

ప్రాకటభాగ్యము నాకెవ్వ డబ్బునో
ఓకరుణాకర - రామాజగన్నాయక
నాకో ర్కెదీర్పుమ - నీకు వందనములసమర్పించెద నుకు
(సఖీద్వయ ప్రవేశము.)

౧స... నీవిచ్చటనుంటివా?
౨స—నిన్నిచ్చట వెదకి వెదకి విసిగివేసారితిమి.
అంబ—ఏమి నాతో నేమిపని?
౧స—ఒకసంగతియున్నది.
అంబ. ఏమిసంగతి?
౨స—విన్నచో నానందించెదవు.
అంబ—అయితే చెప్పుము.
౧స...ఎందుకుఁ జెప్పెదము?
౨స—ముందు మాకేమి యిచ్చెదవో చెప్పు.
అంబ—వస్తువునుబట్టి ధర పెట్టెదరు.
౧, ౨స—అయితే చెప్పుదమా?
అంబ—చెప్పుడు
౧స—సంగతి ఏమనఁగా—మీాఆయన—
౨స—చాలు. నేడింతవఱకే ఇంకచెప్పకుము.
అంబ—ఆయన యెవరు?
౧స—చెప్పుదునా?
౨స—ఓసీ! మెల్లమెల్లగా—వినిన సఖికి మూర్ఛవచ్చును.
అంబ—వినెదను, ఎవ్వరు?
౧స—నీప్రాణేశ్వరుఁడు
౨—హస్తినాపురయువరాజు—
౧స—ఆయనవచ్చి మమ్ము రాజకుమారి యెక్కడ అని అడిగెరి
౨స....ప్రమదోద్యానమున నున్నదని మేము చెప్పితిమి.
౧స—తర్వాత నీప్రియుఁడు మావంక చూచి ఆమెతో నేమా టాం
చెము మాటాడఁ దలఁచితినని చెప్పుఁడు అనెను.

అస——తర్వాత మేము తిరిగివచ్చితిమి.

౧...అయితే ఇంకనాలస్యమెందుకు? మేము మంగళాచరణమాచ
రించుదుమా?

అస ...మంచిది. (ఇష్టలుపాడుదురు.)

నృత్యగీతము.

ఋతురాజం బరుదెంచె వసంతము
ద్యుతి ( తుళ్లిలు వహియించెగా
వితతన శికామధురగానములు
విపినమ్ముల వ్యాపించెగా
మృదులసుగంధకళోని వాతములు
హొంగరళ్ళగా పీచెగా
ముదితకోకిలాకలకూజితములు
ముఖరితమ్ము వనిఁ దోఁచెగా
తడవిఁ కేల ధరియింపు సిలప
స్రమము దాల్చుము సుమమాలగా
నడుపు విరహిణీసఖి! వేగము కుం
జగృహమ్మున కీవేళగా
మంచిమంచి కుసుమమ్ములు గోసి ర
చించెద నులకుల సెజ్జగా
కొంచపడకు హృదయేశుఁడు నేఁడరు
దెంచి మించు నీసజ్జగా

అంబ——వారు వచ్చుచున్నటులున్నారు.

౧స....వా కే.

అంబ——ఎక్కడ? కాదు. వారుకాదు.

అస...ఎక్కడ?

అంబ——అయితే ఈపదధ్వని యెవరిది?

౧స...పదధ్వని యెక్కడ?

అంబ. జీర్ణపత్రములమర్మరధ్వని.

౨స.. నిజముగా మాకేధ్వనియు వినిపించలేదు సఖీ!

అంబ—నాగుండె దడదడ కొట్టుకొనసనది

౧స...కావచ్చును

౨స.. అవును,

౧స. సఖీ! కొంచెము నూపూర్వదిక్కువంకం జూడుము, పూర్ణ శశాంకుడెట్లు ప్రకాశించుచున్నాడో!

౨స. ఈవేళ పూర్ణిమయా?

౧స—అవును నేడు పూర్ణిమ.

౨స—చల్లగాలి వీచుచున్నది

అంబ—కాని నాయొడలియందుష్ణరక్తము ప్రవహించుచున్నది. తన సహెలికతో రావట్లు?

౧స—వారికి తెలియనిదేమి?

౨స—ప్రేమికుడు ప్రేమికయు సంయోగసమయమున తమవెంట నెచ్చెలులుండుట కష్టపడరు

౧స ఇష్టపడకుండుట యేకాదు, వారినొక పీడగా దలంచెదరు వారు తమసుఖము నపహరించెదరనునట్లు తలంచెదరు రమ్ము పోదము! (పోయెదము సఖీద్వయము నిష్క్రమించును)

అంబ—నాపాదములేల యిట్లు వణకుచున్నవి? నేనేమియు పసికూనను కాదుగదా. నేడు నాహృదయము భయసంశయములచే నేల కొట్టుకొనుచున్నది,

(ఉల్లసితభావముతో భీష్ముడు ప్రవేశించును)

భీష్మ—ఇదిగో ఆమె యిచ్చటనే యున్నది. క్షణమాత్రము మీరు వర్ణప్రతిమను జూచెదరు మరల సీమెను విస్మృతిజలమున విడిచెదను ఆహా! ఎట్టి అపూర్వగరిమ! నీలనిర్మలాకాశమున వెలుంగు విషయాంతేక దూరగసుప్రీతమగు సముద్రసంగీతమా! ఈమనోవికృతవలయము! స్వర్గీయదేవతలారా! ఈహృదయమునకు బలమిమ్ము సందేహద్వైవిధ్యములచే గొట్టుకొను ఈ వ్యాకులచిత్తమును శాంతపఱచుడు దేవతలారా! నన్ను

అగ్నిజ్వాలవలెను, ఝంఝూవాతమువలెను కాలరాహువు వలెను భయంకరమగు స్వార్థమే యిప్పుడత్యంతధర్మము నేడు నీ వా దేవవ్రతుని మఱచిపొమ్ము. వానిస్థానమున నేడీనూతనసన్యాసియగు దేవవ్రతుని కన్నెత్తిచూడుము. సర్వసత్యాగమే వీనిధర్మము. జీవితమువరకు సాధనముచేయుటయే వీనిపని. సన్యాసమే వీనివ్రతము. వీనిప్రేమ వాసనచే నద్వైతముగాదు. కామముచే నుగ్రముగాదు. స్వార్థముచే నంధముగాదు. కామస్పర్శముచే నపవిత్రముగాదు. సుఖలాలసత్వముచే తీవ్రముగాదు. వీనిప్రేమ యున్నతము నుదారము. వీనిప్రేమ ఆకాశమువలె వ్యాప్తము, సముద్రమువలె స్వచ్ఛము, పృథ్వివలె సహనశీలము. ప్రభాతసూర్యునివలె ప్రకాశమానము. మాతృస్నేహమువలె శాంతము, నిరపేక్షము, నిర్మలము, నిర్బాధము. దేవి! నేడు దేవవ్రతునిం జూడుము. నీపాపముల యందితఁడు ప్రేమభిక్షుకుఁడుగాఁడు.

అంబ.. నా కేమియు తెలియుటలేదు నేను మేల్కొనియేయుంటినా? నీ వేమి చెప్పుచుంటివో నా కేమియు తెలియుటలేదు శంతనుకుమారా! నీవు నన్ను పెండ్లియాడుటకు గాలేదా?

భీష్మ—బాగుగా నెఱిఁగితివి.

అంబ—మఱి యేలవచ్చితివి?

భీష్మ—ఈజన్మాంతరమువఱకు నీతో నావీడ్కోలు తెలిగించుటకు వచ్చితిని.

అంబ—వీడ్కోలా?

భీష్మ—అవును. జన్మాంతమువఱకును.

మ॥ నిరతానందసముజ్జ్వలమ్మును, శరన్నీరేజపత్రాక్షసుం
దరమున్, మందవిముగ్ధహాసకిరణోదారంబు, నిర్వ్యాజప్రే
మరసావిష్కృతమున్, మనోజ్ఞము, త్రపామాన్యంబు రాకానిశా
కరతుల్యంబగు నీముఖంబు నిఁక నేఁగాంచన్ జుమీ కోమలీ॥

దేవీ!

గీ॥ సమధికావేశపూర్ణ నిండి సరళమలయి
సత్యమతయు నిర్మలతయు గొనంగఁజూప
ఇంచి ప్రేమామృతంబు వర్షించు నీదు
పలుకు లింక వినంజుమ్మ యుత్పలాక్షి॥

అంబ—ఏమి దేవవ్రతా! నేఁడేల యిట్టి దారుణ వచనమ్ములు పలుకుచుంటివి!

సీ॥ కరములనొగ్గి మోకరిల గూర్చుని రూప
భిక్షుకుండ నటన్న విన్నపంబు
పలుకుపలుకున వ్యంగ్యభావంబు గల్పించి
రసముట్టిపడగ వాగ్రచన సేత
పెరకన్నెయని సుంత వెఱువక ప్రేమన
ర్తనకుఁదొడంగిన నాటిచోరవ
ముందుకేగుచు నేనమ్మున వెన్కకుఁజూచి
నగుమోము వంకించు నాటివడుపు

గీ॥ అన్నియును నింతలో మాయమయ్యెనొకొ—
నాదుప్రేమను వీక్షింపఁగాఁ దలంచి
బొల్లుకైతల నీగతి నల్లితొకొ—
చాలు దేవవ్రతా! నీదుజాణతనము॥

గీ॥ నాదుజీవితసర్వధనమ్ము నీదు
నంఘ్రులకుఁ జేసియుంటిని నర్పణమ్ము
ధర్మపన్నాలు సెప్పెదు తలఁపవింత
వలచినపడంతిఁ దలఁగుట పాడియగునె॥

భీష్మ—ప్రాభాతికసౌవర్ణకిరణోజ్జ్వలమగు నొకమేఘప్రాసాద మాకాశమున లీనమయ్యెను ఒకఝంకారము వెడలుటకుమున్నే నిలచిపోయెను ఒకసువర్ణస్వప్నము తునియలై నీపాదముల క్రిందఁ బడినది.

అంబ—ఏమి!ఏమి ప్రియతమా?

భీష్మ నీకును నాకును మధ్య నొకయగ్నిసముద్రము బొబ్బరిల్లు
అంబ...ఏమి? చెప్పుము! చెప్పుము! (చున్నది.
భీష్మ—సోదరీ! నేను శాశ్వతబ్రహ్మచర్యవ్రతంబును బూనితిని.
అంబ ఎందుకు?
భీష్మ. మానాయనగారిసంతుష్టికై నేను ప్రతిజ్ఞ పట్టితిని ఇంక నా కీజన్మములో వివాహమున కధికారము లేదు
అంబ.. నిర్దయుఁడా ఇప్పుడు నన్ను ప్రేమించుటలేదని నిజమేల చెప్పవు.
భీష్మ...ప్రేమింపుచున్నాను చాల ప్రేమింపుచున్నాను. నాప్రాణములకంటె నెక్కువగ ప్రేమింపుచున్నాను కాని కర్తవ్యముకంటె నెక్కువగ కాదు.ఇంక నన్ను వీడ్కొల్పుము.
అంబ—దేవవ్రతా! (ఏడ్వసాగును)
భీష్మ—దేవీ!

ఉ॥ నీదయనాంబుపూరమున నీరజలోచన! నాయతీవసౌ
ఖ్యానుభవంపుసంస్మృతియు, నైహికమున్, బరమున్, జరాగతం
బౌనలచిత్తశాంతియును నన్నియుఁ గొట్టుకపోవుగాక స,
మ్మానితమౌచు నాప్రతిన మాత్రము మచంచలమై తనర్చుతన్॥

దేవీ! యుత్తరంగితమగు నీయశ్రుధారాసముద్రమున సర్వస్వమునష్టమగుఁగాక, కొట్టుకొనిపోవుఁగాక, నాకర్తవ్యముమాత్రము పర్వతమువలె గర్వముచే దలయెత్తుకొని నిలఁబడియుండుఁగాక. ప్రాణాధికప్రియవగు సోదరీ! ఇంక నాకుపోవుటకు ననుజ్ఞయిమ్ము
అంబ—వద్దు—వద్దు—వెళ్ళవద్దు,
భీష్మ—దేవవ్రతా! దృఢచిత్తుఁడవు గమ్ము, సోదరీ! వెళ్ళుచున్నాను.
అంబ...ప్రియతమా! వెళ్ళవద్దు.
భీష్మ—

మ॥ కనుదోయిన్ దెఱవేయుమాశ్కిలిగడున్ గాఢాంధకారమ్ము నే
ర్వేను, గనుపట్టుట లేదు నాకిపుడు దారిన్ జూపు కర్తవ్యమా!

ఘనమా నీవికటానిలంబున నలంఘ్యంబౌచు నీ బిగ్గు బి
ల్గుగా కారా, పాటిపొమ్మిక మతిన్ గోల్పోక దేవవ్రతా!
దేవీ!ఇదియే నీకడసారి చూపు.

అంబ— వెళ్ళవద్దు, వెళ్ళవద్దు

భీష్మ... సోదరీ! వెళ్ళుచున్నాను.

అంబ— నేను ప్రార్థించుచున్నాను వెళ్ళవద్దు.

భీష్మ— కాదు సోదరీ! వెళ్ళనిమ్ము వెళ్ళుచున్నాను.

అంబ— నీకాళ్ళపైఁ బడుచున్నాను.

భీష్మ— నామాట వినుము వెళ్ళుచున్నాను.

అంబ— హృదయేశ్వరా! (కవుగిలించుటకు ముందుకుఁబోవును.)

భీష్మ— లేదు వెళ్ళుచున్నాను (ప్రస్థానము)

(అంబ మూర్ఛితయై క్రిందఁబడును.)



# భీష్మ.

## ద్వితీయాంకము.

### ప్రథమదృశ్యము.

శంతనుని పడకటిల్లు — రాత్రి

(శంతనుఁడు కూర్చుండియు సత్యవతి నిలువఁబడియు నుందురు)

శంత— ఇరువది వర్షములనుండి తదేకనిష్ఠగా విషయభోగముల నొందుచుంటి అయినను తనివిదీఱలేదు ఇరువదేండ్లనుండి నీవు నాతృషితనేత్రములలో యౌవనామృతమును బోయుచుంటివి కాని పాత్రి మేమాత్రమును తరుగక సుధాపూర్ణముగ నున్నది

సత్య... మహారాజా! కాటికికాళ్లుసాచితివి. ఇంకను నీతృష్ణ దీరలేదా? అగుచో నీవాయమృతము నింకను ద్రావుము, ఇంకను ద్రావుము, మృత్యుపర్యంతము త్రావుము. ఇంక నెన్నిరోజులు! బ్రతికియున్నంతవఱకు త్రావుము.

శంత... ప్రేయసీ! నిజము చెప్పితివి ఇంక నెన్నిరోజులు జీవించెదను. ఆనాటికానాఁడు జీవనసోపానములనుండి అతిత్వరితముగ క్రిందకు దొరలుచుంటిని జీవనహ్రదముయొక్క అంతస్థలము చాల చేరువనున్నదని నేనెఱుఁగుదును ఇంక నెన్ని రోజులు! సత్యవతీ! నీవు నిజము చెప్పితివి. ఇంక నెన్నిరోజులు!

సత్య... జీవించినన్నిరోజులు సుఖముగ త్రాగుము.

శంత— సుఖముగనా! సుఖముగఁగాదు ప్రేయసీ! నీసౌందర్యమమృతముగాదు. అది గాఢమైనమద్యము

గీ॥ క్రోలుకొలఁదిని చిత్తంబు గొల్లకొట్టి
అంధకారంబు గన్నుల నావరింపఁ
జెలఁగి జనులఁ గర్తవ్యవర్జితులఁ జేయు
మద్యమట్టుల సౌందర్యమదము జగతి!

సత్య—అట్లైచో దాని నేల త్రాగెదవు?

శాంత—అలవాటునుబట్టి ప్రేయసీ! జనులు మద్య మేల త్రావె దరు? ఇదుగో చూడుము, నిన్ను ప్రేయసీయని పిలుచుట యు నలవాటునుబట్టియే

సత్య—నిన్ను ప్రేమసంబోధనము గోరువా డెవరు?

శాంత—నీవు గోరుటలేదని నే నెఱుగుదును. ప్రేయసీ! కాని యే మిచేయుదును, అది యొకఅలవాటుపోయినది ఈనీయతిసుం దరమగు రూపమును, నీయనంత యౌవనమును విషమని యెఱింగియు దానిని నేను గోరుచున్నాను. ఈసుందరదే హము నాదికాదని యెఱింగియు. ఈహృదయశూన్యమగు పాషాణప్రతిమ నాతురతచేఁ గౌగిలించుచుంటిని,

సత్య—మహారాజా! నన్ను వృథాగా నిందించుచుంటివి.

ఉ॥ ఎంతటిలాలసాపరులు సీ! మగవారిల నీశుసృష్టిలోఁ
గాంతములైనవస్తువులఁ గాంచిన స్వీయభక్తి హెచ్చఁ దా
మెంతయుఁ బారాజ్యభావన సహించుట న్యాయ్యముగాక యిట్టిదు
శ్చింతన లూనఁగా నెటులఁ జెల్లు నో యింత వివేకశూన్యులే॥

గీ॥ సహజసుందరవస్తుల సహజప్రే
ధనము వెచ్చించి కొనుట యుక్తంబుగాక
బలము నైశ్వర్యమును జూపి బలిమిఁ బడయు
టెంతటియమానుషంబుగా నెంచవలయు॥

గీ॥ మించి మోహాంధులై క్రిందుమీఁదు గనక
యెట్టికష్టమ్మునకే నోర్చికట్టుకొందురు
అక్కటా లుదీఱుపెన్నిటనరయవలయు
నీమహాత్ముల నైరాశ్యహృదయములను॥

మీపురుషజాతి చాల కఠినముగను, మమకారశూన్యము నై యున్నది. మీ రేచటనేని యొకసుందరిని జూచెదో అం ధులౌనాసక్తులై దాసులై పరుగెత్తెదరు తల్లియొడినుండి దాని లాగికొనునప్పుడు మీరు నిగ్రహింపరు. కామవ

శులై దానిని కుత్సితదృష్టితోఁ జూచుచు పైఁగా అది మిమ్ము ప్రేమింపవలయునని యాసించెదరు. మీ రింతసుందరులును గుణవంతులును—ఇంక మీముందు స్త్రీజాతికి హృదయము, ఇచ్ఛ, స్వాతంత్ర్యము లేనే లేవు. ఆమది మీకు కొని తెచ్చుకొనినదాసి. ఆదుది మీకు రమణిగాదు, కామిని. మీరు ప్రభువులు. స్త్రీ మీకు భార్య. భరింపఁదగినది నీవైశ్వర్యబలముచే నాశరీరమును గొంటివి. కాని నా హృదయమును గొనలేదు.

శంత....పతిపత్నీసంబంధము పూర్వజన్మసిద్ధమని నే నెఱుఁగుదును ఇది కల్పితముగాదు. శాస్త్రవచనము.

సత్య—అయితే నీవు పూర్వజన్మమునుండియే యీభార్యాశతమును నీకాళ్ళ కంటఁగట్టుకొంటివా? మహారాజా! నీ వీజన్మములో పాపముఁజేసి ముందు జన్మములో పశువుగనో వృక్షముగనో జన్మించినచో అప్పుడును నీ కీవందలకొలఁది భార్యలుందురా? కాదుకాదు మహారాజా! విధాత నిశ్చయముగా జన్మజన్మాంతరములందును పురుషులకు బానిసలగాఁ జేయుటకే స్త్రీజాతిని సృజింపలేదు శాస్త్రవచన మనుచుంటివా? శాస్త్రమెవరు నిర్మించినది మహారాజా! పురుషులే తమసుఖమునకై, తమశాంతికై, తమస్వతంత్రతకై, తమవీలునకై శాస్త్రముల రచించిరి. శాస్త్రకారులు స్త్రీలేయగుచో శాస్త్రవిధానము మఱియొకవిధముగ నుండెడిది. ఈక్రీతశరీరమును గ్రహించి సంతుష్టుఁడవు గమ్ము. నీవీహృదయమును బొందలేదు. ఇఁక నెన్నటికిని బొందవు.

శంత—ప్రేయసీ! ఎఱుఁగుదును. వైముఖ్యతవహించు నీయధరమందును, శీతలమగు నీదృష్టిపాతమునందును, అనిచ్ఛాకృతంబును నిర్జీవమునగు నీశిథిలాలింగనమునందును, నా కది బాగుగా అనుభవమైనది. నే నెఱుఁగుదును. అక్కటా! మొదటనే యెఱిఁగియున్నచో—

సత్య—ఎఱుఁగుటకు నీ వెన్నఁడేని ప్రయత్నించితివా మహారాజా? ఉన్మత్తాహంకారమును, అంధవాసనయు నిన్నింతగా వశప అచుకొనుటచే నీవెప్పుడును నే నెవ్వతెనో, నాస్వభావమున నేమి లోపమున్నదో, నే నెన్నఁడేని యెవ్వరికేని నాహృదయ మర్పించితినో లేదో, నే నెవ్వనికేని యుపభుక్త నైతినో లేదో అని నీవు విచారించి తెలిసికొనలేదు ఈయపూర్వరూపమును చూచీచూచుటతోడనే మనస్సు నిలుపుకొనలేకపోతివి. ఉన్మత్తుఁడవు, అధీరుఁడవు, అంధుఁడవు, కామదాసుఁడవు—అసలు మీపురుషజాతియే యిట్టిదికదా! ఛీ! ఈ జాతి కనేకధిక్కారములు.

శంత...సత్యవతీ! నీవు చెప్పినది సత్యము. కటువైనను యథార్థము ప్రేయసీ! ఏమిచేయుదును? మందు రోగికి మధురముగనుండదుగదా! ధనముచే రూపము గొనవచ్చునుకాని ప్రేమ కొనబడదు నీదోష మేమియు లేదు. దోషమునాదే.

సత్య...ఇప్పటికి తెలసినది.

శంత—నేను పొరబడితిని

సత్య....ఇంకనేమి దానిఫల మనుభవించుచుంటివి. నే నేమి సేయుదును? నన్నువిన లాభము లేదు

శంత...(విచారముతో) ఎఱిఁగియున్న దో—

సత్య...ఎఱిఁగియున్నచో నా? ఇప్పటికివి నీ వేమియు నెఱుఁగవనియే నాకు విచారము.

శంత...ఎఱుఁగుదును.

సత్య—ఏమియు నెఱుఁగవు నీ విదియే యెఱుఁగుదువు—నేను ధీవరకన్యను. ఋషివరముచే రూపవతిని. అనంతయౌవనను నీ విదియే యెఱుఁగుదువు—నీవలన నాకు ఇద్దఱు పుత్రులుగలిగిరి అంధకారబంధురమగు నాపూర్వచరిత్రము నీ వేమి యెఱుగుదువు? అది యెఱిఁగినచో మంటలోఁబడిన యీపువవలె మలమలమాడి మసియయ్యెడివాడవు.

శంత—అదియేమి ప్రేయసీ! ఆయపూర్వచరిత్రమేమి?
సత్య—ఎఱిఁగి యేమి చేసెదవు? దాని నెఱుఁగుటకు నీ వెన్నడు
ను దలఁపవద్దు. ఈ బ్రతికెడు రెండురోజులు నాయంధకార
ములోనే కడపుము నీవు వృద్ధుఁడవు. ఎఱుఁగవలదు.
శంత—ఏమైనఁగానిమ్ము. నే నెఱుఁగఁ గోరితిని.
సత్య—కాదు కాదు. నేను చెప్పఁజాలను మహారాజా! నే నెప్పుడే
ని ఈమాట చెప్పవలయునని నానాలుక రాదు. ఒకవేళ వచ్చిన
ను భయముచే నిష్ప్రభమగు నాయధరము ఎచ్చి వెంటనే
నోరు మూయును. కన్నులముందు నంధకారమే కనుపట్టును.
ప్రపంచములో నొక్కయార్తనాదముదక్క వేఱేమియు నా
కువినిపించదు మహారాజా! శాంతింపుము. ఆశబ్దములు విని
నదోడనే నీపితృకులమంతయు నార్తనాద మొనరించును. నీ
మాతృవంశమంతయు నొక్కమాఱుఁగ గంపించును.

(అతిశీఘ్రముగ నిష్క్రమించును)

శంత—ఆయంధకారమయమగు నితిహాస మెయ్యది? ఇదిగూఢసం
కేతముగ నున్నది ఇంతకన్న స్పష్టముగ వక్కాణించిన బా
గుగా నుండెడిది. అహా! సుందరీ! నీ వెంతభయానకవు. ఎం
తస్నేహశూన్యవు నిమేషమాత్రమున ప్రపంచమునఁ బ్రళ
యముపుట్టింపఁ జాలుదువు.

(చిత్రాంగద విచిత్రవీర్యులు ప్రవేశము.)

ఇద్దఱు...నాయనగారూ! నాయనగారూ! ఈవేళ—
శంత—పొండు. నన్ను విసిగించకుఁడు (ఇద్దఱు పోవుదురు) వీ రె
వ్వరు? వీరు నాపుత్రులా? ఇది యేమి! ప్రపంచమంతయు
పొగమంచుగప్పినట్లున్నది.

(మాధవుఁడు ప్రవేశించును.)

శంత—ఎవ్వరు? మాధవా! నీవు చెప్పినది సత్యము.
మాధ—ఏమియది మహారాజా?
శంత—చెప్పను. దాని నుచ్చరింపను. చెప్పినచో నీవునువిజభావము

తో నాఁడు నేను చెప్పలేదా అందువు అసలు ఉపదేశమే కటువు. అందులో నీ 'నేను చెప్పలేదా' అనునది మఱియును కటువుగ నుండును. మిత్రమా! నాయపగాధముల నెల్ల క్షమింపుము. రమ్ము, నిన్నొకమాఱు కౌఁగిలించుకొందును
(కవుఁగిలించుకొనును.)

మాధ—నా కేమియు తెలియుటలేదు.

శంత—తెలిసి ప్రయోజనము లేదు

మాధ—మహారాజా' నేఁను కొంచె మస్వస్థతగా నుంటి రా?

శంత—అస్వస్థమా?—అగ్నిభతము.

మాధ—చూచెదను. (నాడిచూచి) ఇదియేమి మహారాజా?

శంత—ఏమి? ఎటులున్నది?

మాధ—మీకు జ్వరముగానున్నది. వైద్యుని పిలుతునా?

శంత...నాయీ వ్యాధిని కుదిరించు వైద్యుఁడు ముల్లోకములందును లేఁడు. మానవునియారోగ్యదుర్గమును ముట్టడించిన మృత్యుసేనయో యన జ్వరము, వాతము, విషూచిక, క్షయ మున్నగు నెన్నియో రోగములు గలవు. ఇవిగాక మానవుఁశరీరములో నింక నెన్నియో రోగములు గలవు. వీనిపేళ్ళు ఆయుర్వేదములో లేవు. వీనికి చికిత్సలేదు ఇవి క్రమక్రముముగ, గానరాకుండ జీవితంపు పునాదులను ద్రవ్వివేయును. మానవునిలలాటమున దీర్ఘరేఖలను గీచును. నేత్రములపై గాఢాంధకారమును గప్పును ఈమాట లటుండనిమ్ము—వినుము. నీవు నా శోకమితుఁడవేకావు

మాధ...విదూషకుఁడను.

శంత...నీయిచ్ఛ వచ్చినటుల నెత్తిపొడుపుము, దుర్భాషలు పలుకుము. తలవంచుకొని అన్నియు సహించెదను. మాధవా! యిప్పుడు నాప్రార్థన యొకటి యున్నది. నేను చచ్చిపోయినపిమ్మట నీ వీయిద్దఱపిల్లలను గనిపెట్టియుండుము— కాదు కాదు నీ వేమియుఁ జెప్పకుము. మఱియువినుము మిత్రమా!

దేవవ్రతుని నాయొద్దకుఁబంపుము నీ వేమియుచెప్పకుము మిత్రమా! మఱియొకప్పుడు నీవు చెప్పఁదలఁచినది చెప్పుదువుగాక ఇప్పుడు నేనేమియు వినఁజాలను. పొమ్ము మిత్రమా

(మాధవుఁడు నిష్క్రమించును)

శంత...తనపుత్రుని సన్యాసినిఁ జేసి తండ్రి విషయలోలుఁడగుట ఈఅన్యాయమును. ఈస్వేచ్ఛాచారమును ప్రకృతిసహింపఁగలదా? ఈక్రమవ్యతిక్రమము పోయినది. ప్రకృతి మరల యథాస్థానమునొందినది.

(శాల్వుఁడు ప్రవేశించును.)

శంత—సౌభనరపతియా?

శాల్వ—మహారాజా!—

శంత....ఏమియు చెప్పవలదు. ఇంక—ఇంక—సౌభనరపతీ! సుఖముగ నుంటివా?

శాల్వ—నేనా? సుఖముగ నుంటిని.

శంత—సౌభరాజా! ఆనందమా?

శాల్వ—ఆనందము.

శంత...నీకు అతిథిసత్కారము యథోచితముగ జరిగినదా?

శాల్వ...బాగుగ జరిగినది.

శంత—సౌభరాజా! దానికిఁ బ్రత్యుపకారము బాగుగఁ జేసితివి. దానికిబదులుగ నిన్నొకభిక్ష గోరుచున్నాను.

శాల్వ—ఏమిశంతనూ?

శంత—నాయెదుటనుండి తొలఁగిపొమ్ము. ఇంకరావలదు. పొమ్ము పొమ్ము సౌభపతీ' (శాల్వుఁడు పోవును.)

శంత—తగినశాస్తి జరిగినది, భోగలాలసకు దగినశాస్తి జరిగినది కన్నకొడుకును వంచనచేసి, లేదు లేదు— ఏమియు దుఃఖము లేదు— ఈశ్వరా! నీనియమ మత్యద్భుతము. నిజసుఖముని వర్జించి పుత్రునికి శుభముగూర్చుట తండ్రికిఁ గర్తవ్యము కాని నేను పుత్రునిసుఖము — (గద్గదస్వరముతో) లేఁ

లేదు—ఏమియు దుఃఖము లేదు.

(భీష్ముఁడు ప్రవేశించి నమస్కరించును.)

శంత... దేవవ్రతా! వచ్చితివా?

భీష్మ... వచ్చితిని నాయనగారూ! మీదేహ మెటు లున్నది?

శంత—బాగుగ నున్నది. కుమారా! నీవలన నే నొకభిక్ష నపే క్షించుచున్నాను. నాకు దాని నొసఁగెదవా దేవవ్రతా?

భీష్మ—నాయనగారూ! ఏల యటుల నెదరు? మీయాజ్ఞయగుచో నేను ప్రాణములేని ఈయఁజాలుదును.

శంత—ప్రియకుమారా! నే నిది యెఱుఁగుదును. మంచిది విను ము—ప్రాణాధికకుమారా! మరణించుటకుమున్న నినొ్క కపనికై నిర్బంధపెట్టుచున్నాను. నీవు తప్పక వివాహముచేసి కొనుము. ఇదియే నానిర్బంధము.

గీ॥ మొనసి జనకునిలాలసాపూర్తియందు
నిహముసెల్లను హులికముగావించితీవు
కేలుసెప్పక పుత్రికా! పెండ్లియాడి
పరమునేనియు సింకఁ గాపాడికొనుము॥

దేవవ్రతా! ఇవ్విషయమై నీప్రతివాదమును నేను వినఁ గోరుటలేదు తప్పక వివాహముచేసికొనుము. ఇంక నేమి చెప్పుదును కుమారా?

ఉ॥ కాటికిఁగాళ్ళుసాపు ముదికాలమునం దతిలాలసాంధుఁడై
చేటుకుఁజంక కాత్మజునిజీవితమెల్లను బుగ్గిసేసి మా
మోటములేక యీతఁడను భార్యపకీర్తి వహించినాడ నా
లోటును పైపుకుయ్యమదిలోఁ గృశఁబూనగదయ్యపుత్రికా॥

భీష్మ—ఏమి యట్లనెదరు నాయనగారూ?

శంత... వద్దు వద్దు. ఏమియు నడ్డుచెప్పవద్దు, నాహృదయముముక్క లుముక్కలగును పొమ్ము దేవవ్రతా! పొమ్ముప్రాణాధికా! మఱియొకమాట. వత్సా! నేను పోయినపిమ్మట నాయుప రాధములను సాధ్యమైనంతవఱకు దయతో విచారింపుము,

# ద్వితీయాంకము.

ఘోమ్మ్న నిద్రపోయెనను. తలుపువేసిపొమ్మ్న.

(పరంపము)

---

## ద్వితీయ దృశ్యము

హస్తినాపుర రాజప్రాసాదము వద్ద నొకచిన్నయిల్లు

ప్రాతఃకాలము.

(దాశరాజును అతనిమంత్రియు)

దాశ...అల్లుడియిల్లుగదాయని వచ్చాను కాని ఇక్కడ ఎవరూ నాఅతీగతీ కనుక్కోవడం లేదు. ఏం మంత్రీ?

మంత్రి...ఏదీ కనుక్కోడం లేదే.

దాశ...అయితే నేనూ వకరాజునేకా?

మంత్రి—ఈరాజగృహంలోని వారెవ్వరూ అదిఒప్పుకోడంలేదు.

దాశ...ఒప్పుకోవాలి. ఇదికాకుండా నామనుమడే రాజౌతాడు. ఏం మంత్రీ?

మంత్రి—అదెట్లాగో రాసిందే.

దాశ...అయితే ఈసంగతి ఎవ్వరూ ఆలోచించడంలేదు.

మంత్రి...లేదు.

దాశ...ఇది తోసిపుచ్చాలని సూస్తుండారు.

మంత్రి...అట్లాగేవుండి.

దాశ...ఇదికావడానికి ఈల్లేదు. దీనికోసం పోట్లాడ్తాను.

మంత్రి...వాళ్ళు అసలు ఒప్పుకుంటేగద.

దాశ...ఒప్పుకోరా? నేను మారంజగాగిమామను. ఇదిఒప్పుకోరూ?

మంత్రి...ఎక్కడ ఒప్పుకుంటారు?

దాశ...ఒప్పుకునేతట్టు లేదా?

మంత్రి...ఏమాత్రమూ.. లేదు.

దాశ—ఏం! ఇదేంగొట్టుమాట కాదే. మారాజుమాఅమ్మాయిని

యి వాగంఅడాను దీన్నిబట్టి మామనుకాకపోతే మరే మవుతాను?

మంత్రి...ఇది చాల తేలికిమాట.

దాశ...అయితే ఇది తెలిసికోడానికిఈళ్ళ కింతసే పెంకుపట్టాలి?

దాశ—ఊఁ (మీసాలు మెలిపెట్టుచు) ఏం మంత్రీ! నామొహం పెద్దమడిసి మొహం ఆలే వుందా?

(భృత్యునితో విచిత్రవీర్యుఁడు ప్రవేశించును,)

దాశ—ఇదుగో ఈడే ఈడే నామనుమడు. రా, అబ్బాయా!

విచిత్ర—ఇతఁ డెవఁడు?

భృత్య—ఒక అడవి మనుష్యుఁడు.

దాశ—(కోపముతో) ఏమీ?—అడవి మడిసా?

భృత్య—రండు రాజకుమారా! (భృత్యునితో విచిత్రవీర్యుఁడు నిష్క్రమించును)

దాశ—(ఆశ్చర్యముతో) ఆ తెలిసిఁది మంత్రీ బాగా తెలిసింది. బలేయూసం యేశాను. ఏంలాభఁ లేకపోయింది.

మంత్రి....మహారాజా! ఇక్కడ మనకేం బాగావుండేతట్టు లేదు,

దాశ—వుండేతట్టులేదు?

మంత్రి—లేదు. యెల్దాం పదండి.

దాశ...ఆ! యెల్దామా? యెందుకూ ఎల్లడం?

మంత్రి . లేకపోతే మెడపట్టి గెంటుతారు.

దాశ—ఆఁ! ఆఁ! మెడపట్టా? ఏమన్నావూ?

మంత్రి—పెళ్ళానికి జడిసి అల్లుడింటికి పిలవకుండా లగెత్తుకొచ్చేవాళ్ళకు ఇలాంటి మర్యాదే మారాజా!

దాశ—ఇలాంటిమర్యాదేనా?

మంత్రి.. నా కల్లాగే కనపడుతూంది.

దాశ....అల్లాగే కనబడుతుంగా?

మంత్రి...పద్దతేం బాగోలా, మారాజా! పదండి.

దాశ...ఊఁహూ. నేను యెల్లను. నేను యెల్లను నేను రాజుకు మా

మాను. నాకు సాటిచ్చి తీరాలి

మంత్రి—సాటి త్వరగా గుర్రాలసావిడి

దాశ—గుర్రాలసావిడా?

మంత్రి—అవును,

దాశ...మంత్రీ! మన్నడం పొరపాటు. నేనురాజును, రాజుగారి మామను. నాకుంటానికి—

మంత్రి గుర్రా సావిడి.

(భృత్యునితో చిత్రాంగదుఁడు ప్రవేశించును.)

దాశ.. ఈయనే నా పెద్దమనుమడు

భృత్య—నీమనుమడా?

మంత్రి—శంతను మా రాజుగారి పెద్దకొడుకంటారు ఈయనేనా?

భృత్య అవును. అయితే ఏమి?

దాశ అయితే నాకు మనుమడే

భృత్య.. నీమనుమడా? ఓహోహో!

దాశ—నవ్వుతావేమిరా?— మంత్రీ!

మంత్రి. క్షేమంగా..!అదినాకు తెలియడంలేదు...మీరాజెవరు?

దాశ—ఆఁ మీరాజెవరు?

భృత్య.. శంతను మహారాజు

దాశ...నే నాయన మామను. (భృత్యుడు బిగ్గరగా నవ్వును.)

చిత్రాం.. (భృత్యునితో) ఎవ్వరితడు?

భృత్య.. ఒక పిచ్చివాఁడు.

చిత్రాం—రాజసదనములో పిచ్చవాఁడెందుకు? వెళ్ళఁగొట్టుము

దాశ...ఆఁ యెట్టా యెళ్లగొడతావు?

చిత్రాం—(భృత్యునితో) వెళ్ళగొట్టుము. (నిష్క్రమించును)

దాశ....ఎట్టా మంత్రీ?

భృత్య—వెడలిపొమ్ము.

దాశ ..ఎందుకు పోలతాను? నేను రాజుకుమామను. రాజువేడీ?

భృత్య. వెళ్లిపొమ్ము లేకపోతే మెడపట్టి గెంటెదను,

దాశ.... నేను రాజుమామను. నన్ను మెడపట్టి గెంటుతారా? (ఖాం ముపసంహరించి) నేను యుద్ధం చేస్తాను. యుద్ధం చేస్తాను,

భృత్య ఓరీ! (కత్తిదూయును)

దాశ. ఒరిబాబో! (వెనుకకు పోవును)

భృత్య... వెళ్లిపొమ్ము (మెడపై చేయివేయును.)

దాశ ఇదుగో వెడతాను.

మాధ (ప్రవేశించి) ఆఁ ఇక్కడేమి?

భృత్య. ఇతనిని గెంటుచున్నాను

మాధ.. ఎందుకు?

భృత్య. రాజకుమారుని మామట

మాధ—కాదు కాదు. ఈయన రాజుగారి మామ

భృత్య. అట్లాగునా? నే నింకపిచ్చివాఁడనుకొంటిని,

మాధ—పిచ్చివాఁడగుచో మామ కాఁగూడదా? రండయ్యా ఏమి యు ననుకొనకుడు

దాశ...ఏమియు ననుకోవద్దా? బాగా అనుకుంటాను. నన్ను అవ మానంచేస్తాడా? నేను ఇక్కడ చేస్తాను. నీకుతెలియదూ నేను రాజును—మంత్రి?

మంత్రి—మహారాజా! ఊరకోండి ఊరకోండి.

దాశ. ఆఁ ఊరకోవాలా? (మంత్రి సంజ్ఞచేయును,) మంచిది. ఈ తే [illegible]స్తున్నాను. రాజుగారేడీ?

మాధ. ఆయన చాల జబ్బుగానున్నారు. వారు ఎవ్వరికిని దర్శన మిచ్చు స్థితిలో లేరు.

దాశ...అయితే అంతఃకక్ష? నాకు వుంటానికి గుడారాలసావిడి యిస్తారా? నేను రాజుగారి మామనని యెఱుఁగరా?

మాధ...పొరపాటయినది. మీరుండుటకు నేను చూపెదను రండు.

దాశ—ఎక్కడ?

మాధ—పిచ్చిఆసుపత్రిలో.

దాశ—పిచ్చి ఆసుపత్రిలో నెందుకు?

వ్యాధ...మీరును రాజుగారి క్రొత్త వేటగుఱ్ఱమును ఒక్కసారే రాజద్వారమున అడుగుపెట్టితిరి. మిమ్ము పిచ్చిఆసుపత్రిలోను గుఱ్ఱమును గుఱ్ఱాలసావిడిలోను ఉంచవలసినదని సేనాజ్ఞాపించితిని. నౌకరులు పొరపాటున మిమ్ము గుఱ్ఱాలసావిడిలోను, గుఱ్ఱమును పిచ్చిఆసుపత్రిలోను ఉంచిరి—సేవకా! నీవీయనను పిచ్చిఆసుపత్రిలోనుంచిరమ్ము.

దాశ—నన్నా?

వ్యాధ...(సేవకునితో) తీసికొనిపొమ్ము. (ప్రస్థానము.)

మంత్రి...పదండి మారాజా! ఏమీ మాటాడకండి.

దాశ—ఎందుకు?

మంత్రి...పద్ధతి యేమీ బాగోలేదు.

దాశ...బాగోలేదా? (దాశరాజు రాణిప్రవేశించును.)

రాణి...ఇక్కడకీ వచ్చావూ?

దాశ...ఓరి బాబో! (వణకును.)

రాణి—ఇక్కడికి పారిపోయొచ్చావా? దిక్కుమాలినోడా! నే అనుదకున్నట్టే చేశావు. పద. యింటికి పద.

దాశ....నేనురాను. ఎందుకొస్తాను?— మంత్రీ!

మంత్రి...మారాజా! యింటికి పదండి. ఏమనకండి. ఇక్కడి మర్యాద చూశారుగా.

దాశ...ఏమైనాసరే నేను ఇంటికిరాను.

రాణి—రావా? (చెవిపట్టుకొనును)

దాశ...వూరుకో వూరుకో. వస్తున్నా పద.

రాణి...పద. (అందఱు పోవుదురు.)

---

## తృతీయదృశ్యము

హస్తినాపురమున రాజగృహము—రాత్రి

(విచారముతో భీష్ముఁడు తిరుగుచుండును.)

భీష్మ...ఔరా!

మ॥ వికటారావములన్ సృగాలములు పృథ్వి౯ బిట్టువిట్టెచుఁ దా
యక తన్పట్టెను ధూమకేతువు సతంబాగ్నేయకోణమ్మునన్
బ్రకటంబయ్యెడు నింటికొప్పుల రటధ్వాంక్షావళుల్, ఘోరదు
శ్శకునంబుల్ బలువయ్యె భావ్యశుభవిస్తారంబు సూచింపుచున్

అకటా! ఈదుశ్శకునంబులకు గతంబేమైయుండును? మహా
రాజు చాలకాలమునుండి కాతరభావముతో రోగశయ్యపై
బడియుండిరి. వారిస్థితి యేమియు బాగుగలేదు. ఏమి కా
నున్నదో తెలియుటలేదు. హాజగదీశ్వరా! నాయనగారిని
రక్షింపుము. వలయుచో నాప్రాణములు గొనుము.

(చిత్రాంగదవిచిత్రవీర్యులప్రవేశము.) (ప్రస్థానము)

చిత్రాం—అన్నయ్య యేడీ?

విచిత్ర—ఇచ్చటనే యుండవలయును

చిత్రాం...నాయనగారియొద్దకు వెళ్ళినట్లున్నాడు. ఆయన యెప్పు
డును నాయనగారితలయంపిదిక్కున కూర్చుండియుండును

విచిత్ర—అప్పుడప్పు డిచ్చటికే వచ్చుచుండును.

చిత్రాం...ఆయన చాలరోజులనుండి విచారగ్రస్తుఁడుగఁ గన్పట్టు
చున్నాఁడు.

విచిత్ర—మనతో నిప్పు డంతగా ప్రేమాలాపము లాడుటలేదు.

చిత్రాం...ఆయనకు తీరిక యెక్కడ?

విచిత్ర—నీవు అన్నను ప్రేమించెదవా?

చిత్రాం—ప్రేమింతును.

విచిత్ర...చాల?

చిత్రాం—చాల.

విచిత్ర...నావలె.

చిత్రాం...నీకంటె నెక్కువ.

విదిశ—ఉఁవచ్చా నట్టది

చిత్రా...రమ్ము. ఆయన యొక్క దయనాన్నఁడో చూతము.(ప్రస్థానము)

[విచారముతో సత్యవతి ప్రవేశించును]

సత్య...చాల మంచివరము, మహర్షీ! ఈ అనంతయౌవనము ముస లితనము ననుపసుపావిడిలో యౌవనజీవము కట్టఁబడియుండును. అయినను నీ వేమి చేయుదువు? నేను విలాసలాలసచే మూ ఢురాలనైతిని. నేనే స్వయముగ నీవరమును గోరి తెచ్చు కొంటిని అనంత యౌవనమున నవంత సంభోగమును కొంటిని కాని యీవరము మృగతృష్ణవలె సంభోగాభిలా షను ఉత్తేజితము చేయుచున్నదే కాని దాని కెప్పుడును తృ ప్తిఁగూర్చుటలేదు. ఇది యదృష్టరేఖవలె నాలలాటమున వ్రాయఁబడినది నన్నిది బానిసగాఁ జేసికొనినది రోగకీ టాణువులవలె నారక్తమునఁ గలసి యొడలెల్ల వ్యాపించి నది. మహర్షీ! నీవరము నీవే తీసికొనుము నన్ను స్వతం త్రను జేయుము

మాధవుఁడు—(ప్రవేశించి) తథాస్తు రాణీ! నీ వీక్షణమునుండి స్వ తంత్రవైతివి నీయనంతయౌవనమును నిరాతంకముగ నను భవింపుము మహారాజు స్వర్గస్థులైరి.

సత్య—ఏమి! మహారాజు స్వర్గస్థులై ,?

మాధ—అవును, ఇంక ననంతయౌవనమును భోగింపుము. పీడవదలి పోయినది. పతిఘాతుకీ! విచారించుచుంటివా?

సత్య—నేనా?

మాధ—అవును నీవే

సత్య—నేను పతిహత్య చేసితినా?

మాధ—తనచేతితో నెవ్వేని కత్తి పెట్టి నరకుటయు, అపాయకు నకుఁ విషమిశ్రితమగు మద్యము నొసఁగుటయునే హత్య గాదు సమతాశూన్యమగు వ్యవహారమాయును పట్టునకు

కత్తికన్న నెక్కువ గాయము తగిలించును. భయానకమగు కృతఘ్నత పాము కంటె గాటుగ కాలు వేయును. నీవు నింద్యుఁడగు స్వేచ్ఛాచారముచేతను దుర్వర్తనముచేతను బలిహత్య సేసితివి, పాపినీ —

సత్య—వృద్ధ దూషకా! ఏమి అసబద్ధప్రలాపము లాడుచుంటివి? నీవు వృద్ధుఁడవుగాన హస్తినాపురము రాణి నిన్ను క్షమించుచున్నది. పొమ్ము.

మాధ—పిశాచినీ! కులటా! (ప్రస్థానము.)

సత్య—మాధవా! ఇంత సాహసమా! నీయదరిపాటు నణఁచెదను. 'పిశాచిని' కులటా' ఇదియే నిజమగుచో నిందాక్షేపణ మేమున్నది? స్వార్థాంధుఁడగు పురుషుఁడు మొగమున ముడుతలు పడినను, బుగ్గలు సొట్టపోయినను, పళ్ళూడి పోయినను, రోగగ్రస్తుఁడై యింద్రియములు పటుత్వము తప్పినను, జరాజీర్ణుఁడైనను, నవయౌవనవ్యగ్రాలింగనమును, ఉష్ణచుంబనమును గోరుచో అది నాదోషమా? అగుఁగాక. మహారాజు మృతుఁడయ్యెను. ఇప్పుడు నేను పరాధీనను గాను. నేఁడు నాయిచ్ఛవచ్చిన పని సేయఁగలను. స్వతంత్రను ఆహా! ఏమియుల్లాసము! పగదీర్చుకొందును భోగమొందెదను. సంకోచమేల? బాల్యమున ధర్మము విడిచితిని. నేను ధీవరకన్యను. అనంతయౌవనను

(అలక్షితభావముతో శాల్వుఁడు ప్రవేశించును)

శాల్వ...రాణీ!

సత్య...(ఉలికిపడి) సౌభరాజా!

శాల్వ...మహారాజు చచ్చిపోయినాఁడు.

సత్య...వింటిని.

శాల్వ....ఇఁక—

సత్య....ఏమందువు?

శాల్వ....ఇఁక మహారాజ్ఞి స్వతంత్రురాలు.

సత్య...అవును. ఎఱుఁగుదును.

శాల్వు....అయితే—(ముందుకుఁబోవును)

సత్య...ఆగుము లంపటా!— నేను హస్తినాపుర మహారాజ్ఞినని మరవకుము.

శాల్వు—హస్తినాపురమహారాజ్ఞీ! ఇంక నీచలమెందుకు?

చ॥ తరుణిరో! నీవెఱుంగనియుదంత మొకింతయు లేదు. హస్తినా
పురమున నీదుపాదముల మ్రోలను దాసముఁ గోరి నే
జరిపితి నింతకాలమును, సాధన కింద్రుఁ డ యథార్థభిక్ష నా
దరణము సేయఁగాఁ గడు స్వతంత్రత గల్గెను గాదె నేటికిన్॥

శా॥ ఆరాకాశశిబింబతుల్యమగు నాస్యంబాశరన్నీరజా
కారంబౌ కనుదోయి, యాభుజలతల్ కామ్యాఖిలైశ్వర్యవ
త్సారం బైనయనంతయౌవనము, నాసౌందర్యసామ్రాజ్యమా
రారావ్యర్థములయ్యె నిందనుక వృద్ధాభోగపాత్రంబులై॥

చ॥ కడచినదానికిన్ వగవఁగాఁ బనిలేదిఁక నిప్పుడేని యీ
శుఁడు కరుణన్ వహించి గతిసూపెను నిన్ను స్వతంత్రఁ జేసి యో
పడతిరో! జాలమేల యిఁక భవ్యహిరణ్మయచంద్రశాలలన్
గడుపుము దక్కుకాలము సఖండసుఖంబుల నన్ను నేలుచున్॥

నెలకు పైగా వచ్చి నేను హస్తినాపుర ప్రాసాదమున అతిథిరూపమున నిలచియుంటిని. నేను నీరూపభిక్షుకుఁడనని నీవెఱుఁగుదువు. నేఁడు నీవు బంధవిముక్తవైతివి.

సత్య.. ఆలోచించుటకు సమయమిమ్ము.

శాల్వ...ఆలోచించుసమయము పోయినది.

సత్య—(విచారముతో) నీ వీ శాపరూపమగు వర మేల యిచ్చితివి?—వద్దు వద్దు, పొమ్ము. నీదేశమునకుఁ బొమ్ము.

శాల్వ...ప్రేయసీ!

గీ॥ ఏల సంకోచ మింక యోజించుకొనుము
మిక్కుటపుదుఃఖము విచార మొక్కవంక
స్వేచ్ఛయును జన్మసార్థక్య మింద్రవైభ
వమ్ము సౌభాగ్యోన్నతియు నొక్కవంకఁ గలవు॥

సత్య—జాగ్రత్త! రవులుకొనుచున్న లాలసానలమును కుటియును మండింపఁబోకుము. ఇది అగ్నిపర్వతము; పొమ్ము. తొలఁగిపొమ్ము. ఈహృదయములో శృంఖలానిబద్ధమైయున్న కామకేసరికి కోపము కలిగింపకుము.)

శాల్వ....(చేయి పట్టుకొనును)

సత్య—పొమ్ము. నీయీకామస్పర్శము నాయొడలినంతయు రోమాంచితము చేయుచున్నది. పొమ్ము (చేయి విడిపించుకొనును)

శాల్వ... ఏమిరూపము! (వెనుకకు తొలఁగును)

సత్య—వద్దు. వద్దు. ప్రియతమా! మునిగిపోవ్రదోవను ఈజలమందే మునిగిపోదును. నిప్పును గాలియు నేకమైనవి. ఇంక నాజీవితము భస్మమగుఁగాక. ఈశూన్యజీవితమునుబ్రియాంధకార మావరించుఁగాక. ఆయ ధకారము నేఁడు మహాశూన్యమున దిరుగు జ్వాలామయములగు రెండు పృథ్వీలను బలె అభిశప్తలగుఆత్మలు రెంటిని బ్రదీప్తముచేయుఁగాక. ప్రాణప్రియతమా! (చేయిపట్టుకొనును.)

(భీష్ముఁడు ప్రవేశించుచు)

భీష్మ—ఆగుము రమణీ....ఓహో! ఎంతనైచ్యము! ఏమిభయానకము! ఏమి బీభత్సము! ఇదియు ప్రపంచమున నున్నదా?... దయామయా! ఇదియు నీసృష్టియేనా? ఆహా! శాంతిప్రదమగు నీశరచ్చంద్రికను, ఘనపుష్ప భరితయగు నీపృథ్వీని, తారకాఖచితమగు నీనీలాకాశమును, నిర్మలజల పూరితములగు నీ నదులను, ఈపక్షులమధుర సంగీతమును, సుగంధబంధురమగు నీమందమారుతమును సృజించినవానిసృష్టియేనా యిది? స్నేహమయా! రమణీ! తుద కిదికూడ చేయఁగలవా? సోదరీప్రేమపరిచారకంబగు హృదయంబున—కన్యాస్నేహసుగంధితమగు హృదయంబున—క్రమానుగతవనితా ప్రేమాలింగనతరంగితంబగు హృద

యంబున — మాతృసుస్నిగ్ధపీయూషధారాపరివృతంబగు హృదయమున ఈఘోరభావనలుగూడ జనించునా? ప్రేమగంగాప్రవాహము వెల్లివిరియుచోట — ఆత్మసమర్పణపరిభాసితంబగు చోట — నిదియును సంభవమా? — ఓసీ పాపినీ! ఇంకను జనకుని శవ మట్లే పడియున్నది. ఇంకను దానికి దహనసంస్కారము జరుగలేదు ఇంకను జనకుని అంతిమోష్ణనిశ్వాసములచే రాజగృహమందలి గాలివెచ్చగనేయున్నది ఇంకను నాయనగారియాత్మ నిన్ను జుట్టుకొనియేయున్నది. పాపినీ, జాగ్రత్త. పితృస్మారకచిహ్నంబగునట్టి పవిత్రతీర్థమును గలుషితముచేయకుము. — (శాల్వునితో) మహారాజా! నేఁడీకలంకపుంజమును నీనెత్తురుతో కడిగెదను. లే పటా! కత్తిపట్టుము. (తనకత్తిదూయును.)

సత్య... దేవవ్రతా —

భీష్మ — నోరెత్తకుము పాపినీ! నేను నేను అంధుఁడనగుచున్నాను ఏమి చేయుచుంటినో తెలియదు. (శాల్వునితో) దుర్మార్గుఁడా! కత్తిదీయుము. లేనిచో నిప్పుడే ఈయింటిలోనుండి వెడ

సత్య — దేవవ్రతా! ఆజ్ఞనొసఁగుటకు నీవెవ్వఁడవు? (లిపొమ్ము.

భీష్మ... నేను భీష్ముఁడను.

సత్య... దేవవ్రతా! వెంటనే ఈయిల్లు విడిచి పొమ్ము నేను హస్తినాపురమహారాజ్ఞిని, ఆజ్ఞాపించుచుంటిని.

భీష్మ... పోయెదను. కాని పోవుటకుముందు ఈదారిలోనికుక్కను తొలిపోయెదను. (శాల్వునితో) కత్తిదీయుము.

శాల్వ... నేను పోవుచున్నాను. (ప్రస్థానము.)

భీష్మ... పొమ్ము మరల నెప్పుడేని హస్తినాపురమున నడుగుపెట్టినచో శాల్వునికబంధమే యింటికితిరిగిపోవును ఇది నిశ్చయమని యెఱుంగుము. జయము మహారాజ్ఞీ! నేను పోవుచుంటిని (ప్రస్థానము)

[illegible] (సత్యవతి క్రోధముతో పెదవికొరుకుచు పోవును.)

## చతుర్థగర్భాంకము

గంధర్వరాజగు చిత్రాంగదుని ప్రమోదవనము...రాత్రి

(చిత్రాంగదుఁడును. అతనిమిత్రుఁడు చిత్రసేనుఁడును. సభ్యులును కూర్చుండియుందురు నాట్యాంగన లెదురుగ నిలఁబడియుం దురు.)

చిత్రసే...మిత్రమా! వింటివా? మహాప్రతాపశాలియగు హస్తినా పురముమహారాజు చనిపోయెను. ఆయనరాణి అపూర్వసుం దరియు అనంతయౌవనయునఁట.

చిత్రాం—అనంతయౌవనయా?

చిత్రసే—నీవు వినలేదా మిత్రమా? ఆమె మహర్షి వరముచే నవనం తయౌవన యయ్యెను.

చిత్రాం...చిత్రసేనా! ఎవ్వ రాఋషి?

చిత్రసే—పరాశరమహర్షి?

చిత్రాం...శంతనుమహారాజు చనిపోయెనా! ఆయనకు పుత్రులు న్నారా?

చిత్రసే—ఆఁ. దేవవ్రతుఁడు పెద్దకుమారుఁడు, ఆయనను భీష్ముఁ డందురు. ప్రపంచములో నెవ్వరును భీష్ము . జయింపలేరు.

చిత్రాం. .ప్రపంచములో భీష్ముని నెవ్వరును జయింపలేరా?

చిత్రసే—కాని ఆయన యిపుడు సన్యాసి అయ్యెనఁట.

చిత్రాం ..ఎందుకు?

చిత్రసే—తెలియదు.

చిత్రాం...అయితేహస్తినాపురసింహాసనమిప్పుడుఖాళీగానున్నదా?

చిత్రసే...లేదు. అనంతయౌవనయగు రాణి పెద్దకొడుకు ఇప్పుడు రాజ్యమున కధికారి.

చిత్రాం... అతనిపేరు?

చిత్రసే—చిత్రాంగదుఁడు.

చిత్రాం—ఏమంటివి?

చిత్రసే...చిత్రాంగదుఁడు.

చిత్రాం...అయితే నాపేరేనా? చిత్రసేనా?—
చిత్ర—ఇందు విచిత్ర మేమున్నది?
చిత్రాం—ఆయన పేరు చిత్రాంగదుఁడా! నిజమేనా మిత్రమా?
చిత్ర—ముమ్మాటికి నిజము. నాపేరు చిత్రసేనుఁడెట్లో ఆయనపే రునట్లే నిజముగ చిత్రాంగదుఁడు.
చిత్రాం...అతనిపైకి దాడి వెడలుము—సేనాపతీ!

(సేనాపతి ప్రవేశించును.)

చిత్రాం—సేనాపతీ! హస్తినాపురము రాజు పేరుగూడ చిత్రాంగదుఁడేనట. వానినిపట్టి తీసికొనిరమ్ము.
చిత్రసే—ఎందుకు మిత్రమా?
చిత్రాం...వానిమూప మెట్లుండునో చూచెద.
చిత్రసే—ఎందుకు?
చిత్రాం.. ఊరక యే. తమాషాకు.
చిత్రసే... ఇంతపిచ్చివాఁడవేమి చిత్రాంగదా?
చిత్రాం—ఏమంటివి?
చిత్రసే...ఇంత పిచ్చివాఁడవేమి యని.
చిత్రాం—తరువాత?
చిత్రసే...తరువాత నేమున్నది?
చిత్రాం...ఎన్ని పేరులుపెట్టి నన్ను పిలిచితివి?
చిత్ర—నీపేరులోనే, చిత్రాంగదా యని!
చిత్రాం—లెమ్ము. ఇటురా. నిన్ను కౌగిలించుకొందును (లేచును
చిత్ర. (చిత్రాంగదుఁడు కౌగిలించుకొనిన పిమ్మట) ఇది యెందుకు?
చిత్రాం—నీవు నాపేరు, చిత్రాంగదుఁడని జ్ఞాపకము చేసితివి. మిత్రమా! వినుము, ప్రపంచమున కంతకు నేనొక్కఁడనే చిత్రాంగదుఁడను, ఎవ్వఁడేని ఈ పేరు పెట్టుకొనినచో అది దొంగతనము. వాఁడు నాకు శత్రువు—సేనాపతీ!
సేనా...మహారాజా!
చిత్రాం. .హస్తినాపురరాజు నాకు ప్రధానశత్రువు యుద్ధమునకు

సన్నాహము చేయుము.

సేనా—చిత్తము స్వామీ! (ప్రస్థానము)

చిత్రసే—చిత్రాంగదా! నీమెదడు చెడిపోయినది. చిత్రాంగదుఁడను పేరు గలవారెల్లను నీకు శత్రువులా?

చిత్రాం—అవశ్యము, వాఁడు తన పేరు తీసివేసికొనినచో నాకేమియు వైరముండదు వాఁడు నాకు పరమమిత్రుఁడు, బంధువుం. పాడండి 'ఈప్రపంచములో నేనొక్కఁడనే చిత్రాంగదుఁడను. ప్రియమిత్రమా! గ్లాసులో మద్యముపోసియిమ్ము.

వేశ్యలనృత్యగీతము.

ఇది హర్షసమయమమ్మా - మదిరపాత్రమిటు తెమ్మా
పొదలెఁ దృషానల మార్పుమింక నా - యెదయధీరమమ్మా
ఉష్ణరక్తమది పాఱె ధమనికల - నొలసె మహోత్సాహంబున్
తృష్ణదీర్పుమీ మధువొసంగి పూ - రింపుము శాంతిసుఖంబున్
వీవెనఁగూర్పుము మందసుగంధిత - వితతవాయుసంచారంబున్
గావింపుము మృదంగవల్లకీ - కలితలలితగానంబున్
పాడుమంగనామణిరో మధుర - స్వరమునదిక్కులుమ్రోయన్
ఆడుము చూపుచు హావభావములనంగుఁడింకనన్నేయన్॥

---

పంచమదృశ్యము

వ్యాసునియాశ్రమము—ప్రభాతము

(వ్యాసభీష్ముల ప్రవేశము)

వ్యాస...

గీ॥ సుఖము సుఖమో యటంచు మనుజుఁడు నిరంత
రమ్ము పెనుగులాడుచు మహాశ్రమముఁ బూను
వ్యసనములను నాహార విహారములను
శయనమున, బహుమూల్యవస్త్రముల దానిఁ

జాలువెలికేయుఁ బడయగాఁ జాలఁడెందు
నతిసహజంబను గను ననాయాసలభ్య
మైన యాసుఖంబును నెందు నరయఁజేల
కరతలామలకంబయి గ్రాల నద్ది॥

భీష్మ—ఎట్లు?

వ్యాస—ఔషధములగు సుఖసాధనములు నావద్ద లేవు. కాని నా యవసరములను, నాయభావములను నేను తగ్గించుకొనఁగలను. లాభము సులభము గాదు. కాని హాని సులభము అని నే చూతును. ఈసామాన్యమగు పర్ణకుటీరమున నే నుందును ఈమృగచర్మములను నేలఁ బఱచుకొందును. తగ వల్కలములఁ గట్టుకొందును. భోజనమునకు కందమూలములు గలవు, తాగుటకు కొండవాగులనీరు గలదు ధనహీనుఁడనయ్యును నాసుఖసామగ్రికేమి కొదువ? బీదబ్రాహ్మణుఁడనయ్యును నేనీ పర్ణకుటీరమున చక్రవర్తిని.

భీష్మ—మహర్షీ! మీరు చక్రవర్తులకు చక్రవర్తులు, పర్ణకుటీరమునఁ గూర్చుండి మీరు భరతఖండమునంతయు శాసించుచున్నారు కనుక నే హస్తినాపురమునకు యువరాజును, వీరుఁడను, పరశురామునిశిష్యుఁడనగు భీష్ముఁడు మీజ్ఞానద్వారమునఁ గృపాభిక్షుకుఁడై యున్నాఁడు

వ్యాస...నీ జ్ఞానపిపాస తగ్గినదా దేవవ్రతా?

భీష్మ...మహాత్మా! జ్ఞానపిపాస యెన్నఁడేని తీఱునా?

వ్యాస—దేవవ్రతా! నీవు విషపానము చేసితివి ఔషధము సేవించుము.

భీష్మ...అదియేమి మహర్షీ!

వ్యాస.. జ్ఞానవిచారము సేయుట క్షత్త్రియధర్మముగాదు. యుద్ధక్షేత్రమే క్షత్త్రియుని కర్మక్షేత్రము పొమ్ము ఆలోచింపకుము. ఆపని చేయుము ఆలోచనకు నేనున్నాను. పొమ్ము. ఇంటికిఁ బొమ్ము. (ప్రస్థానము)

(మాధవుఁడు ప్రవేశించును.)

భీష్మ...ఇదుగో బాబు ఇచ్చటికేవచ్చెగి, బాబూ! (దగ్గఱకువెళ్ళును.)

మాధ...నాయనా దేవవ్రతా! [కౌఁగిలించుకొని] ఇంక జీవించియుంటివా?

భీష్మ....బాబూ! నాయిచ్ఛలేక నాకు మరణము కలుగదుకాన నేను జీవించుచుంటిని నా సోదరులగు చిత్రాంగదవిచిత్రవీర్యులు సేమమా?

మాధ—ఇంతవఱకు బాగుగనే యున్నారు, కాని నేను తిరిగివెళ్ళి వారిని చూచెదనో లేనో యని సందియము.

భీష్మ—ఇదియేమి బాబూ!

మాధ—గంధర్వరాజగు చిత్రాంగదుఁడు మనరాజ్యముపై దండెత్తివచ్చినాడు. రమ్ము. దేవవ్రతా! రాజ్యమునకు మరలి రమ్ము.

భీష్మ—అది యెట్లు బాబూ? హస్తినాపురమున అడుగు పెట్టటకు నా కధికారములేదు రాణి నాకు దేశబహిష్కారము విధించినది.

మాధ...రాణి యెవరు? శంతనుని యనంతరము రాజ్యమునకధికారివి నీవే. రమ్ము దేవవ్రతా! రమ్ము, రాజదండము గ్రహింపుము. సింహాసనము స్వాధీనము చేసికొనుము. రామచంద్రుని వలె రాజ్యము పాలించుము.

భీష్మ—కాదు బాబూ! నేను యావజ్జీవము రాజ్యాధికారము వదలుకొంటిని.

వ్యాస—(ప్రవేశించి) సౌమ్యా దేవవ్రతా! రాజ్యరక్షణము సేయుము ఆర్తుల నుద్ధరించుము. శత్రురాజులు మదోద్ధతులై దేశము నాక్రమించినపుడు క్షత్రియుఁడు కనులుమూసికొని నిద్రించుట యుచితమా? క్షత్రియులు తమధర్మములను విడిచిననాఁడు ఈసువర్ణభారతవర్షము రసాతలమునకుఁబోవును

ఉ॥ దేశమె పూజ్యదైవతము దేశమె స్వర్గము మోక్షమార్గముల్
దేశమె ప్రాణసార్థములు ధ్యేయము గేయము నాగ్న ధర్మముల్
దేశమె క్షత్రియుండు జగతిన్ జనియించు స్వదేశరక్షణో
ద్దేశమునన్, దదుద్ధరణ దీక్షను యర్పణసేయు ప్రాణముల్॥

శా॥ మహా సామాన్యవిశేష భేదమున ధర్మంబుల్ ద్విధాభాసిముల్
మహితప్రజ్ఞ బుధుల్ స్వజాను భవసంకల్పిన్ జగన్మంగళో
త్సవహేతుకన్ విభజించి, రార్త్రజ సంత్రాణమ్ము నాత్మీయదే
శహితప్రాణము క్షత్రజాతికి విశేషంబైన ధర్మంబగున్॥

దేవవ్రతా! యాలసింపక దేశరక్షణమున నప్రమత్తుండవు
గమ్ము

భీష్మ ..మహర్షి! తమ యాజ్ఞను శిరసావహించెదను. నమస్కా
రము

వ్యాస.... తాపసాశీః ప్రభావమున నీవిఘ్నములన్నియు తొలఁగి
పోవును పొమ్ము భీష్మా!

(మాధవుఁడును భీష్ముఁడును కొంచెము ముందుకుఁబోవుదుగ)

మాధ—(నిలఁబడి) ఇదియేమి దేవవ్రతా! ఇదియేమి దేవవ్రతా!
ఇదియేమి? అకస్మాత్తుగ కాఱుమబ్బులు క్రమ్మునటచే దిశ
లంధకార బంధురములయ్యెను. మెరపులు మెరయుచున్నవి.
ప్రచండవాతము వీచుచున్నది. ఉరుము లురుముచున్నవి.

భీష్మ—(దూరమునఁజూచి) ఇదియేమి! ఏమియుగనుపట్టుటలేదు—
మహర్షి!

వ్యాస .భయము లేదు దేవవ్రతా! బ్రాహ్మణునిపని బ్రాహ్మణుఁడు
చేయును మబ్బులెగిరిపోవును ప్రచండవాతము శాంతించు
ను అంధకారము పటాపంచలగును. (మరల వెల్తురు వ
చ్చును)

భీష్మ.. (దూరమునఁజూచి) ఒక అనుల్లంఘనీయమగు పర్వతమ
హాస్తినాపురమార్గము నవరోధించుచున్నది.

వ్యాస... వ్యాసునియందు తపోమహిమయున్నచో నీకొండయిప్పు

పిండియగును (పర్వతము బ్రద్దలగును) పొమ్ము దేవవ్రతా!
ఏమియు భయము లేదు [మాధవభీష్ములు నిష్క్రమింతురు]

(గౌరీశంకరుల ప్రవేశము)

శంక—పార్వతీ! తపశ్శక్తి చూచితివా? (ముందుకు బోవు) వత్సా, వ్యాసా!

వ్యాస—ఎవరు మీరు?

శంక. శంకరుండను. నీశక్తికి మెచ్చితిని నీవు తలచిన వరము కోరుము.

వ్యాస—నేను నా తపోబలముచే మానవజాతికి హితమొనరింతునుగాక. ఈ వరము ననుగ్రహింపుడు.

శంక...తథాస్తు నీకీర్తి శాశ్వతముగ విరాజిల్లుగాక (అందఱు నిష్క్రమింతురు)

---

షష్ఠదృశ్యము

కాశీరాజు ప్రమదావనము—సాయంకాలము

(అంబిక, అంబాలిక పాడుదురు.)

గీతము

ధవళమేఘావళులవే సం - ధ్యాప్రభాంచితములు చెలీ
భువనశోభాజయపతాకల - పోల్కి భాసిలెడున్ బళీ
మనము పోవ్రద మెగిరి యచ్చర - మగువలుందు పురమ్మునన్
ఘనపథమ్మున సాచి ఱెక్కలు - గాలివెంట రయమ్మునన్
గనుమ మానుషలోక మెట్టిదొ - కనుమ మహి యెట్టిదియొకో
మనుజజీవిత మింకఁ జింతా - మాత్రమే నీరసమొకో
ఫలములేదిటు లెపుడు చింతా - భరమునం గుందుట సఖీ
అలరి భోగములొందుటే హిత - మవ్యథా బ్రతుకేటికి

అంబి...మంచికీర్తన

అంబా...చాల చక్కనికీర్తన

అంబి—మనమంతట మనమే కీర్తన వ్రాసి మనమే పాడి—

అంబా—మనమే యానందించుచుంటిమి

అంబి—ఇట్టికీర్తనలు చాల అరుదు. (రాగముతో)

ధవళ మేఘావళుల వే

అంబా...(ఆరాగముతోనే) సంధ్యాప్రభా చిత్రములు చెలీ

అంబి—కవితాభావములు నాకు బాగుగఁ దోఁచుచుండును.

అంబా.. ప్రాస యెప్పుడును నాజిహ్వాగ్రమున నుండును ఇక్కడ చూడుము—చెలీ బలీ అనుప్రాసను భావము పోకుండ కూర్పుట యెంతకష్టము!

అంబి....మన మక్కసెల్లెండ్రి మిద్దఱము మంచిజతగా కూడితిమి.

అంబా—రెండురత్నములు

అంబి—మన పెద్దక్క మఱియొకమాదిరిది పాటనుపాడ లేదు—

అంబా... కవిత్వమును అల్ల లేదు.

అంబి...ఎప్పుడును విచారముగనుండును

అంబా—ఇంతవఱకు పెండ్లికాలేదుకాదు. అందుకని.

అంబి—సరే, పెద్దక్క ఇంతవఱకు పెండ్లియేల చేసికొన లేదు?

అంబా—నేనును సరిగా నిదియే ఆలోచించుచుంటిని.

అంబి...సోదరీ! నీవు పెండ్లిచేసికొనెదవా?

అంబా—ఎందుకు చేసికొనను?

అంబి—నీమగఁ డెట్టివాఁడో ఎఱుఁగుదువా?

అంబా—నీవే చెప్పుము, ఎట్టివాడో?

అంబి—ఎఱుగుదువా నామగఁడెట్టివాఁడో? — ఉండుము. కొంచెము కన్నులుమూసికొని వరునిధ్యానించెదను.

(కూర్చుండి కన్నులుమూసికొనును)

అంబా—నేను అట్లే ధ్యానించెదను. (కన్నులుమూసికొనికూర్చుండును)

అంబి....నేను నీమగనిని చూచుచుంటిని.

అంబా—చూచుచుంటివా? సరే. ఎట్టివాఁడు?

అంబి—బుఱ్ఱముక్కు

అంబా...బోసినోరు
అంబి—సొట్టముక్కు
అంబా....చప్పిడిదవడలు
అంబ .. తెగినచెవులు
అంబా...తలకుతెవులు
అంబి...నట్టిమజ్జి
అంబా...వట్టియెడ్డి
అంబి...చదువురానిమొద్దు
అంబా....రెండుకాళ్ళయెద్దు
అంబి...ఏమిరాకున్నం
అంబా—పనికిరానిపెంట.
అంబి... తాగుబోతు
అంబ...పాఖుబోతు.
అంబి.. బడాయి కోరు
అంబా...దగాకోరు
అంబి .. పాచి పళ్ళు
అంబా . చీమిడిళ్ళు
అంబి. మన యిద్దఱము సవతులమైతే
అంబా...బలే బలే ఏమి!
అంబి ఎప్పుడును పోట్లాడుకొందుము
అంబా ...మరల కలియుదుము.
అంబి...భగవంతుండట్లు చేయుగాక. మనమిద్దఱము సవతులమై యుగుదుము గాక.
అంబా...ఇంక బ్రతికియున్నంతకాలమునొక్కచోటనేయుండెదము.
అంబి...(ప్రేమతో) అంబాలికా?
అంబా—అంబికా [కౌగిలించుకొని ఒకరినొకరు ముద్దుపెట్టుకొందురు]
అంబి... పెద్దక్క అదుగో పెద్దక్క.
అంబా...సునంద కూడ వెంటనున్నది.

అంబి....దాగుకొనుము (ఇద్దఱుచెట్టుచాటునకుపోయెదరు అంబయును ఆమె చెలికత్తెయగుసునందయుమాటలాడుచు ప్రవేశింతురు)

సునంద...ఇందుకనియే రాణికిని రాజుకును తగాదాగానున్నది. రాజు చెప్పుచున్నకొలంది రాణి మండిపడుచున్నది రాణి చెప్పుచున్నకొలంది రాజు మండిపడుచున్నాడు.

అంబ నేను పెండ్లిచేసుకొననిచో బాధయేమి?

సునం...నీకు పెళ్లికానిచో నీయిద్దఱుచెల్లెండ్రపెళ్ళి యెట్లగును? నీవు అన్నియు తెలిసినదానవే పసికూనవు గావు

(అంబ ఆలోచించును.)

సునం—ఇద్దఱుచెల్లెండ్రపెండ్లికిని ఆటంకముగలిగించి తల్లిదండ్రిల విచారమునకు కారణమై లోకనిందపాలగుట మంచిదా?

అంబ...లోకనింద యెట్లు?

సునం—ఈరాజకన్యను ఒకరాజకుమారుడు పరిత్యజించెనని లోకులు వాకొనెదరు హాస్తినాపురయువరాజును ఈకామినినా ప్రేమపాశమునఁ జిక్కి వేఱొకనిని పెండ్లియాడలేదని గర్వపడును

అంబ....(విచారించి) నీవు చెప్పినది నిజము సునందా' పొమ్ము. అమ్మతో నేను పెండ్లిచేసికొందునని చెప్పుము.

సునం—మంచిది. నీవు కాశీరాజకన్యకకే తగుదువు, నేను వెళ్ళి రాణిగారితోఁ జెప్పెదను. (నిష్క్రమణము)

అంబ—ఆఁ పెండ్లిచేసికొందును. ఎవరిని? దీనికి ఆలోచనయేల? విషముద్రావి చచ్చెదను. లేక నీటిలోఁబడి చచ్చెదను. చచ్చుట కెట్లైననేమి? పెండ్లిచేసికొందును. అందఱికంటె నే

నెక్కువయేవగించునాతనిఁ బెండ్లియాడెదను. (నిష్క్రమణము.)

(అంబికాంబాలికలు మెల్లగ బయటికివచ్చెదరు)

అంబి...వింటివా.

అంబా...(పోవుచున్న అంబవైపునకు వ్రేలుచూపుచు) ఇది

అంబి—అక్క వెళ్ళిపోయినది.

అంబా...మరల వెనుకకుతిరిగినది—ఆఁ ఇప్పుడు పోయినది.

అంబి ..నేను చెప్పలేదు?

అంబా—నీవుచెప్పినది నిజము.

అంబి...అక్క పెండ్లిచేసికొనును.

అంబా—అవును

అంబి ...కాని యెందుకు చేసికొనునో తెలియలేదు.

అంబా....లేదు.(అంబిక గీతముబాడుచు పచారుచేయుచుండును. అంబాలిక మధ్యమధ్య అందుకొనును)

అంబి—(హఠాత్తుగ నాగి) సరే, ఆడవాండ్రు పెండ్లి యెందుకుచేసి కొందురు?

అంబా... అందులో నీగడ్డాలుమీసాలుగల మగవాళ్ళను.

అంబి ..మనము పెండ్లిచేసికొనవద్దు ఏమి సోదరీ?

అంబా—మంచిది (ఇద్దరు పాడుదురు)

గీతము

మలయమారుతము నెక్కిపోవుదము-మన మువిదచ్చరపురముకై
లలితపుష్పసుందరదము గోరిలివి - లాననమూననము కరముకై
మృదులకేతకీకుసుమశయ్య రచి-యించి పోవుదము నిమురకై
జనలఁ జంద్రికిరణమ్ముల స్నానము - సల్పుద మస్మిలిగడుకై
కవిత చామరముచీచును మనకున్ - గలలఁబేర్చి యమూపించుకై
ఉవిద లచ్చరలు నెచ్చెలులౌదుర - దివిజవితతి పేర్మించుకై
చారుసాంధ్య మేఘసుకూలంబును - శక్రచాపమను హారంబుకై
తారాకర్ణిక సెలఁగఁ దాల్చెదము - తమ మవగుంఠపటంబుకై
ఇవిరితో నభమెక్కి దిగెద మీ - యవనిపైకి హర్షముతోన్
బోవుద మంబుధి కేళ్ళకోడని - పుగఁ జూతేనమునిలముతోకై

సప్తమదృశ్యము

(యుద్ధసన్నిద్ధులై హాస్తినాపురరాజగు చిత్రాంగదుఁడును గంధర్వరాజగు చిత్రాంగదుఁడును కత్తులుదూసి నిలఁబడుదురు.)

గంధ—బాలకా! తల్లిచనుపాలు వదలుకొని యుద్ధమున కేలవచ్చితివి? ఆయుధ మక్కడనుంచుము. నిన్ను జంపను లెమ్ము. నిన్ను నారథశిఖరమునకు గొలుసుతో నంటగట్టి విజయోత్సవార్థము నానగరమునకు గొంపోయెదను.

హాస్తి...నాసేనయంతయు నశించినది, అయినను ప్రాణముండువరకు ఆయుధము క్రిందఁబెట్టను. మాతల్లిఆశీర్వాదముచే నే నీయుద్ధములోఁ జావను. ఆమె తనపాదరజమును నాశిరమున నునిచి 'కుమారా! నేను పతివ్రతనగుచో నీవు యుద్ధములో విజయము పడసి రాఁగలవు' అని చెప్పెను. ఆయాశీర్వాద వాక్య మింకను నాకర్ణపుటముల మ్రోగుచున్నది.

గంధ...అయితే ఇంక నే నేమిచేయుదును? యుద్ధము చేయుము కత్తిపట్టుము. కాచికొనుము.

(ఇద్దఱు పోరాడుదురు. హాస్తినాపురరాజు దెబ్బతగిలి క్రిందఁబడును.)

గంధ...విజయము లభించినది. ఇంక విజయగర్వముతో హాస్తినాపురమునఁ బ్రవేశించెదను. సేనాపతీ! [ప్రస్థానము]

[మాధవ భీష్ములు ప్రవేశించెదరు.]

మాధ...మనచిత్రాంగదుఁ డిచ్చటనే యున్నవాఁడు. వత్సా! నే ననుకొనినంత అయినది. అదిగో చూడుము. చిత్రాంగదుఁడు నేలపైఁగూలినాఁడు.

భీష్మ...(ఆతురతతో) ప్రాణ మున్నదా లేదా?

మాధ....(చూచి) చనిపోయినాఁడు. మంటికుప్పవలె కదలకపడియున్నవాఁడు. శరీరము మంచువలె చల్లగానున్నది శ్వాసకూడ లేదు. కుమారా! చిత్రాంగదా!

భీష్మ...(గద్గదస్వరముతో) బాబూ!ఇది. దుఃఖించు సమయముగాదు,

(గంధర్వరాజు ప్రవేశించును.)

భీష్మ....నీవేనా గంధర్వరాజగు వీరచిత్రాంగదుఁడవు.

గంధ ..అవును. నీ వెవఁడవు?

భీష్మ.... నేను భీష్ముఁడను.

గంధ...పేరువిన్నాను.

భీష్మ—గంధర్వరాజా! నీ వీబాలకునిహత్య ఏల చేసితివి.

గంధ—హత్య చేయలేదు ఇతనిని యుద్ధములోఁ జంపితి.

భీష్మ ..యుద్ధమా? దీని యుద్ధమందురా! చంటిపిల్ల చంపి కాలుకమట నీకుబాగుగనున్నదా? మనుష్యులకంటె మీగంధర్వు లుత్తములు. ఈదుర్బలుల ద్రోహముచేయుట. బలాత్కారమున స్వాతంత్ర్యమపహరించుట. ఈశాంతిభంగము చేయుట, ఈదర్పము చూపించుట గంధర్వరాజున కుచితమా? నీ వీయుద్ధమేల తలపెట్టితివో చెప్పుము

గంధ దిగ్విజయమునకై వెడలితిని ఇదియే ఈయుద్ధమునకు గారణము.

భీష్మ ఇది యుద్ధముగాదు. బందిపోటుతనము.

గంధ—గంధర్వులు నీచమనుష్యజాతితో మాటాడరు.

భీష్మ ..పోనిమ్ము. హత్య చేసెదరా? ఇంక నీవు నీరాజ్యమునకుఁ బొమ్ము గంధర్వరాజా!

గంధ ఓరీమనుష్యుఁడా! అంతకుముందు హాస్తినాపురసింహాసన మధిష్ఠించెదను. శంతనునిరాణిఅనంతయావనయని వింటిని. ఆసంగతి యేమో చూచెదను. ఒకవేళ—

భీష్మ...జాగ్రత్త. మహారాజ్ఞినిగూర్చి మర్భాషలాడితివేని బ్రహ్మాండమున ఇంక నీనామరూపములుండవు. నిముసములో నీతల తెగి నేలపైఁ బొర్లాడును.

గంధ....ఓరీ! పొగరుపోతుకుఱ్ఱడా! హాస్తినాపురమునకు దారి విడువుము

భీష్మ—హాస్తినాపురము సొచ్చుటకు నీకధికారము లేదు.

గంధ...నన్నెవ్వఁ డడ్డపెట్టును?

భీష్మ....నేను....భీష్ముఁడు.

గధ...తొలఁగిపొమ్ము హస్తినాపురికి దారిఁడవు ము.

భీష్మ....నామాటవిని కుశలముగ తిరిగి నీరాజ్యమునకుఁబొమ్ము. భీష్ముఁడు బ్రతికియుండఁగా శత్రుఁడు హస్తినాపురమున నడుగు పెట్టలేఁడు.

గంధ—అయితే యుద్ధముచేయుము.

భీష్మ. .యుద్ధమొనరితో? (చేతులుమెలివెట్టి కత్తిలాగిపారవేయును.) పొమ్ము. నీరాజ్యమునకుఁబొమ్ము. నామాటవినుము. దుర్బలులజోలి కెప్పుడును పోవలదు. గర్వపడవలదు, నీ వింత గొప్పవాఁడవైనను ప్రపంచమున నీకంటెను గొప్పవారు గలరు. లేకున్నను నీస్వేచ్ఛాచారమును నీయన్యాయమును బ్రకృతి సహింపఁజాలదు నీవును ఈబ్రహ్మాండనియమమునకు బద్ధుఁడవే. (గంధర్వరాజు ప్రస్థానము)

భీష్మ వ్యాసమహర్షీ! నీవుచెప్పినది నిజము. క్షత్రియునిధర్మము యుద్ధముగాని శాస్త్రచర్చగాదు, నేను మూఢుడను. అభిమానమునఁబడి క్షత్రియధర్మమువిడిచినేనే యీసర్వనాశనమును జేసితిని. స్వర్గీయదేవతలారా! క్షమింపుఁడు.

మాధ.. చిత్రాంగదా! చిత్రాంగదా! రక్తసిక్తముఖముతో నీదు మన్నలోఁ బడియుంటివి వత్సా! ప్రాణాధికా!

భీష్మ....వత్సా!

గీ॥ బాలుడవెయయ్యు ధర్మసంశీలుఁడవయి
క్షత్రియోచితకార్యమ్ము నలిపితీవు
సహజకర్తవ్యపరుఁడైన క్షత్రియునకు
బ్రదుకుటయుఁ జచ్చుటయు దేశరక్షకొఱకె॥

ఇదియే క్షత్రియవీరునికర్తవ్యము. ధర్మము. ఇదియే నీకు శోభావహము. నేను అంతపమయమునన్ని శయ్యనే పొందెదను ఇట్లేఁ దిగెదను బహిరంగముగనీలాకాశముక్రింద సమర

క్షేత్రమున నాయంతిమశయ్య ఇట్లే పఱచియుండుఁగాక. ఎదుట మరణరక్తసాగరము పొంగుచు గర్జించుచుండునుగాక. నలుదెసలను సమరకోలాహలము వ్యాపించియుండునుగాక.

(తెరవాలును.)



## శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 27 | పశిపడు | పడు |
| 8 | 18 | నర్మాదా | నర్మదా |
| 10 | 26 | సదేచ్చేంటో | సచ్చేదేంటో |
| 13 | 8 | చన్నాఁడు | చున్నాఁడు |
| 18 | 15 | హృదము | హృదయము |
| 29 | 20 | చుటిరా | చుంటిరా |
| 30 | 13 | లేకున్న | కాకున్న |
| 50 | 15 | వెదుకు | వెందుకు |
| 52 | 17 | దకున్నట్లే | కున్నట్లే |
| 66 | 4 | ప్రభాచిత | ప్రభాంచిత |

# భీష్మ.

## తృతీయాంకము.

### ప్రథమదృశ్యము

గంగాతీరమున కాశిరాజు ఉద్యానము—సాయంకాలము.

(ఖడ్గహస్తుఁడై భీష్ముఁడు నిలఁబడియుండును.)

భీష్మ.... గీ॥ అదియె యీపూవుపొదరిందు లదియె మధుర
కలరవాన్విత పూతగంగాస్రవంతి
అదియె యీశాంతసంధ్య మందానిలమ్ము
నటులెఁ దావులఁజిమ్ముచు నరుగుదెంచు॥

సరిగా ఇదియే చోటు. ఈ సంధ్యాసమయమననే యీచెట్టు క్రిందనే—నాటిదినమది. మధ్య నిరువదిసంవత్సరములయుంతర మున్నది. గంగాతీరమున, ఈచెట్టుక్రింద కూర్చుండి కొంచెము విశ్రమించెదను. (ప్రస్థానము.)

మాధ—(ప్రవేశించి) దేవవ్రతుఁ డిచ్చటకువచ్చిన నాటనుండియు నింతచింతాక్రాంతుఁడగుటకుఁగతంబేమి? నాతోడను సరిగా మాటాడుటలేదు. ఏమో ఎవ్వరెఱుంగుదురు? అదుగో చెట్టు కొమ్మకు కరవాలముతగిలించి నేలపైఁబడుకొని తెప్పయార్పక యావైపునకు చూచుచున్నాఁడు. ఉఁహూఁ అతనినిచట నొంటరిగ నుండనీయను. (ప్రస్థానము)

(అంబిక అంబాలిక ప్రవేశింతురు)

అంబి...ఎంతచూచినను తుదకు వీరు మనకు పెండ్లిసేయక వదలునట్లులేదు.

అంబా...మనకు పెండ్లిసేయనిచో వీరికి నిద్రపట్టునట్టు లేదు.

అంబి....మనకుమాత్రి మిందు బాధయేమున్నది? ఏమి సోదరీ?

అంబా—అవును. మనకు పెండ్లియాడుకూడ వచ్చినది.

అంబి...అవును అదియు నిజమే.

అంబా దీనినే స్వయంవరమందురు

అంబి—స్వయముగ వరుని వరించుటచే స్వయంవరమందురు.

అంబా .అమ్మయ్యో!

అంబి ఏమి!ఏమి!

అంబా—రాజులంతయు వచ్చిరా!

అంబి—ఇప్పుడే వచ్చిరి. రాత్రి ఎప్పుడుగడచునాయని చూచుచున్నారు

అంబా—వారికి రాత్రి నిద్రయే పట్టనట్లున్నది

అంబి—వారు తెల్లవారని తూర్పుగా చూచుచున్నారు.

అంబా .మంచిది. పెద్దక్కకుగూడ ఇప్పుడే స్వయంవరము కును గాదు?

అంబి—ఎందుకుగాదు?

అంబా...కాని ఆమెయీడు చాల ముదిరినది

అంబి అయితే మాపులకు ముదిరినట్లుండెను

అంబా పైగా మనకంటె చిన్నదిగాఁ గనుపట్టును.

అంబి కాయబట్టి వగుటచే నట్లుండును.

అంబా—కాని నాయనగారు ఎట్లో నానివమ్ముయదాదిపెండ్లి చేసెదరు.

అంబి—చేయనిమ్ము నీకేమి? నీవీరాజులలో నెవ్వరినేని చూచితివా?

అంబా—చూడకేమి?

అంబి ఎవ్వరేని నీకు నచ్చిరా?

అంబా—నచ్చకేమి?

అంబి—ఎవ్వరు?

అంబా ...విందువా? (చెవిలో చెప్పును)

అంబి—పో సిగ్గుమాలినదానా!

అంబా—పో కలహాముఖి! (ఇద్దఱు బిగ్గఱగా నవ్వుదురు)

అంబి...అదగో పెద్దక్క. పెద్దక్క అదుగో

అంబా.... పెద్దక్కయా?

అంబి...ఇంక మనలఁ జూడలేదు.

అంబా...తనలో తానేనిరో వాగుకొనుచున్నది.

అంబి...ఊరకో,

అంబా...అబ్బా! (ఇద్దఱును దాగియుందురు.)

(అంబ విచారముతోఁ బ్రవేశించును.)

అంబ...చిత్రవిచిత్రములగు పతాకలచే నత్తనమెల్ల అలంకరింపఁబ డినది. సింహద్వారమువద్ద సన్నాయి ఆనందగీతములు వర్షిం పుచున్నది. మాంగలికవాద్యధ్వనులు సందుసందులనుమాఱు మ్రోగుచున్నవి. కాని యీపీతపతాక నారక్తముచే రంజిత మయినట్లు లున్నది. మఱియు నాద్వారమువద్ద మ్రోగు స న్నాయివాద్యము నాబలిదానవాద్యముగ నున్నది. గుండెకొ ట్టుకొనుచున్నది.కుడికన్నదరుచున్నది. ఈకుంజవనములో నె వ్వరు? (నవ్వి) అంబిక. అంబాలిక ఇద్దఱును రెండుపావుర ములవలె నిర్భయముగ నాడుకొనుచున్నారు. (ప్రస్థానము)

అంబి—వింటివా?

అంబా...ఏమి?

అంబి...అక్క మనలను పావురములఁ జేసినది.

అంబా...మంచికనిచేసినది (అంబిక, అంబాలిక కలసిపాడుదురు.

**గీతము**

హృదయమువిశ్వప్రేమశూన్యమేన్ - వృథయీజన్మమువృథజీవనము

ఆంగోనూడుమీ యెల్లదెసల వ్యాపించెఁ బ్రేమమే హితసాధనము

కుసుమలఁదరువ్రుల,లతలఁబువ్వముల,_ప్రకృతియొక్క టేభాసిలుచున్నది

కనుమనె బహువర్ణమ్ముల బహువిధ - గంధమ్ములఁబ్రసరింపుచున్నది

టెక్కపెట్టుటలు సొక్కమెంచుటలు - చిక్కులుపడుట చింకులుట వారిపని

ఒక్కపగన్నులుమూసి వంశికా - మధురగీతములువినుట వీరిపని

సారిమూలికనికడ వాదములు - కలుషముసేయుచుండుట వారిపని

మనసునిచ్చుటయు, కవుగిలించుటలు - మందహాసములుసేత వీరిపని
ఆఁకలిదప్పికలెటులో వాపుటకు - సన్నపానములుగొనుట వారిపని
చీకుచింతలెడఁ బాసికనులుమూసి - సొకుగమధుపగ్రోలుటయు వీరిపని
ఎండవానలను ఝంఝలమోహముల - నొందుటమాడుటబాధపడుటయును
చందువెన్నెలలమలయవాతములఁ - బశువయొక్కవిహరించుట యియ్యది.

అంబి .. అరే ఎవ్వరీయన?

అంబా...ఆఁ ఎవ్వరీయన?

అంబి ఈయన యెక్కడనో వచ్చి అంతయు పాడుచేసినాఁడు.

అంబా....ఛీ!

అంబి ..ఈమాట పాటిపోవలదు.

అంబా.. ఊఁహూ ఈమాటఆపదనెదుర్కొండము.

అంబి. .ఊరకో.

అంబా....ఊరకో.

(విచారముతో భీష్ముఁడు ప్రవేశించును.)

అంబి...ఏవైపునకును చూచుటలేదు

అంబా...ఏదియో ఆలోచించుచున్నాఁడు.

అంబి.. ప్రేమపాశమున చిక్కుకొనినట్లున్నాఁడు.

అంబా—అగునుమా?

అంబి....(ముందుకుపోయి) చెప్పెద (దగ్గి) ఆర్యా!

(అంబాలికకూడ ముందుకుఁబోయి వగచుచు భీష్ముఁడులికి పడినిలచిపోవును.)

అంబా—మీరెవ్వరు?

అంబి—మీవర్ణమేమి?

అంబా—మీజాతి?

అంబి—దేవతలా?

అంబా...దానవులా?

అంబి—గంధర్వులా?

అంబా...కిన్నరులా?
అంబి—యక్షులా?
అంబా—రాక్షసులా?
అంబి—లేక—
భీష్మ—(భయపడుచు) నేను— నేను
అంబి—ఓహో! మీరా? మొదటనే తెలసినది.
అంబా...మీరు చెప్పనక్కఱలేదు. తెలసినది. మీ రేల యిక్కడ నుంటిరి?
అంబి—ఈసమయమున?
అంబా—ఏమి మీయుద్దేశ్యము
భీష్మ—చిత్తము. నేను—
అంబి—చాలు. మీకల్పితవాక్యము లిచ్చటపనికిరావు.
అంబా—మాకివి నచ్చవు.
అంబి—ముందు మాకీసంగతి చెప్పుడు. మీ రేపనిమీద వచ్చితిరి?
అంబా—దారితప్పివచ్చితిరా?
అంబి—ప్రశ్నయిదియే.
అంబా—తేలికప్రశ్న.
భీష్మ...నాకిక్కడ—
అంబి, అంబా—ముందు నాకనుమాట కర్థము సెప్పుడు.
అంబి...(క్రోధమునటించి) అంబాలికా!
అంబా—(అట్లే) అంబికా!
భీష్మ—నేను— నేను ఎఱుఁగను ఈ—
అంబి....ఇది కావచ్చును. ఎఱుఁగకయేపోవచ్చును.
భీష్మ...నేననుకొన్నది ఈ—
అంబా...అనుకొనియే యుందురు.
అంబి....సరే, మంచిది. మీ రెఱుఁగకపోయినపుడు—
అంబా....మీరనుకొనినప్పుడు—
అంబి...అప్పుడింక చెప్పునదియే లేదు

అంబా...కర్తవ్యమే ముగిసినది.
అంబి—ఇప్పుడు ప్రశ్నయేమన, మీరు—
అంబ...అసలు ఎవ్వరు?— ఇదియే ప్రశ్న.
భీష్మ—నేను హస్తినా—
అంబి—మీరు హస్తి (ఏనుగు) అని ఎవరన్నారు?
అంబా...మీరు హస్తియుకారు, అశ్వమునుగారు. మాప్రశ్నయిది. కాదు.
అంబి...మీరెవ్వరని ప్రశ్న?
అంబా...కులకని ప్రశ్న,
భీష్మ...నేను—
అంబి...ఆలోచించి జవాబీయుడు
అంబా....క్లుప్తముగ.
భీష్మ...నేను భీష్ముఁడను.
ఇద్దఱు.... అమ్మయ్యో!— (వెనుకకుపోవుదురు.)
అంబి.. మీరు—మీరు—
అంబా—భీష్ములు— వింతమాట.
భీష్మ—ఇందులో వింతయేమున్నది?
అంబి....వింతలేదా?
అంబా...ఓయిబాబో!
భీష్మ...ఇంక మీరెవ్వరో చెప్పుడు.
అంబి...మేమా?...మేమెవ్వరమా?—ఇదుగో (బిగ్గరగానవ్వును)
అంబా—మేమా—ఇదుగో (బిగ్గరగానవ్వును.)
అంబి...మేము మేమే.
అంబా—అంతే.
భీష్మ—మీరు కాశీరాజపుత్రికలా?
అంబి...తెలసికొన్నారే?
అంబా—బాగుగా తెలసికొన్నారు.
అంబి...భీష్మమహాశయా! మీరెట్లు తెలసికొంటిరి—

అంబా... మేము కాశీరాజుకన్యలమని ?
అంబి చూడగనే తెలియుచున్నదా?
అంబా... మా మొగాల వ్రాసియున్నదా?
అంబి—మీరు తెలిసికొనినప్పు డింక నే మొప్పుకొనుటయే మంచిది.
అంబా... నిజము.
అంబి—అవును. మేము—
అంబా.... కాశీరాజకన్యలము. ఈమె పెద్దది—
అంబి—ఈమె చిన్నది
అంబా—వయస్సుకాదు పెద్దది జ్ఞానము పెద్ద.
భీష్మ...మీ రామెకు చెల్లెండ్రా!
అంబి—'ఆమెకు' ఎవరికి?
అంబా...ఈ 'ఆమెకు, లోని ఆమె యెవరు?
భీష్మ...అనగా—
అంబి ...''అనగా,, అవసరములేదు. 'ఆమె, ఎవరు?
అంబా...ఇంకను తెలియలేదా?
అంబి—ఆఁ తెలసినది
అంబా....ఆర్యా! మీ రింక చెప్పనక్కఱలేదు.
అంబి—మీ రపుడు— (సంకేతము)
అంబా—ఇది చాలమంచిజోడు.
అంబి.. చాలబాగుగనుండును.
అంబా—కాని మీముఖము—
అంబి—చూచెదము. (చూచి)
అంబా...అదే—
అంబి—మీరెక్కడనో మమ్ము సంశయములో పడవేసితిరే?
భీష్మ—ఏమి?
అంబి...మీరు భీష్ములు,
అంబా...ఈపేరే చెప్పితిరికాదా?
భీష్మ.. అవును దేవి!

అంబి—అదియే.

అంబా—అయితే మమ్ము సంశయములో పడవేసితిరి.

భీష్మ—ఏమి?

అంబి....మీముఖము భీష్మునిదిగా లేదు.

అంబా. .బొత్తుగా లేదు.

భీష్మ...మీరెప్పుడేని ఆయనను (భీష్ముని) చూచితిరా?

అంబి ...లేము. కాని మీముఖముచూచిన మీపేరు చంద్రకాంతుఁడని తోఁచుచున్నది.

అంబా....లేక యిట్టిదే మఱియొకటి యైయుండవచ్చును.

భీష్మ...ఏమి?

అంబి...ఆ సంగతి తెలియదు. కాని—

అంబా...అటుల తోఁచుచున్నది,

అంబి. ..మీముఖము కొంచెము గంభీరమే—

అంబా....కాని భీష్మము (భయంకరము) కాదు

అంబి...అటువంటిముఖము నెన్నటికిని పెండ్లి యాడను.

అంబా—పేరుకూడ కొంచెము నీరసముగనున్నది.

అంబి...అయితే భీష్మమహాశయా! మేము పోయెదము.

అంబా....మాకు పెండ్లికదా మాకు చాలపని యున్నది.(వెళ్ళబోదురు.)

అంబి—(వెనుకకుతిరిగి) మహాశయా! మీరేమియు ననుకొనవలదు.

అంబా—(వెనుకకుతిరిగి) మాకు నచ్చలేదు. ఏమి చేసెదము.

అంబి...కాని మాఅక్కతో—

అంబా....అగుచో బాగుగనుండును. జోడుకలసిపోవును. (నవ్వుచుపోదురు.)

భీష్మ.. బాలికలిద్దఱును సుందరులును ఆనందమయులును. రెండునదుల యేకాంతసంగమము ఏమియుపని లేదు. నవ్వుట, పాడుట, హృదయస్థలమున కేవలము నిర్మలమగునీలిమ విహరించును అనివారితమును, సంగీతముఖరమును నిర్మలమునగు దానిసలిలము పొంగిపొరలియొడ్డునకుఁ గొట్టుకొనును ఈచక్కదనం

పెఁగఁబడిఉమొగ్గలు రెండును తమసౌరభములనే మగ్నము లైయుంకును. ఇంక నేమియు పనిలేదు ఉషాప్రకాశమున పిల్లతెమ్మెరలయూవులచే నిత్యము సౌందొర్య లొకనిశరీర ముపై నొకరు పకుచుందురు. ఒకటిశాంతమగు గిరినిర్ఘర ముయొక్క మధురధ్వనియు ఒకటి దానిప్రతిధ్వనియు —ఆ చప్పుడేమి?

[సాయుధులగుభటులతో శాల్వుఁడు ప్రవేశించును.)

శాల్వ...సమాచారము నిజమే. ఇతఁడే భీష్ముఁడు.భటులారా! ఈ యనను బంధింపుఁడు.

భీష్మ—(ఆశ్చర్యముతో) ఎవ్వరు? సౌభరాజా!

శాల్వ...ముందుకు పొండు. బొమ్మలవలె నిలఁబడెదరేల? బంధిం పుఁడు. ఈతనియొద్ద నిప్పుడు ఆయుధములు లేవు. చూచు టలేదా?

భీష్మ—ఎందుకు సౌభరాజా?

శాల్వ...ఇది హస్తినాపురిప్రాసాదముగాదు ఇది బహిరంగస్థలము. ఇచ్చట నీబలమేమాత్రమో పరీక్షింపఁబడును.

భీష్మ...ఓహో తెలసినది. మంచిది. (కత్తి తీయఁబోవును.) ఇదియేమి కత్తి యచ్చటనే విడిచివచ్చితిని.

శాల్వ...పట్టుడు. కట్టుఁడు. (భటులు భీష్మునిపై కలియఁబడుదురు. భీష్ముఁడు చేతులతో యుద్ధముచేసి ఇద్దఱుముగ్గురుభటులను బడఁగొట్టి తాను పడును)

శాల్వ—కట్టుఁడు [భటులు కట్టుదురు) ఇంకను చూచుటయెందుకు? చంపుడు. భీష్మా! ముందు హస్తినాపురములోనిఅవమానము నకు బదులు పుచ్చుకొనుము. (తన్నును.)

భీష్మ—నాఖడ్గము! నాఖడ్గము!

శాల్వ....ఇదుగో ఇచ్చుచున్నాను. (మరల తన్నును.)

(ఖడ్గము తీసికొని మాధవుఁడు ప్రవేశించును.)

మాధ...ఇదియేమి! దేవవ్రతుఁడునేలపైఁబడియున్నవాఁడు—మటు

సైనికులు —ప్రక్క సౌభరాజు నిలఁబడియున్నాఁడు. ఏమి సమాచరము!

శాల్వ.. బ్రాహ్మణా! దూరముగనుండుము.

భీష్మ ...కత్తి బాబూ! నాకత్తి కొంచెమిండు.

శాల్వ.. చంపుఁడు. త్వరగా చంపుఁడు. (భటులు బల్లెముతో భీష్ముని పొడవఁబోదురు.)

మాధ.... నిరాయుధుఁడగు నొకవీరుని హత్యచేయుటకుముందు బ్రహ్మహత్యచేయుఁడు (భీష్ముని కౌఁగిలించుకొనును.)

(సైనికులతో దాశరాజు ప్రవేశించును)

దాశ—ఎవడా మొగాడు! (బరిసదూసి శాల్వునిభటుల కెదురుగ నిలఁబడును)

శాల్వ చంపుఁడు చంపుఁడు తక్షణము.

దాశ—నేను నిలబడివుండగానే? (భీష్మునితో) నీకేంభయంలేదబ్బాయీ! (తనసైనికులతో) అరే కర్రలెత్తండిరా!

శాల్వ.... నీవెవఁడవు?

దాశ... నేను ధీవరరాజును.

శాల్వ...బెస్తల నాయకుడవా?

దాశ....అయితేయేమి? బెస్తలనాయకుడికికూడా తెలుసును కత్తిలేనోళ్ళమీదికి కత్తెత్తకూడదని.

మాధ...సెబాసు ధీవరరాజా!

శాల్వ ..తొలగిపొండు.

దాశ.. ఊఁహూ. ఆమాటొట్టెద్దీ. పానంఇస్తాగాని బతికుండగా ఈయనమీద దెబ్బపడనీను. (తనసైనికులతో) ఒరే కర్రలోళ్ళల్లారా! మీరంతా ఒకబంతిగా నిలవండి. కాస్తచూద్దాం ఈన యేమాత్రం మొగాడో. (కత్తితిప్పును.)

(ఈసమయమున మాధవుఁడు భీష్మునికట్లు తెంపును. భీష్ముఁడు కత్తిదీసికొని నిలఁబడును)

భీష్మ...ఇంక నెవ్వరు నక్కఱలేదు రమ్ము సౌభరాజా!

(శాల్వుఁడు భటులతో పారిపోవును.)

దాశ...ఆసప్పుడకదుకఆడా! (తనసైనికులతో శాల్వునెదుర్కొనును)

భీష్మ...యుద్ధము చేయుము క్షత్రియకులాంగారమా!

శాల్వ....(భీష్ముని కాళ్ళకడ కత్తినుంచి చేతులుజోడించి మోకరిల బడి) దేవవ్రతా! క్షమింపుము.

దాశ....(ఒకతన్నుతన్ని శాల్వుని క్రిందఁబడఁగొట్టి రొమ్ముపైనెక్కి కూర్చుండును.) ఇదుగో ఛమిస్తున్నాను. బరిసెపట్టిముడవనా?

(బరిసెయెత్తును.)

(శాల్వుఁడు దీనదృష్టితో భీష్ముని వంకజూచును.)

భీష్మ...విడిచిపెట్టుము (శాల్వునితో) నీకత్తి తీసికొనుము మహారాజా!

(కత్తి ఇచ్చివేయును)

దాశ...మంచిది. అబ్బాయిసెప్పుతుండాడుగనుక వొదిలేస్తుండాను. కాని ఈబెస్తలోళ్ళనాయకుణ్ణి మరసిపోమోకు రాజా!

(శాల్వుడు వెళ్ళఁబోవును.)

భీష్మ...నిలువుము సౌభరాజా! (శాల్వుఁడు నిలఁబడును) వినుము. నిరాయుధుఁడగు బంధితుని చంపుట క్షత్రియునిధర్మముగాదు జ్ఞాపకముంచుకొనుము. కాలితోఁదన్నినవాఁడును కాళ్ళపైఁబడి క్షమాపణకోరినచో ఆతన్నును బదులుతీర్చుకొనవలసినపని లేదు. పొమ్ము.

(శాల్వుఁడుతనసైనికులతో నిష్క్రమించును.)

మాఘ—అసలు సమాచారమేమి! దేవవ్రతా?

భీష్మ...ఈతఁడును క్షత్రియుఁడే!

దాశ...వొదిలేసావు అబ్బాయీ!

భీష్మ ..ధీవరరాజా! నీవు చాలసాహసివి.

దాశ.. మైదానంలో పడ్డానంటే ఇంకేరికీ ఎరిసేదిలేదు. ఇంటో మా ఆడుదాన్కొస్తే దానికెహస్తాను.

భీష్మ—క్షత్రియులననిట్టివారు. పరశురాముఁ డిట్లే—పోనిమ్ము. ఆసంగతియెందుకు? (ప్రస్థానము)

(మాధవుఁడును దాశరాజును వెంట వెంటఁబోవుదురు.)

మాధ—నీ విచ్చటికేల వచ్చితివి?

దాశ—పెల్లిసేసుకోడానికి.

మాధ—నీకు భార్య యున్నదిగదా?

దాశ...అది ఊరకే పోట్లాడుతుందని. (ప్రస్థానము)

—❀❀❀❀—

ద్వితీయదృశ్యము.

కాశీరాజు గృహము—ప్రభాతము

(కాశీరాజును రాజకుమారుఁడును ప్రవేశించెదరు.)

కాశీ—ఎంత ఆశ్చర్యము! రాత్రి నాయుద్యానవనములో—

రాజ...ఆశవములు శాల్వునిభటులవని రూఢియైనది.

కాశీ—కాని ఆమృతకళేబరములందు కత్తిగంటులు లేవా?

రాజకు—లేవు నాయనగారూ!

కాశీ—నిన్నసాయంత్రము తోఁటలో అంబికాంబాలికలకును భీష్మునకును సమావేశమైనదా?

రాజకు....అవును అయినది,

కాశీ...ఇదియే సందేహము — కానిభీష్ముఁ డంతపనిచేయునా? ఆయనయుద్దేశ్య మేమో తెలియుటలేదు. మంచిది పొమ్ము పోయి స్వయంవరసన్నాహము చేయుము.

(రాజకుమారుఁడు పోవును.)

కాశీ...ఔరా! పెండ్లికిముందుగ—

మాధ....(ప్రవేశించి) తమరేనా కాశీరాజు?

కాశీ...అవును ధరణీసురా! (నమస్కరించి) నేను మిమ్ము గుర్తింపలేను.

మాధ—నేను పూర్వముకీర్తిశేషులగు శంతనుమహారాజుగారికి మిత్రుఁడను. ఇప్పుడు వారిపుత్రులకు హితచింతకుఁడను. హస్తినాపురయువరాజగు దేవవ్రతుఁడు—భీష్ముఁడు హస్తినాపుర

మహారాజగు విచిత్రవీర్యునకుఁగా తమకనిష్టపుత్రికల నిద్దఱ
ను గోరవలసినదని నన్ను తమయొద్దకుఁ బంపెను.

కాశీ...భూసురవరా! అదియెట్లు? ఇది స్వయంవరసభ.

మాధ—అయితే మహారాజుగారు మాప్రార్థన మంగీకరింపరా!

కాశీ...లేదు.

మాధ—నేను నిదియే యనుకొంటిని—శుభము. (ప్రస్థానము)

కాశీ...ఇది యెక్కడిపద్ధతి?

సునంద—(ప్రవేశించి) మహారాజుగారిని రాణిగారొకమాఱు లోనికి
పిలుచుచున్నారు.

కాశీ....ఎందుకు?

సునంద—పెద్దమ్మాయిగారు చాల యేడ్చుచున్నారు.

కాశీ—ఏడ్చుచున్నదా—ఎందుకు?

సునంద...తెలియదు.

కాశీ—నేను వచ్చుచున్నాను. నీవుపద. (సునంద పోవును) ఈసంగ
తులన్నియు రానున్నయనర్థమును సూచింపుచున్నవి. ఏమి
యు తెలియుటలేదు. (ప్రస్థానము)



తృతీయదృశ్యము

కాశీరాజు స్వయంవరమండపము—ప్రభాతము.

(క్షత్రియరాజులును మంత్రిసహితుఁడగుదాశరాజును కూర్చుండి
యుందురు. కాశీరాజకుమారుఁడును భటులును ప్రక్క నిలఁ
బడియుందురు.)

శాల్వ—కాశీరాజెక్కడ?

రాజకు—వారు కన్యలను దీసికొనివచ్చుచున్నారు.

రాజు—(దాశరాజును జూపి) ఈయన యెవరు?

రాజకు—ఆఁ ఈయన యెవరు!— అయ్యా! మీరెవరు

దాశ....నేను ధీవరరాజును.

రాజకు—ఏమబ్బాయీ! నీవిక్కడ కెందుకు వచ్చితివి?

దాశ—నేనును ఒకపిల్లకు అభ్యర్థిని.

రాజకు—అభ్యర్థివెట్లు?

దాశ...నేను పెళ్ళిచేసుకుంటా?

రాజకు—నీవా! నీకేజాతివాఁడవు?

దాశ—మేం ధీవరులం.

రాజ—బెస్తవాఁడవా!

దాశ—ఉఁహూ' ధీవరులం.

రాజ...సరే! నీవృత్తి చేఁపలుపట్టుటయే కాదు?

దాశ—సరే అట్లాగేఅనుకో. ఏం అయితే తప్పా? అల్లుళ్ళను పట్టడంకంటె సేపలుపట్టడం అనేకరెట్లు మంచిది.

రాజకు...అల్లుళ్ళను పట్టుటయెట్లు?

దాశ—లేకపోతే ఇదేంటిమరి? పాపంకొంతమంది పెద్దమనుసులబిడ్డలను పిలవడమున్నూ ఆళ్ళమెడలపై ఒకగాడిదబరువువేసి కట్టడమున్నూ. దీనికంటె సేపలుపట్టుకోడంమంచిది. సేపల్ని తిననాన్తింటాము. అల్లుళ్ళను ఎవరూ తినరు.

రాజ...ఇతఁడేమో వాగుచున్నాఁడు.

శాల్వ—ఇతనిని బయటకు గెంటుము రాజకుమారా!

దాశ...గెంటుతావా? గెంటూమరిసూద్దాము.

రాజ...ఇది క్షత్రియులసభ. ఇచ్చటకు బెస్తలు వచ్చుట కధికారము లేదు

దాశ...నేను రాజును.

శాల్వ...ధీవరుఁడు రాజెట్లు?

దాశ ..నేను హస్తినాపురం మారాజుమామను.

శాల్వ...మామవెట్లు?

దాశ...శంతనుమారాజు మాఅమ్మాయిని మచ్చగందిని నన్నడిగి పెళ్ళి సేసుకొన్నాడు.

రాజకు—నిజమా?

దాశ....బొత్తుగా తెలియనివాడల్లే వున్నావే! మంత్రీ! సూసావా? ఎక్కడో బొత్తుగా తెలియనట్టుండాడు.

మంత్రి....సిత్తం.

దాశ....సిత్తంయేంటి? (ఆ) మారాజా, అను. నేను రాజానని ఎప్పుడూ గ్యాపకం వుంచుకో.

రాజకు....క్షత్రియులు నీచజాతివారిపిల్లను పెండ్లిచేసికొనవచ్చును. కాని తమపిల్లను నీచజాతివారి కీయరు.

దాశ...అయితే ఇది సాలాపెద్దపొరపాటే— ఏం మంత్రీ

మంత్రి—మా మారాజుగారివంశం ఇక్కడున్నారిదికంటె ఏం తక్కువది కాదు—

రాజకు...ధీవరులకొకవంశమా' అదియొకశూద్రజాతి.

దాశ—మంత్రి! సూసావా? ఈళ్ళు నన్ను అవమానం సేస్తున్నారు.

మంత్రి—సిత్తం. అ. సూస్తేనేవున్నాను.

దాశ—మళ్ళి సిత్తం అంటావూ? సూస్తూన్నా మారాజా అను.

రాజకు—లేచిపోండు.

దాశ...ఎందుకు లెగాలి?

శాల్వ—నీ విచ్చట నేమి చేసెదవు?

రాజకు....సరిగా లేవనిచో మెడపట్టి గెంటించెదను.

దాశ.. ఏంటి మెడపట్టా!

రాజక—అవును.

దాశ.. మెడా?

రాజ... మెడ.

దాశ —మంత్రీ!—

రాజకు—ఆసనమునుండి దిగుము. లేనిచో—

దాశ—ఎందుకు దిగుతాను?— మంత్రీ'

మంత్రి—(చెవిలో చెప్పును) ఆసనంనుంచి లెగండి.

దాశ...ఎందుకు! ఆసనంమీదనుంచి ఎందుకు లెగుస్తాను? ఆసనం

మీరంది—
మంత్రి...ముందుతెగండి తర్వాత మాట్లాడుదాం. లేకపోతే—
దాశ...లేకపోతే యేం'
మంత్రి—లేకపోతే అవమానం అవుతుంది.
దాశ...నిజంగా అవమానం అవుతుందా?
మంత్రి—ఇదుగో అవమానం అయింది.
దాశ...ఆఁ ఆఁ.
మంత్రి...తెగండి లేకపోతే ఇంకేం లేదు.
దాశ.. ఆఁ. (లేచును.)
మంత్రి—ఇంక బయటికి పదండి.
దాశ...బాబో పదపద. (వెళ్ళుచు వెళ్ళుచు వెనక్కు తిరిగి) కాని
మంత్రి...కానీలేదు అర్ధణాలేదు. పదండి (చేయిపట్టుకొని తీసికొని పోవును.)
శాల్వ—వీని నిచ్చుటకు రానిచ్చిన దెవరు? అదుగో మహారాజు వచ్చుచున్నారు.
(కాశీరాజును ఆయనకన్యలు ముగ్గురును ప్రవేశించెదరు.)
ద్వారపాలకుఁడు—మహారాజా బహుపరాకు.
కాశీ...మహారాజులారా! మీరంతయును దయచేయుటచే నారాజ్యమును, భవనమును, నాసభయు ధన్యములైనవి. రాజులంతయును వచ్చిరా?
రాజకు... ఆఁ నాయనగారు!
కాశి...నాప్రియజ్యేష్ఠపుత్రికవగు అంబా! నీమనోనుకూలుఁడగు వరుని వరించుము. (అంబ తనసఖియగు సునందతోఁబోయి శాల్వునిమెడలో జయమాలవేయబోవును ఇంతలో మాఘవునితో భీష్ముఁడు ప్రవేశించును.)
భీష్మ...ఆగుఁడు. (అందఱు నులికిపడి ఆయనవంక జూచెదరు. రాజు ప్రత్యుత్థానము సేయును.)
కాశి...మహామతీ! భీష్మా! రమ్ము. కూర్చుండుము.

భీష్మ...కూర్చుండ నక్కఱలేదు. కాశీరాజా! నే నిచ్చటకాహూతుఁ డనై రాలేదు. నేను పెండ్లిచేసికొనఁ గోరుటలేదు నాకై యి చ్చట ఆసనమును వేయలేదు.

కాశి...అగుచో నే నింక హస్తినాపుర యువరాజిచ్చట కాకస్మిక ముగ వచ్చుటకుఁ గారణమడుగవచ్చునా?

భీష్మ....నేను కాశిరాజు కనిష్ఠపుత్రికల నిద్దఱను హస్తినాపుర మహారాజగు విచిత్రవీర్యునకుఁ గోరుచున్నాను.

కాశి....ఆదియెట్లు యువరాజా! ఇది స్వయంవరపక్ష.

భీష్మ...అది నే నెఱుఁగుదును. కాశీరాజా! అయినను నేనుకాశి రాజకన్యల నిద్దఱను గోరుచున్నాను. మహారాజు నాప్రార్థన నంగీకరింపనిచో నేను వారిని బలాత్కారముగఁ గొంపో వుదును.

కాశి...ఇది అసంభవము.

భీష్మ...అగుచో మహారాజు నన్ను క్షమింతురుగాక. నే నీకన్యల నిద్దఱను గొనిపోవుదును. బలముగలవారు నన్నెదుర్కొన వచ్చును. రండు. (అంబ చేయిపట్టుకొనును.)

శాల్వ...ఇంతసాహసమా! (కత్తిదూయును.)

కాశి...నిజముగ నీతనిమొదను చెడిపోయినది. లేనిచో నీస్వయంవర సభకు పిలువని పేరంటముగవచ్చి—

భీష్మ...మహారాజా! మీ రీసభకు హస్తినాపురమహారాజు నేల పిలువలేదో నే నెఱుఁగుదును. ఆయనతల్లి ధీవరకన్యయగు టయే దీనికిఁగారణము. మీరు మొదటనే శంతనుమహా రాజుగారి మామయగు దాశరాజును ఈసభనుండి వెడలఁ గొట్టితిరి. కాని భీష్ముఁడు ప్రాణమున్నంతవఱకు తనతండ్రి కవమానము రానీయఁడు. ఇది జ్ఞాపకముంచుకొనుఁడు. హస్తి నా పురాధీశ్వరుఁడగు విచిత్రవీర్యమహారాజునకు భార్యలను గా నే నీయిద్దఱుకన్యలను గొనిపోవుచున్నాను. శక్తిగలవారు నన్నెదిరింపవచ్చును.

శాల్వ...మహారాజులారా! (రాజులందఱు సింహాసనములుదిగి ఖడ్గ హస్తులై భీష్మునిపైకి పోవుదురు.)

భీష్మ—సైనికులారా! (సాయుధులగు పదిమంది సైనికులు వచ్చెదరు) మీరీకన్యలను మీవద్దికలోనుంచుకొనిపోయి నారథముపై గూర్చుండఁబెట్టుఁడు. దారిలో నెవ్వరే నడ్డపడుచో శస్త్రప్రహారమునకు వెనుదీయకుఁడు. (మాధవునితో) మీరును విరితో నుండుఁడు.

[సైనికులు కన్యలను మధ్యనుంచుకొని కొనిపోవుదురు. వెంట మాధవుఁడు పోవును.]

భీష్మ..మహారాజులారా! ఇంక మీరందఱు కలిసిగాని మీలో నొక్కొక్కరుగాని హస్తినాపుర మహారాజునకుఁ బ్రతిపక్షముగనుండఁగోరినచో భీష్ముఁడు మీయందఱను యుద్ధమున కాహ్వానించుచున్నాఁడు.

శాల్వ...కలియఁబడుఁడు. (అందఱు భీష్మునిపైఁ గలియఁబడుదురు.)

భీష్మ....అయితే బయటకురండు. ఈవివాహమండపమును మీరక్తముచేఁ గలుషితము చేయును. (కత్తి త్రిప్పుచు దెబ్బలుతప్పించుకొనుచు పోవును.)

శాల్వ...ఇచ్చటనే చంపుఁడు. (దారికాచును.)

భీష్మ..అగుచో మారణహోమము నిచ్చటనే చేసెదను. (రాజులపైఁగలియఁబడును. భీష్మునికత్తివ్రేటుచే నయిదారుగురు నేలఁగూలుదురు. శాల్వుఁడును గ్రిందఁబడును.)



## చతుర్థదృశ్యము.

హస్తినాపుర ప్రాసాదము — పూర్వాహ్ణము.

(సత్యవతి యొంటరిగనుండును.)

సత్య....నాకొడుకునకుఁ బెండ్లిఅయినది. నాకు రవ్వంతకబురేని తెలుపలేదు. నాతో సంప్రదించుటగూడ అనావశ్యకమని యెం

చేఁబడినది. నాయింటిలోనే నేనిట్టు లేవగింపఁబడుట!

(విచిత్రవీర్యుఁడు ప్రవేశించును)

విచి....అమ్మా! నీవు వింటివా? (దగ్గును)

సత్య....ఏమినాయనా?

విచి...రాజులందఱు నొక్కవైపున, అన్నయ్య ఒక్కఁడు నొక్కవైపున అయినను (దగ్గును) ఈయుద్ధములో నన్నయ్యయే గెలిచినాడు విన్నావాఅమ్మా?

సత్య....వింటినినాయనా!

విచి...అన్నయ్యతో సమానుఁడగు వీరుఁడు మూడులోకములందును లేడు. (దగ్గును)

సత్య...నీకు పెళ్ళికూతుళ్ళు బాగుగనున్నారా?

విచి....(తలవంచుకొని) లేదమ్మా!

సత్య.. ఏమి, వారు సుందరులుగారా?

విచి...సుందరులే కాని (దగ్గు) నాప్రకృతితోఁ గలియుటలేదు. (దగ్గు)

సత్య...ఏమినాయనా?

విచి....వీరు చాలచపలలు. ఎప్పుడును నవ్వుచుమాటలాడుచుందురు. మంచిఆరోగ్యముగలవారు. నే నింక నెప్పుడును రోగగ్రస్తుఁడను, విషణ్ణుఁడను. నామనస్సులోఁ జులుకుదనము లేదు.

సత్య....ఏమినాయనా?

విచి.. ఎందుకో తెలియదు నే నెవ్వఁడనో నాకే తెలియనట్లుండును (దగ్గును) ఎక్కడనుండివచ్చితినో తెలియదు. భూమికిని నాకును సంబంధమే లేనట్లుండును (దగ్గును) నేను బ్రతికియుంటి నని తెలిసికొనుశక్తిగూడ నాకులేదు అప్పుడప్పుడు నేను జీవించియుంటినా చచ్చిపోతినాయని సంశయము గలుగుచుండును. (దగ్గును) అమ్మా! నేనీరాణులను ప్రేమింపఁజాలను. కాని (దగ్గును) వారిని చూచుచుండుట నాకిష్టము ఏమన (దగ్గును) వారు సుందరులు వారిసంగీతమువినుటకు సొంపుగ

నుండును. (దగ్గును) ఏమన వారికంఠస్వరము మధురము
గను శ్రావ్యముగను ఉండును. లేనిచో—

సత్య....అబ్బాయీ! విచిత్రవీర్యా! నీకు విచారమెందుకు? నీవురాజపుత్రుఁడవు. నీముఖమెప్పుడును విచారమగ నుండు టెందుకు

విచి...నాకేమియు తక్కువలేదు. ఇదియే అన్నిటికన్న పెద్దదుఃఖము. ఏదేనికొఱతయున్నచో దానిని తీర్చుకొని సుఖముపొందువాఁడను. నేను రాజపుత్రుఁడను. నే నేమియు చేయునది లేదు. నేను చేయవలసినపని యితరులు చేయుచుందురు నేను సుందరి ప్రేమకును పాత్రమగు నొకయాటవస్తువును. ఆటవస్తువువలె నేను నిర్జీవుఁడను. కనుకనే నాజీవితము శూన్యము, జడము. నేను వెళ్ళి అన్నయ్య యెక్కడనున్నాడో చూచెద. (నిష్క్రమణము.)

సత్య....ఇది యేమి వింత? పెండ్లిఅయిననాటనుండియు పిల్లఁడు బొత్తుగా చెడిపోయినాఁడు. ఒంట్లో ఊపిరి లేనట్లున్నది. (తల వంచుకొని ఆలోచించుచు పోవును.)

(విచారముతో భీష్ముఁడు ప్రవేశించును.)

భీష్మ...ఆనాఁడు ఆమె బాలిక. నేఁడు నిండుజవ్వనమున నలరారుచున్నది. అదియే ముఖము, అవియే హావభావములు, అవియే చూపులు. అంతయు నదియే. కటాక్షములలో తేజరిల్లు నూతనవిద్యుద్విలాస మొక్కటే అపూర్వము. దాని నే నిదివఱకెన్నఁడును చూడలేదు. చాల చిక్కిపోయినది. పాలిపోయినది. యౌవనమాధుర్య మామెదేహలతపై అంకితమయినట్లున్నది. వసంతసమయమున కెంజిగురాకులను, మొగ్గలనుదాల్చు లతలవలె క్రొంజవ్వనమున నామెదేహము భాసిల్లుచున్నది—ఇదియేమి! నాహృదయ మేల మఱల చంచలమగుచున్నది. ప్రలోభనమును నేను కాలితో రాచివేసితిని. అయినను ఆచ్ఛాదితమగు దానిగంభీరస్వర మప్పుడప్పుడు నగారామ్రోతవలె మ్రోగుచుండును. మానవునిమన

సింత దుర్బలమా!

(అంబ ప్రవేశించును.)

భీష్మ....(ఉలికిపడి) నీ వెవరవు?

అంబ —కాశీరాజకన్యయగు అంబను. కొంచె మిటుచూడుము. యువరాజా! గుఱుతింపఁగలవో లేవో చూచెద. ఏమియూ రకుంటివి? జ్ఞాపకమురాలేదుకాబోలు? జ్ఞాపకముచేయుదునా? ఒకనాఁడు కాశిలో గంగయొడ్డున మేడకు ప్రక్కగానున్న తోఁటలో మఱ్ఱిచెట్టు క్రింద ఎవతెకెదురుగ మోకరిలఁబడి నీవునీనోటితో „నీరూపద్వారముకడకు వచ్చినభిక్షుకుఁడను„ అని చెప్పితివో, ఓకపటసన్యాసీ! ఆమెనే నేను. జ్ఞాపకము వచ్చెనా యువరాజా?

భీష్మ....(తలవంచుకొని) జ్ఞాపకము వచ్చుచున్నది.

అంబ...జ్ఞాపకము వచ్చుచున్నదా! విచిత్రపురుషుఁడవు. పుల్ల విరచినట్లు సత్యమగు గణితసిద్ధాంతమునుబలె నీరసనిశ్చలస్వరముతో చెప్పుచుంటివే! విచిత్రపురుషుఁడవు. ఒకనాఁడు ఎవతెతండ్రికి అతిథివిగనుంటివో, ఎవతె సాయంప్రాతఃకాలములందు నీకుమనోరంజనముసేయుసహచారిణియో, ఎవతెకాళ్ళకడఁ గూర్చుండి—చేతిలో చేయివేసికొని నిత్యము ఎవతెమాటలను మంత్రముగ్ధుని వలె వినెడివాఁడవో, అప్పుడు నీకు ప్రపంచమున వినఁదగినది మఱియొకటి యుండినట్లు లేదు. నిత్యము ఎవతెముఖమును ప్రపంచమున ఇంతకంటె వేఱొకదర్శనీయము లేదనునట్లు చూచెడివాఁడవో, ఒకనాఁడు ఎవతెతో—

భీష్మ....క్షమించుము దేవీ! కడచినవృత్తాంతమును స్మరించుటచే నేమిలాభము? నేఁడు నీకును నాకును మధ్య నొకయపారసాగరము గర్జించుచున్నది.

అంబ—ఎఱుఁగుదును. యువరాజా! నేను నీయొద్దకు ప్రేమభిక్షవడుగుటకు రాలేదు. నీవు నన్ను నాతండ్రియొద్దనుండి బలాత్కార

ముగ తోడితెచ్చితివి. నేను స్వయముగ రాలేదు. ‘‘ నీకును నాకును మధ్య నొకయపారసాగరము గర్జించుచున్నది.,, అని నీవు చెప్పినమాట యథార్థము. అంతకంటె నీవును నేనును ఒకమనుష్యలోకమున నివసించుటలేదని చెప్పినను ఉచితమే! యువరాజా! నీవుమనుష్యలోకమున నున్నచో నేను స్వర్గమును పొందలేకున్నను నరకమునకు పోదును. ఈమనుష్యలోకమునమాత్రముండను.

భీష్మ—ఎందుకు దేవీ?

అంబ—పోనిమ్ము—నాకిపు డొకసంగతి చెప్పుము. నన్ను బలాత్కారముగ నిచ్చటికేల తీసికొని వచ్చితివి?

భీష్మ....స్వయంవరమండపమందలి కోలాహలములో నిన్ను గుర్తింపజాలకపోతిని.

అంబ...కోలాహలమున గుర్తింపఁజాలకపోతివా?—అసత్యవాదీ—వంచకుఁడా! నన్ను విడువుము.

భీష్మ...దేవి! ఆజ్ఞయగుఁచో ఇప్పుడే నిన్ను నీతండ్రికడ విడచి వచ్చెదను.

అంబ—మంచివాడవు. చాల మంచివాఁడవు. యువరాజా! నీకింత శ్రమయేలకి అవసరములేదు. నేను నాతండ్రికడకు వెళ్ళను. భర్తకడకు వెళ్ళెదను. నన్నువిడిచి పెట్టుము.

భీష్మ—భర్తకడకా దేవీ! నీభర్త యెవరు?

అంబ—సౌభరాజగు శాల్వుఁడు.

భీష్మ—శాల్వుఁడు నీభర్తయా? సర్వనాశము. నీకతనితో పెండ్లి కాలేదుగదా?

అంబ...అగుఁగాక కాకుండుగాక దానినీకేమి? హస్తినాపురయువరాజా! అయిననేమి కాకున్ననేమి? నేను ఆయనను నాహృదయమున భర్తనుగా వరించితిని. ఆహృది నక్క వలె జిత్తులు మారిది గాదు. గాలివలె నిలుకడలేనిది కాదు. పురుషునివలె వంచకురాలు గాదు స్త్రీ ఒక్కమారు ఎవ్వని భర్తనుగా

స్వీకరించునో ఆభాగ్యశాలియే ఆమెకు మరణపర్యంతము భర్త.

భీష్మ—శాల్వుని నీవు ప్రేమించుచుంటివా?

అంబ—ఎందుకు ప్రేమించను? యువరాజా ఈప్రపంచములో నీ వొక్కడవే ప్రేమించుటకు యోగ్యుఁడవని తలఁచుచుంటివా? ప్రతియింటను స్త్రీలు నిన్నొక్కనినే పువ్వులతో పూజించుచుంటిరనుకొంటివా?— అవును. నేను శాల్వుని ప్రేమించుచుంటిని.

భీష్మ—జాగ్రత్త దేవీ! శాల్వుఁడు నీచుఁడు లంపటుఁడు.

అంబ—జాగ్రత్త యువరాజ! శాల్వుఁడు నాభర్త.

భీష్మ—ఇది నీచేతితో నిన్నుచంపుకొనుట

అంబ...అగు నో నీకేమి?

భీష్మ...నాకేమియనుచుంటివా దేవీ? నేను ఆపగలిగినచో నీయీ ఆత్మహత్యను ఆపనా? దేవీ! నీవు మఱియొకని పతిగాఁ గోరుము. ఆత్మహత్యచేసికొనకుము

అంబ...గొప్పసాహసివి. నిన్ను సలహా ఎవ్వరడుగుచున్నారు నన్ను విడిచిపెట్టుము.

భీష్మ—ఆత్మహత్య చేసికొనవలదు దేవీ!

అంబ...నన్ను విడువుము.

భీష్మ...ఇది నావలన కాదు. క్షమించుము సోదరీ! నిన్నింతగా ప్రేమించుచుండుటచే నేను నీఆత్మహత్య చూడగోరుటలేదు.

అంబ...నీవు ప్రేమించుటవలనను. మానుటవలనను ఇచ్చట నెవ్వరికిని వచ్చునదియు పోవునదియు లేదు. నాపై నీ కేమియునధికారము లేదు. బ్రహ్మచారీ! విడువుము. నేను శపథము చేయుచున్నాను. బ్రతికినను చచ్చినను శాల్వుఁడే నాకు భర్త—విడువుము రాజకన్యా రా!

భీష్మ—సోదరీ! తథాస్తు ద్వారము తెఱచియున్నది. నీవు నీభర్తకడకు పొమ్ము. ఆశీర్వాద మొసఁగుచున్నాను. యశస్వినివి కమ్ము. వివాహముచే సుఖముఁ బడయుము.

భీష్మ...సిద్ధముకమ్ము. తధాస్తు. తగినయేర్పాటు చేసెదను.
(అంబ వ్యర్థకోపముచే తనపెదవులు కొరుకుచుపోవును.)

భీష్మ...ప్రియసోదరీ! నాహృదయమున నింతదనుక ప్రవృత్తుల కట్టిసంగ్రామము జరుగుచున్నదో నీ వేమి యెఱుఁగుదువు? నిజమైనవీరత్వమన నిదియే!

ఉ ॥ బాహుబలంబుతోడుగఁ గృపాణముగైకొని శత్రురాజితో
సాహసమందుఁ బోరి విజయంబును గాంచుట వింతగా దిఁకన్
స్నేహముఖప్రవృత్తులకుఁ జిత్తమునన్ రవణిల్లు యుద్ధస
న్నాహమునన్ జయంబుగనువాతఁడె శూరుడువీరుఁ డెంతయున్.

మాధవుడు....(ప్రవేశించి) దేవవ్రతా!

భీష్మ...ఏమి బాబు?

మాధ...విచిత్రవీర్యుడు చాల నేడ్చుచున్నాడు. త్వరగ రమ్ము

భీష్మ...ఏడ్చుచున్నాడా! ఎందుకు?

మాధ.... తెలియదు.

భీష్మ....నేను వెళ్ళుచున్నాను అతనిని యిచటికే తీసికొనివచ్చెద. మీ రిక్కడనే యుండుడు బాబు. కొంచెము మాటలాడవలసి యున్నది. (ప్రస్థానము)

మాధ....ఏపనిచూచినను పాడుగనేయున్నది

(సత్యవతి ప్రవేశించును)

సత్య....ఎవరు? మాధవా?

మాధ...ఎవరు? మహారాణీ!

సత్య...దేవవ్రతుఁ డెక్కడ?

మాధ...అతని వెదుకవలసిన పనియేమి మహారాణీ!

సత్య...అతని నొకమాఱు నాతో కలియుమని చెప్పుము.

మాధ...ఎందుకు?

సత్య....నేను అతనిని యిన్నగూడ అడుగదలఁచుకొన్నాను. ఈసామ్రాజ్యమున నాకేమియు జోక్యములేదా? రాజపరివారమునకు నేనేమియుఁగానా! విచిత్రవీర్యునకు నే నేమియుగానా?

## తృతీయాంకము.

మాధ....ఎవరన్నారు?

సత్య...అనవలసినదేమున్నది. పనులను బట్టియే తెలియుచున్నది.

మాధ...ఏపనినిబట్టి మహారాణీ?

సత్య...ఈవిచిత్రవీర్యుని పెండ్లిమాటయే తీసికొనుము. కాశీరాజుకూతురును బలవంతముగ తీసికొనివచ్చి పిల్లవానికి పెండ్లిచేసితిరి. నన్ను మాటమాత్రమేని యడుగలేదు. ఇంక— (మాట రాదు.)

మాధ...మహారాణీ! పిల్లవానికి క్షయరోగము వచ్చినది. ఇతఁడెంత ఆనందముగనున్న శరీరమునకును మనస్సునకును అంత లాభమని వైద్యులు చెప్పిరి.

సత్య...ఇంక—

మాధ—అందుకని మేమీ ఆనందమయులగు సుందరుల నిద్దఱను తీసికొనివచ్చి పెండ్లిచేసితిమి

సత్య—ఈమాటయే ముందుగ నొకమాఱు నన్నడిగిన నేమియు హానిలేదు— ఏమి యూరకుంటివి?

మాధ—దీనిజవాబు మహారాణి కిష్టముగ నుండదు.

సత్య—అయినను వినగోరుచున్నాను.

మాధ...మహారాణి ఒకపుత్రుని చేతులార చంపివేసినది. ఈ రెండవపుత్రుని మేము చంపనీయఁ దలఁచలేము.

సత్య....జాగ్రత్త బ్రాహ్మణా!

మాధ...ధీవరపుత్రీ! ఎవ్వరిపై కనులెఱ్ఱసేయుట?

సత్య....ఇంతసాహసమా! భటులారా! వీనిని కట్టివేయుడు.

(భటులు మాధవుని కట్టివేయుదురు)

సత్య—వీనిని చెఱసాలకుఁ గొనిపొండు ఈబ్రాహ్మణుని నక్కలకెఱ చేసెదను. తరువాత కానున్నదియగుగాక.

(భీష్ముఁడు ప్రవేశించును)

భీష్మ—ఇంటిలో నీగందరగోళమేమి? (మాధవునిజూచి తరువాత రాణివంకఁజూచి) ఓహో తెలసినది— భటులారా! కట్లు

విప్పొదు?
సత్య—(భటులతో) జాగ్రత్త!
భీష్మ.. విప్పుము (భటులు కట్లువిప్పుదురు)
సత్య—దేవవ్రతా! (భీష్ముఁడటుచూడక వెళ్ళిపోవును)
మాధ....మహారాణీ! ఏమిసెలవు.? (మోకరిలబడి త్వామభివాదయే లేచి వెళ్లబోవును.)
సత్య...వసుంధరా! నీవు నాపాదములక్రిందనుండి తొలగిపొమ్ము. ఇంక లజ్జాతిరస్కారములచే మెడకు అనాదరమను ఉచ్చు పెట్టుకొని నేను మహాశూన్యమున వ్రేలాడుదును. అగ్నిప్రవాహము శరీరమంతట ప్రవహించుచున్నది. రోమరోమము నండియు మిణుఁగురులు లేచుచున్నవి. నేను మండిపోవుచు న్నట్లున్నాను. ఈయగ్ని నన్ను కాల్చి యేల బూడిదచేయదు?
విచిత్ర...(ప్రవేశించి) అమ్మా! అమ్మా!
సత్య...కుమారా! కాదు! నేను నీకేమియు కాను. బాలకా! విచిత్రవీర్యా! నే నిప్పుడు నీకు తల్లినికాను. నేను విసవుకోఱపెఱకిన కాలసర్పమును. నేను పునఃపల్లవితప్రసూనితంబగు పాత్రమొద్దును. నీవు రాజపుత్రుఁడవు నేను బిచ్చపుదానను. ఈరాజ్యముతో నాకేమియు సంబంధములేదు. కన్నపిల్లనికి తల్లినికూడ కాను. రోగగ్రస్తునివాంతిని భక్షించురాదాఁకుక్కను. నేను నీకుతల్లినిగాను. భీష్ముడు నీకన్న, నేను నీకేమియు గాను— ఇదియేమి! ఇదియేమి కుమారా! నీయెఱ్ఱనిబుగ్గలపై రెండు ముత్తెములవలె ఈఅశ్రుబిందువు లేలపడినవి.? ఏమివచ్చినది కుమారా!
విచిత్ర. నేను నీకేమియుఁగానా?
సత్య—ఎవ్వరన్నారు నాయనా?
విచిత్ర—నీవనుచుంటివి.
సత్య...వట్టిది. నేను వట్టిమాట యంటిని. నీవు నాకుసర్వస్వమవు. ఈ ప్రపంచములో నాకింక నెవరుగలరు! రెండుకన్నులుండెడివి

ఒకకన్ను పోయినది. రెండవకన్ను నీవేనాయనా! నీవు నాకు కనులకు జ్యోతివి, నాశరీరమునకు ప్రాణమువు, నాయాకలికాహారమవు. నాదప్పికకు జలమవు రమ్మునాయనా! నాయొడిలోనికి రమ్ము. నేనుపాపాత్మురాలను. అయినను నీకుతల్లిని. నేనునిన్నుకడుపున మోసితిని. వానిని గాదు. రానాయనా! యొడిలోనికి రా! నాఅవమానమునంతయు మఱచెదను. రా ప్రియకుమారా! నాసర్వస్వమా! రమ్ము. (విచిత్రవీర్యుని
(కౌగలించుకొనును)

విచిత్ర....అమ్మా! లోపలికి పద నేను నీయొడిలో తలపెట్టుకొని నిద్రించెదను. (ప్రస్థానము.) —

— పంచమదృశ్యము :—

శాల్వుని యుద్యానగృహము. —సాయంకాలము

(శాల్వుడును అతని సభాసదులును పరిహాసముచేసికొనుచుందురు సభాసదులు పరిహాసమునకై చేతకాని ప్రయత్నముచేయుచుందురు. కాని అట్టహాసము ఆలోపమును దీర్చుచుండును)

౧స...మహారాజా! నాకు చాల వింతగ నున్నది. కాశీరాజుకన్య కులటవలె ప్రవర్తించినది.

శాల్వుడు... ఆమె బుద్ధిపూర్వముగనే భీష్మునిరథముపై నెక్కెనని తెలియగనే నేను ధనుర్బాణములు క్రిందనుంచితిని.

౨స...మహారాజుగారు చాల మంచిపని చేసిరి!

శాల్వు...లేనిచో నాచేతిలోనిపిట్ట పట్టుకొనుటకు భీష్మునకు గుండె యుండెడిదా!

౩స—రాజకన్యకును హస్తినాపురయువరాజునకును పూర్వమే ప్రణయసంబంధమున్నదని వింటిని.

శాల్వ...అదియు యథార్థమే,—

౪స...అయితే రాజకన్య మహారాజుగారి మెడలో జయమాల వేయుటకేల వచ్చినది? ఇదియు నొకసంశయమే?

శాల్వ...ఇందులో సంశయమేమున్నది? (౧సభ్యునివంకజూచును)

౫స—అవును. ఇందులో వింతయేమున్నది మహారాజుగారి ముఖార వింద్రము జూచి మగవారమగు మనమే ప్రేమపాశమున పడు చుండ నింక కాశీరాజకన్యనుగూర్చి చెప్పునదేమి? (అందఱు నవ్వుదురు.)

౧స .అయితే ఆరాజకన్య భీష్మునిరథముపై నేల వెళ్ళినది?

౨స...కులటలవ్యవహార మిట్లేయుండును.

శాల్వ .ఆమె పూర్తిగా కులటయే.

3స... పెండ్లికిముందు కూడనా?

౪స... భీష్ముఁ డామెను వలచివేసెనని వింటిని మహారాజా!

శాల్వ...భీష్ముకు బ్రహ్మచారిగదా!

౧స...అగుచో ఆమె భీష్మునికడ నెన్నిరోజు లుండును! ఆమె ఇచటకు రాకతప్పదు.

శాల్వ.. వచ్చిననేమి! రాకున్ననేమి!

౨స...మహారాజుగారికి నూరుగురుకంటె నెక్కువచక్కనిస్త్రీలున్నారు

శాల్వ...ఒక్కతె ఉన్నదెంత! పోయిననెంత?

3స...ఒకవేళ నిజముగ నామె మహారాజుకడకు వచ్చినచో?

శాల్వ—నేను మరల భీష్మునికడ కంపెదను.

౪స...వచ్చిపాడుచు నాడుచునుండుచో నుండనిండు.

(శాల్వుఁడు నవ్వుచు ౪వసభ్యుని వీపుచరచును)

౫స—మహారాజుగారికి వేయిమంది వేశ్యలున్నారు ఇంక మరియొ కతె యెందుకు?

శాల్వ...ఇదుగో వేశ్యలు వచ్చినారు. వీరందఱు అంబలే రండు ఆడు డు పాడుడు.

(వేశ్యలు ఆడుచు పాడుచు ప్రవేశించెదరు)

— గీతము:—

కడు వేగమ్మునఁ బాఱుస్రోతమున విసువు మనోరథనౌకన్
జడియనేల తెరచాపను వదలుము, నడుపుము పడవను వీకన్
సాగె తుపాను ప్రచండవేగమున జలము ప్పొంగెన్ మింటన్

సాగదింక నేయుక్తియు దుఃఖము చనగనిమ్ము మనవెంటన్
కొట్టుకపోదము బిట్టటచెన మింకట్టహాస మొనరించెదము
ఎట్టకేల కీగట్టుచేరియును నేయర్థము సాధించెదము.

(అంబ ప్రవేశించును)

1స.. ఇంకొక తె వచ్చినది.

2స...అవును.

3స...సుందరిగనే యున్నది

4స....మహారాజు దీనివంక తెప్పార్పక చూచుచున్నారేల?

శాల్వ...రమణీ! నీవెవ్వతెవు?

అంబ...నేను కాశీరాజుపుత్రికను.

శాల్వ....ఓహో! తెలసినది— అంబా! చాలవింత! ఇచ్చట కేలని మీదవచ్చితివి? ఊరకుంటివేల?

అంబ...కాశీరాజుకన్య నేడు శాల్వనీద్వారముకడకు ఒంటిరిగా వచ్చినది. అయినను ఆమె తనకొరకును తననోటితో చెప్పవలయునా రాజేంద్రా?

శాల్వ—నిజముగ నాశ్చర్యము. సుందరీ! నీమాటలు నన్నంతకంతకు విస్మయమున ముంచుచున్నవి

అంబ...నాడు స్వయంవరమున నేను నీమెడలో జయమాల వేయుటకు వచ్చితిని. జ్ఞాపకమా? నేను పరిణీతుడగు నాపతికడకు వచ్చితిని.

శాల్వ...అది యేమి! నేను నీపతినా!

అంబ....జయమాల వేసిననాడే నీవు నాకు పతివైతివి. గనుకనే నేను_

శాల్వ...వింతదానవు. రమణీ! నన్ను పతిత్వభిక్షను గోరుచుంటివా?

అంబ....ఇది పతిత్వభిక్షగోరుట కాదు. ఇది పత్నీత్వభిక్ష పెట్టుట. స్వయంవరమంటపమునకు నాడు నీవు వచ్చినది నన్ను పత్నీత్వభిక్ష నడుగుటకే, నేను నీకాభిక్ష పెట్టితిని. తర్వాత వీరుడగు భీష్ముడు తనశక్తిచే ఈదుర్బలహస్తములనుండి ఆభిక్షను లాగికొనెను. నేను తిరిగి అభిక్షను నీభిక్షాపాత్రమున వేయుటకు తీసికొనివచ్చితిని.

శాల్వ—ఆశ్చర్యము!. గొప్పసాహసము — మరలి పొమ్ము. నేను నీయీ దానమును కోరుటలేదు —

అంబ....కాదు స్వామీ! నాకు నాభిక్షను తిరిగితీసికొనుట కధికారము లేదు. భిక్షను నీకేమియిచ్చితినో యిచ్చితిని. స్త్రీ తానిచ్చున దేమో యొకమాటే యిచ్చును. మరణపర్యంత మిచ్చును. ఇంత సులభముగ, అనాయాసముగ, ధైర్యముతో నింతగొప్పదానమును ప్రపంచములో నెవ్వరును చేయరు. ఒకహృదయరత్నమును, ఒకజీవితమును, ఒకమహోత్కృష్టమగు నాశను, ఒకగొప్పభవిష్యత్తును, సుఖమును, దుఃఖమును, స్వాతంత్ర్యమును, స్వేచ్ఛను, జ్ఞానమును, ధర్మమును, కర్మమును, శాంతిని, మోక్షమును జన్మమును జన్మాంతరమును, సర్వస్వమును ఒక్కరోజులో, ఒకగడియలో ఒక్కయదృష్టపూర్వునకు, ఒక అశ్రుతపూర్వునకు, ఒకయజ్ఞాతచరితునకు, స్వర్గీయదేవతయో లేక నారకీయకీటకమో యనికూడ నెఱుంగనియొకనికి ఇచ్చుట. అట్టివానికి తనసర్వస్వము ధారవోయుట, ఇంతగొప్పదానము స్త్రీదక్క ప్రపంచములో మఱియెవ్వరు చేయగలరు? మహారాజా! నేను చిక్కులో పడితిని. అమృతతరంగిణిలో పడితినో విషకుంభములో పడితినో, ప్రేమాలింగనమునకు లక్ష్యమైతినో సర్పదంశమునకో తెలియదు, చిక్కులోబడినదానను పడితిని. ఇప్పు డెవ్వరును క్రింపఁబడకుండ నడ్డఁజాలరు. ఎవ్వరికిని ఇంత శక్తి లేదు.

శాల్వ....(సభ్యులతో) చాలఆశ్చర్యము సభ్యులారా! ఇట్టిధృష్టయాచనసేయు రాజకన్యను ఎచ్చటనేని చూచితిరా? పొమ్ము! సుందరీ! సౌభరాజు భీష్ముని యుచ్ఛిష్టము నెప్పుడును గ్రహింపఁడు. పొమ్ము నీభర్త భీష్ముఁడు. భర్తవలయునో నతనియొద్దకే పొమ్ము. భీష్ముఁడు నిన్నొల్లనిచో నా కొల్వుకూటమున నుండుము. ఈవేశ్యలతో పాటుగ నీవును మేళముచేయుచుండుము. నీకు అన్నవస్త్రము లిచ్చెదను.

అంబ....ఓస్వర్గీయ దేవతలారా!

మ ॥ లలనాపాంసన నెత్తిపైఁ బిడుగు నేలా వేయవో వజ్రి! బ్ర
ద్దలుగా వేల ధరిత్రి! యీకులటగాత్రిం బేల ఖండింపవో
జ్వలనా! గొంతుకు కుచ్చు వెట్టికొని చావన్ వచ్చితిం గాని యం
దులకున్ దాఁడు లభింపదయ్యె మృతియుం దూరంబగుఁగా నన్గర్ ॥

కల్పకుసుమసుంగధమును వదలి దుర్గంధ దూషితమగు నీవా
యువును పీల్చుటకు వచ్చితినా!

సౌభనరపతీ! నేను రాజకన్యనుఁ గాను! వేశ్యను! దీనినికాలితో తన్నుము.

౧స...ఏమికూపము!

౨స....మహారాజా! ఈమెకుఁ బిచ్చి యెక్కినది.

అంబ...మహారాజా! నాకు పిచ్చలేదు. నీయాశ్రయభిక్షను గోరుటకు నేను రాలేదు. కుళ్ళినపీనుగులగుంటలో నాత్మత్యాగము చేయుటకు వచ్చితిని — ఎందుకో నేను చెప్పను. ఇది ప్రకటించుట దుర్భరముగనున్నది నాజీవితమును ప్రళయాంధకారమావరించునుగాక ఆయంధకారమున నేనేను లీనమగుదుగాక. ఇతఁడు చరమును జీవితమును లక్ష్యహీనమగు నరకకుండము. ఇతఁడు నరాధముఁడు. ఇతఁడు నరకకీటము. ఇతనిని నేను పతినిగాఁ జేసికొన వచ్చితిని! ఉరిపెట్టుకొనుటకు త్రాడు చిక్కలేదు

౩స...మహారాజా! ఈమె మిమ్ము తిట్టుచున్నట్లున్నది.

అంబ....అగుచో జీవితనాటక మిచ్చటనే ముగియునుగాక.

(నడుమునుండి కత్తితీయఁబోవును.)

౪స....వెళ్లఁగొట్టుము.

శాల్వ...ఈభీష్మునివేశ్యను వెళ్లగొట్టుడు.

అంబ.. (కత్తిదూసి) అగుచో చచ్చుటకు సిద్ధముకమ్ము.

(అతిశీఘ్రమున శాల్వునిహృదయమున కత్తిగ్రోపాడుచును.)

సభ్యులందరు—ఇదియేమి! ఇదియేమి!

(శాల్వునిచుట్టుకొందురు.)

అంబ—

గీ॥ వరనధుంజేయు ఢాకిని నగుదు నేను
నిరభిమానను, నిర్లజ్జ నీతిరహిత,
అధమ, కులట సర్వమ్ము నే నగుదుగాని
భీష్మునకు స్వప్నమందును వేశ్యగాను॥

(ప్రస్థానము)

(ఆకాశమున గౌరీశంకరులు వ్యాసుడును ప్రవేశించెదరు.)

వ్యాస—విశ్వంభరా! మీరు చెప్పునది నాకేమియు తెలియుటలేదు. నాశంశి పరాశరుడా! తల్లిసత్యవతియా? తండ్రి మహర్షియు తల్లి ధీవరకన్యయునా?

శంక...లజ్జచే తల యేల వంచుకొంటివి మహర్షీ? పరాశరుఁడు ఋషియే కాని దుర్బలుఁడగు మనుష్యమాత్రుఁడే. తామసము హృత్తమున ఆయన పదస్ఖలితుఁడయ్యెను యుగవ్యాపకమగు తపస్సును, అధ్యయనమును చేసి దానికి ప్రాయశ్చిత్తము చేసికొనెను— ప్రాజ్ఞ వ్యాసా! న్యాయముగ నీవు కాముని జయింపఁజాలినచో తండ్రిని దూషింపుము. మనోవాక్కాయములను కామదేవుని జయింపఁజాలినచో నీవు మహాదేవుఁడవే.

వ్యాస...ప్రపంచములో నెవ్వరును కాముని జయింపలేదా?

శంక—ఒక మనుష్యుఁడు జయించినాడు.

వ్యాస...వాని పేరేమి?

శంక—భీష్ముఁడు!

వ్యాస—దేవవ్రతుఁడా?

శంక....అవును. దేవవ్రతుఁడొక్కఁడేయీప్రపంచమున కాముని జయించినవాఁడు. కనుకనే వానికి భీష్ముఁడని పేరు గల్గినది. అతఁడు కామదేవుని జయించెను. గాన భీష్ముఁడు. ప్రపంచమున నజేయుడు.

వ్యాస—భీష్ముఁ డజేయు డెట్లు?

శంక...అతఁడు తన మనశ్శరీరములను కర్తవ్యమునొక్కపాదముల

నర్పించెను. వ్యాసా! నీవే అతనికి కర్తవ్యమహావ్రతదీక్ష నొసగితివి. నీవే అతనికి గురువు.

వ్యాస—తెలిసినది దేవా!—మంచిది. నమస్కారము (ప్రస్థానము)

శంక...ఏమి ఆశ్చర్యము!

గౌరి....అంత ఆశ్చర్యమేమి ప్రాణేశ్వరా?

శంక—ప్రియసీ! ఈబ్రహ్మాండమంతకు కామునిజయించినవాఁడను నే నొక్కఁడనేయని యనుకొంటిని. కాని పృథ్విపై నాతో సరిసమానుడగు నొకమహాపురుషుఁడుగూడ కలడని తెలిసికొంటిని

(గంగ ప్రవేశించి గౌరీశంకరులకు నమస్కరించును)

శంక—గంగా! ఏమి సమాచారము?

గౌరి....సోదరీ! కుశలమా?

గంగ—దేవీ! అందఱుక్షేమము. మహాదేవా! నీకు ఇద్దరుభార్యలు గలరు. ఒకభార్య నీయర్ధాంగమున నివసించును. రెండవది యొకనాడు నీశిరముననుండెడిది. నేఁడు ఆనీభార్యయే నీకాళ్ళక్రింద— పాపతాపపరితప్తయగు పృథ్విపై నున్నది. మనుష్య శోకముచే నేను అహోరాత్రములు విలపించుచుంటిని. ఇంక నేను సహింపఁజాలను.

శంక...ఏమి గంగా?

గంగ....అబలలగు స్త్రీలను పురుషులు ప్రతిదినము పీడించుచున్నారు. అదుగో చూడుము. కాశీరాజకన్యయగు అంబ నిరాకృతయై గడప గడప కేటుల నిక్కట్టులుపడుచు తిరుగుచున్నదో ఆమెతండ్రి తనపుత్రికను ఇంటనుంచుకొనఁ గోరుటలేదు, గాన ఉన్మాదినియై అంబ నేడు భీష్ముని ప్రేమ ద్వారమున భిక్షకురాలుగ నిలఁబడియున్నది. నాథా! మూఢుడగు నీదేవవ్రతుని సత్యపాశమునుండి విముక్తునిచేయుము.

శంక...కాదు గంగా! ప్రపంచమునుండి నేనీమహిమను తీసివేయను. పృథ్విశూన్యమగును.

గంగ...అగుచో నీయబల హృదయమునకు శాంతినొసఁగుము.

శంక...ఎవ్వని కేడి యీాయవలయునో వానికవియే యిచ్చెదను. నీ వుపోమ్ము. దేవీ! నీకర్తవ్యమును పాలించుము.

(అందఱు నిష్క్రమింతురు.)

---

## షష్ఠ దృశ్యము.

హాస్తినాపుర ప్రాసాదము. భీష్మునిగది. వెన్నెలరాత్రి.

(అంబయు సునందయు ప్రవేశించెదరు.)

అంబ....సఖీ! కాళ్ళు వణకుచున్నవి.

సునంద...మనస్సు దృఢముచేసికొనుము.

అంబ...యువరాజుతో నేమందును?

సునంద...నీయిచ్ఛవచ్చినది. గోపనమే యబలకు ధర్మము. ఆత్మరక్షణకై సంయమమే ఆమెకు దుర్గము. కాని ఆ అబల యే దాడివెడలునపుడు ఆమెధర్మము ఆమెకు విరుద్ధముగ నుండును.

అంబ...కాని లజ్జయే స్త్రీకి సనాతనధర్మము.

సునంద....ఆసమయము దాటినది. సఖీ! నీ వేమి చేయలేదు! పతిత్వయాచనకై శాల్వుని యింటికి వెళ్ళితివి. తుదకు నరహత్యయను గభీరగహ్వరమున గూడ దిగితివి. ఇపుడుసంకోచమేల రాజకుమారీ! దాడివెడలుము. ఈయుద్ధమున ప్రాణము పణముగ నొడ్డుము. కార్యమేని సాధించెదను, ప్రాణమేనియర్పించెదను. అని ప్రతిజ్ఞ చేసికొనుము. రెండవదారిలేదు.

(ప్రస్థానము.)

అంబ...నిజము చెప్పితివి సఖీ! ఇది సంసారిబ్రహ్మచర్యమే. దేవవ్రతుని యీాప్రతిజ్ఞను భంగముసేయనిచో నే నాడుదాననుగాను

(భీష్ముఁడు ప్రవేశించి అంబను చూచి వెనుకకు మరలి పోవును.)

అంబ...దేవవ్రతా! ఎచ్చటికిపోయెదవు? ఆగుము. రాత్రిని చూచి సూర్యుఁడువలె నన్నుజూచి యేల పాఱిపోయెదవు? నేనుఘాతు

కురాలనా; దొంగనా; పులినా; పామునా; వ్యాధినా.దుర్భిక్షమునా? ప్రియతమా! ఇది యేమి? హఠాత్తుగ క్షణములో నీముఖమండలము ఇట్లు మలిన మేల యయ్యెను? ఏదియో యొకమహాభయమునఁ గుందుచున్నటులున్నది. ఇది యేమి! చెప్పుము దేవవ్రతా! నే నేమిచేసితిని? నావలన నేమి మహాపరాధమైనది? కేవలము నిన్ను ప్రేమించితిని. ఇంతకంటె నేనేమియు చేయలేదు?.

భీష్మ...నీమాటలను నేను వినియుంటిని దేవీ! కాని నన్ను క్షమింపుము. నేను బ్రహ్మచారిని.

అంబ...అసత్యము! దేవవ్రతా! నీవు సుకుమారుఁడవు. జ్ఞానివి. వీరుడఁవు. కాని బ్రహ్మచారివి కావు అసత్య మేల యాడెదవు దేవవ్రతా?

భీష్మ...నేను బ్రహ్మచర్యవ్రతము ధరించితిని!

అంబ...దానిని విడువుము. దేవవ్రతా! చూడుము. ప్రతియుగమందును ఎందఱోఋషులును మహర్షులును, బ్రహ్మర్షులును కష్టార్జితమగు తపయనంతపస్సును స్త్రీలపాదములకడ నర్పించిరి. నీ వేమియు ఋషివి కావు. ఒకశంకరుఁడే కాముని జయించినవాఁడు. ఆయనమహేశ్వరుడు. ఇంకే నీవు ఈశ్వరుడవు కూడకావు. ఏమనుష్యుడును చేయజాలనిపని నీ వెట్లు చేయుదువు? దేవవ్రతా! నీవు కాముని జయించితివా ఇది నిజమేనా?

భీష్మ—నేను కాముని జయింపలేను. కాముని జయించినచో నిన్నెంతయో ప్రేమించువాఁడను కాముని జయించినచో నిన్ను చంటి బిడ్డనువలె నిర్భయముగ కౌఁగిలించుకొనువాఁడను. ఆహా! పవిత్రస్త్రీ వక్షస్థలము శిశువుల కమృతప్రవాహతుల్యమో అదియే యువకులపిపాసితనేత్రములందు విషవర్షము గురియును. ప్రాణదానము చేయునదియే ప్రాణనాశనము చేయునది స్త్రీయొక్క మాతృభావమును ప్రకటించునో అదియే కా

మునికి దుర్గము. ఏది సౌందర్యమునకు దేవమందిరమో భక్తి ప్రార్థనామందిరమో, అదియే లాలసత్వమునకు నివాసభూమి, దొంగలకు కాపురము. కాదు. కాదు. నేను కామముని జయించినవాఁడను గాను. కనుకనే నేను నాకే వెఱచుచున్నాను. గనుకనే స్త్రీయనిన భయపడుచున్నాను. గనుకనే దేనివంక అమ్మా అమ్మాయని పవిత్రప్రేమతీర్థమునకుబోవు తీర్థయాత్రికునివలె పరుగెత్తుకొనిపోవలయునో దానికే అజగరమునకు వలె వెఱచిపాఱిపోవుచున్నాను (వెళ్లబోవును.)

అంబ....ప్రియతమా! ఎచ్చటకు వెళ్ళుచుంటివి? నన్ను అపారసముద్రమున ముంచవద్దు. (మోకరిలఁబడి కూర్చుండును.)

భీష్మ....ఏడువకు దేవీ! నేను రొమ్మునుసాచి వజ్రప్రహారమును సహింపఁగలను. ఆఁకటనున్న పులికడకు పోఁగలను. కాని యాఁడుదానికన్నీటిని చూడఁజాలను. ఆడుదానికన్నీటిలో నాధైర్యము కరగిపోవును.—— అంబా! ఇదియేమి! చిత్తము మరల చంచలమగుచున్నది. కాదు. నేడీప్రవృత్తి నణచివేసెదను. సోదరీ! నిన్ను నేఁడీశుభముహూర్తమున నాహృదయసింహాసనమున మాతనుగా గూర్చుండఁబెట్టెద. అంధవాసనకు నేఁడు మరణదండము విధించెదను. కామముయొక్క గొంతు పిసికెదను. ఆసక్తియొక్క అగ్నిజ్వాలను చల్లార్చెదను. పాపమను కంటకవృక్షమును వేఱుతో పెకలించెదను. నీవు నాతల్లివి.

అంబ...(ఉలికిపడి) ఏమి యిట్లు చేసితివి? నిష్ఠురుడా! ఘాతుకుడా! కాదు కాదు. నేను ఒప్పుకొనను. నాకు తలత్రిప్పుచున్నది. పడిపోవుచున్నాను. పట్టుకొను పట్టుకొను ప్రియతమా!

(పడిపోవు అంబను భీష్ముడు పట్టుకొనును.)

భీష్మ....ఇది యేమి! నీవు కాశీరాజుకన్యవు. పసివానవు కావు హీనమగు ఈఆచరణము నీకు దగినది కాదు. ప్రాణాధికవగు మాతా! వెకలిపోయి నేను నిన్ను తల్లిఁగా జేసికొంటిని.

పవిత్రమగు నీమాతాపుత్రసంబంధమును నీచవ్యవహారముచే కలుషితము చేయకు. ఈసంబంధ మన్నిసంబంధములకంటె పవిత్రము.

అంబ....అసత్యము దేవవ్రతా! నేను నీకు తల్లిని గాను నీతల్లికి తగు పని నే నేమియు చేయలేదు. మాటమాత్రములో సత్యమును గలింపఁజేయు శక్తి కలదా?

భీష్మ...నీ వేమి యెఱుఁగుదువు? మాతృనామమున ఎంతశక్తి యున్నదో నీ కేమి తెలియును? మాతృనామమున ఇమిడియున్నయర్థము లేనిఘంటువునందును లేవు. మాతృనామమున నున్న యమృతము ఇంద్రుని భాండారమున లేక రోగశయ్యపై తీసికొనరోగి అమ్మాయని తనబాధను కీర్తించునపుడు అతనిబాధ సగము ఈఅమృతసరోవరములో కరగిపోవును. అతనికి చాల శాంతిగలుగును. మాతృనామమున సతువుల గూడ వశమగును మాతృనామము శోకతప్తమగు హృదయమును చల్లపఱచును. కర్ణములయందు స్వర్గీయసంగీతమును వర్షించును మాతృనామ మానందవిహ్వలనుగు జిహ్వయందె అంటుకొనియుండును. బయటికి రాదు. ఇది ఆర్తనిశుష్కాధరమున కంపించుచుండును. వాయువుపై నృత్యము చేయుచుండును. మాతృనామమును పొందియే సాక్షాత్తు జగదీశ్వరియగు గౌరియు తన్ను కృతార్థనుగ నెంచుకొనుచున్నది. అమ్మా! నేఁడు నీవు నీకాశినీభావము నణచుకొనుము. దేవివి కమ్ము. అమ్మా! నీ యీదుర్బలస్వేచ్ఛాచారము నణఁచుకొనుము. పృథ్విపై శాంత్యమృతధారల వర్షింపుము. చూడుము అమ్మా! నిలోమ్నపై ఈజగత్తు బాలకునివలె నిర్భయముగ నిద్రించుచున్నది

అంబ...కాదు. నేను చెవిటిదానను. నాకేమియు వినఁబడలేదు. నేను వెళ్ళను. నేను అగాధనరకములో మునిగెదను. తుదిసారి మరల ప్రయత్నించిచూచెదను. ఉజ్జ్వలనిశాకరా అంధకార

మున నీ మొగము దాచికొనుము. నక్షత్రములారా! ఆకాశపొం డు. విశాలపృథ్వీ! చెవులు మూసికొనుము.

భీష్మ...నీ వేమి చెప్పుచుంటివి?

(అంబ దీపము హెచ్చించి తనమొగముపై మునుగు తీయును.)

అంబ.... బాగుగ చూడుము దేవవ్రతా! బాగుగ చూడుము.

భీష్మ... చూచుచున్నాను

అంబ...ఏమి చూచుచున్నావు?

భీష్మ...నేను చూచునది నిన్ను కాదు. నే నొకయున్మాదినియగు సుందరిని చూచుచున్నాను ఆమెసిమిచాయబుగ్గలు కామమనస్యమును దాగుటచే నెఱ్ఱబడినవి. ఆమెకన్నులయందు నరకకుండమందలి అగ్నిజ్వాల ప్రజ్వరిల్లుచున్నది. దొండపండువంటి రెండు పెదవులు విషహాస్యముచే నిండి లాలసత్వముచే శిథిలము లగుచున్నవి. కుటిలకంఠరముపై సోగవెండ్రుకలు పాముపిల్లలవలె చలించుచున్నవి ఒకకాలసర్పము మనుష్యరూపమున నిలబడియున్నటులున్నది. ఒకప్రలోభనము ప్రాణముతో నిలచియున్నటులున్నది. రక్తమాంసమయమగు శరీరమున దాగినయొకసర్వనాశనమువలె, జాగ్రదవస్థలోని ఒకయభిశాపమువలె నున్నది.

అంబ... రమ్ము ప్రియతమా!

మ॥ ఇటులన్ మూర్ఖపుబట్టుపట్టక రయంబే తెమ్ము ప్రాణేశ! సం
కటదుఃఖాత్మకమైన యీజగమునం గాంక్షింపగా యోగ్యమా
జటులా ప్లాత్ముల ప్రేమయొక్కటియె, సిస్సారంబుసర్వంబునే
మిటికీపాటియుపేక్షదాల్చుట స్థిరమ్మే జవ్వన మ్మిమ్మహా॥

భీష్మ...(చేతులు విడిపించుకొని) నీయీప్రయత్నము వ్యర్థము. భీష్ముని దృఢప్రతిజ్ఞ యెన్నటికిం చలింపదు. ఇది భీష్ముని ప్రతిజ్ఞ. త్యాగివరని శపథము. గ్రహములు తమనెలవులు తప్పుగాక.

చంద్రుడంగారములు వర్షించునుగాక. నక్షత్రదీపిక లారును గాక. పర్వతములు ఇసుక రేణులువలె చిందరవందరయగు గాక. సముద్రమింకుగాక. ఈ భీష్ముని ప్రతిజ్ఞ యొన్నటికిని చలింపదు. ఈబ్రహ్మాండ భ్రమణములో క్షోభగ్రస్థమగు ప్రపంచకోలాహలములో మనుష్యుని మిథ్యావాదములో భీష్ముని ఈ ప్రతిజ్ఞనక్షత్రములలో ధ్రువతారవలె అచంచలమై ప్రకాశించును.

(తెరవాలును.)



# భీష్మ.

## చతుర్థాంకము.

### ప్రథమదృశ్యము.

పరశురాముని యాశ్రమము. ప్రభాతము

(పరశురాముడరుగుపై కూర్చుండును. ఎదుట అంబనిలబడి యుండును.)

అంబ.... నేనింక నేమియుఁ గోరుటలేదుస్వామీ! భీష్ముని ప్రతిజ్ఞా భంగమొక్కటియే నాకు కావలసినది. అతఁడు యావజ్జీవిత మొనరించిన సాధనను వ్యర్థము చేసెదను అతని వ్రతమును నష్టము చేసెదను. అతని యాకృత్రిమ వేషమునంతయు భంగపఱచి యథార్థరూపమును లోకమునకు తెలియఁజేసెదను. దేవవ్రతుఁడొక కపట సన్యాసియని తెలియఁ జేసెదను.

పరశు.. దీనిచే నీకేమి లాభము?

అంబ...దీనిచే మరల పృథ్విపై నారీమహిమ ప్రతిష్ఠితమగును. బహిష్కృతమగు నారీ సామర్థ్యము మరల సింహాసనము నధిష్ఠించును. పురుషుఁడు స్త్రీకి న్యాయముగ రావలసిన యధికారము నిచ్చివేయును. ఇదియే లాభము.

పరశు ..ఎట్లు?

అంబ...లోకములో పురుషుఁడు ప్రభువు కాడనియు స్త్రీయే అనియు చరాచర ప్రపంచమంతయు నెఱుగుదుగాక. కాంతలరూప ప్రకాశము ప్రసరించుచోట బ్రహ్మచర్యము తన తలవంచుకొనునని నేను చూపించెదను. ఎంత ఆశ్చర్యముస్వామీ! ఏకామదేవుని ప్రభుత్వమును లోకమంతయు నొప్పుకొనుచు

న్నదో ఎవ్వనిపుష్పబాణములు విశ్వమును జయించుచునవిగదా, ఎవ్వనితండ్రి సాక్షాత్తు మధుసూదనుఁడో, ఎవ్వని భస్మము చేయుటచేతనే శంకరుఁడు మహాదేవుఁడనిపించుకొనునో ఆ కామదేవుని బాణములు నేఁడీబ్రహ్మచారి దేవవ్రతుని ప్రతిజ్ఞను భంగము సేయఁజాలవా? స్వామీ! ప్రకృతియొక్క ఈగొప్ప అనియమమును పోఁగొట్టుము. స్త్రీల యీ సనాతనాధికారమును రక్షింపుము. పురుషుని యీగర్వము నడంచుము, ఇదియే నాకుకావలసినది.

పరశు...అదుగో దేవవ్రతుఁడు వచ్చుచున్నాఁడు. నీ విచ్చటనుండి పొమ్ము. (అంబపోవును.)

పరశు...ఇదిసత్యమా? మనుష్యుఁడీపని చేయఁజాలునా? మంచిది. దేవవ్రతుని వ్రతమెంత దృఢమో పరీక్షించెదను.

(భీష్ముని ప్రవేశము.)

భీష్మ...దాసుఁడు చరణములకు ప్రణమిల్లుచున్నాఁడు.

పరశు....దేవవ్రతా! జయమగుఁగాక.

భీష్మ....గురువర్యా! మీరు నన్ను గుర్తించితిరా?

పరశు...ఆఁ. నిన్నుచూచి చాలరోజులైనది. నీవుచాఁ చిక్కిపోతివి. తేజోవంతమును, దర్పపూర్ణమును, సౌమ్యమునగు నీముఖమండలము నేఁడుచాల శాంతముగనున్నది. అతీక్ష్ణదృష్టి నేఁడు నమ్రముగనున్నది. మఱియు స్నిగ్ధముగను మలినముగను అశ్రుపూరితముగను గనుపడుచున్నది. మొగము ముడతలుపడినది. కనులుదించుకపోయినవి. వత్సా! నేఁడు నీవు మనస్సులోనేదియోదుర్భావనను గాఢముగు నిరాశనుధరించి యున్నటులున్నావు. ఏమిసమాచారము?

భీష్మ...గురువరా! అప్పుడు నేను బాలకుఁడను. ఇప్పుడు నడిమివయస్సున నుంటిని. క్రమముగా వార్ధక్యము నాశరీరమున అధికారము చేయుచున్నది.

పరశు...శరీరములో ఆతేజములేదా?

భీష్మ . లేదు. ఆ తేజము లేదు.
పరశు...ఆ దేవవ్రతునకు నీ దేవవ్రతునకు సంతరయుంతరమా?
భీష్మ...నేడు దాను నేల స్మరించిరి?
పరశు....రాజకన్యా స్వయంవరమున నీవు కాశీరాజకన్యకలను హరించి తెచ్చితివి. జ్ఞాపకమా?
భీష్మ...గురువరా! జ్ఞాపకము
పరశు...కాశీరాజు కనిష్ఠపుత్రిక లిద్దఱును హస్తినాపురాధీశ్వరునకు రాణులు కాని జ్యేష్ఠపుత్రికయగు అంబ నేటివఱకు అవివాహిత.
భీష్మ....ఈ సమాచారము వింటిని.
పరశు—ఈ యభాగిని నేడు నా యాశ్రమమునకు వచ్చినది.
భీష్మ—తెలిసినది గురువరా!
పరశు—నీవా రాజకన్యను స్పృశించితివి. ఆమె చేయిపట్టుకొంటివి.
భీష్మ...అయినను నే నామెను పెండ్లియాడుటయసంభవము
పరశు—అసంభవమా! నీవామెను ప్రేమించుట లేదా?
భీష్మ...ప్రేమించు చుంటిని. ఒకవేళ ప్రమాదవశమున ఆమె సౌందర్య తపోవనమును కలుషితము చేయుదునేమో యని ఆమెను స్పృశించుటకు భయపడునంతగా ఆమెను ప్రేమించు చుంటిని.
పరశు...చాలవింతమాట!—దేవవ్రతా! వివాహము పాపకార్యమా?
భీష్మ....పాపకార్యముకాదు. వివాహము పుణ్యరాజ్యము. కాని నేడు నే నా రాజ్యమునుండి బహిష్కరింపఁబడితిని.
పరశు—ఏమి?
భీష్మ...నేను శాశ్వతబ్రహ్మచర్య వ్రతముఁ బూనితిని.
పరశు—ఎవ్వ రాజ్ఞాపించిరి?
భీష్మ—ఈశ్వరుడు.
పరశు...ఈశ్వరుఁడా? ఈశ్వరుడెక్కడ?
భీష్మ—హృదయమందే.

పరశు....ఇది నీకెవ్వరు చెప్పిరి?
భీష్మ—వ్యాసమహర్షి.
పరశు...ఆయాజ్ఞనునీవువింటివా?
భీష్మ....వింటిని గురువరా! జగద్వ్యాప్తమగు స్వార్థసంగ్రామములో ప్రపంచ కోలాహలములో ఆయాజ్ఞను నిరంతరము వినఁజాలను. కాని అప్పుడప్పుడు దాని గూఢస్వరము దాని గంభీరాహ్వానమును దాని మధుర సంగీతమును వినుచుందును.
పరశు—నీవాయాజ్ఞను వింటివా?
భీష్మ—వింటిని.
పరశు...అసత్యము. నేను నీకు గురువును. నేనాజ్ఞాపించుచున్నాను—నీవు అంబను పెండ్లియాడుము.
భీష్మ....ఇది అసంభవము గురువరా!
పరశు....ఏమంటివి?
భీష్మ ..అసంభవము
పరశు...అసంభవమా!
భీష్మ ..క్షమింపుఁడు. నేను ప్రతిజ్ఞాపాశమున బద్ధుఁడను. నేను ఆజీవిత బ్రహ్మచారిని.
పరశు...అగుచో నింకనామాట పాటింపవని యనుకొందునా!
భీష్మ...గురువరా! ఏమి చేయుదును. ఇప్పుడు నాకు వివాహము చేసికొనుట కధికారమే లేదు. నేను సత్యపాశబద్ధుఁడను.
పరశు.. ఆపాశమును త్రెంచివేయుము.
భీష్మ...క్షమింపుము,
పరశు....ఇదియేనా నీగురుభక్తి? — నీవు నాకు శిష్యుఁడవేనా?
భీష్మ...నేనుతప్పక తమశిష్యుఁడను. కాని నేను భీష్ముఁడను.
పరశు....పరశురాముని యాజ్ఞ నీవు పెండ్లిచేసికొనుము.
భీష్మ......అగుచో నాకుమరణదండనమొసంగుఁడు. నేనీ యాజ్ఞను మన్నింపను.
పరశు...భీష్మా! ఆజ్ఞాపించుచున్నాను. నేను భగవంతుఁడను. నీ

వామెను పెండ్లియాడుము.

భీష్మ...గురుదేవా! మాతండ్రిగారు మరణకాలమున చేతులు పట్టుకొని పెండ్లియాడవలసినదని బ్రతిమాలిరి. తండ్రియే ఈ ప్రపంచములో ప్రత్యక్షపరమేశ్వరుఁడని నేనెఱుఁగుదును. అయినను నేను వారియాదేశమును మన్నింపలేదు. తండ్రియానతికంటె నాకర్తవ్యమే ప్రధానమని నాతలంపు. దేవా! నేను మీ పాదములపైఁ బడుచున్నాను. నన్ను క్షమింపుఁడు.

(నమస్కరించును.)

పరశు...ఇంక నామాటవినవా?

భీష్మ...స్వామీ! ప్రపంచములో నాకు భీష్ముఁడను పేరెందుకు వచ్చినదో తామెఱుఁగుదురా?—నేను నాభోగవాంఛను తీర్చుకొని యీపేరుసంపాదింపలేదు. గురువరా! ఈ బ్రహ్మచర్యవ్రతము— ఈ కఠోరవ్రతము కుసుమకోమల శయ్యగాదు. నాజీవితము సంభోగ సుఖరహితము. నాజీవితమంతయు స్త్రీప్రేమ శూన్యము. నాబ్రతుకంతయు సంతాన సుఖవిహీనము ప్రపంచములో నెవ్వఁడు సమస్త సుఖములకు మూలాధారముగ నెంచఁబడునో, ఎవ్వాని ముఖారవిందమునుజూచి మానవుఁడు సర్వప్రాపంచిక దుఃఖములను, రోగబాధను, దారిద్ర్యవేదనను, దాస్యపీడను, మానసిక వ్యాకులతను క్షణమాత్రములో మఱచిపోవునో, ఎవ్వఁడు పరదేశమున నిరాశాపూర్ణమగు శూన్యజీవితము పూర్ణముగఁ జేయునో, మరణానంతరము పరలోకమందలి గాఢాంధకారమును ఎవ్వఁడు ప్రకాశింప జేయునో అట్టి పుత్రుని ముఖముఁ జూచు సౌభాగ్యము నాకీ జన్మములో లేదు. గురువరా!—గురునాజ్ఞను మీఱఁ జేయునది నాకొక పెద్దసుఖమా?

పరశు...శిష్యా! పెండ్లిచేసి కొనినచో నీ వాసుఖమును పొందఁగలవు

భీష్మ...గురువరా! క్షమింపుఁడు. నేను బ్రహ్మచారిని.

పరశు...భీష్మా! నేను తుదిసారి చెప్పుచున్నాను. నీవు పెండ్లికావల

యునా చావా!

భీష్మ.. అవసర మగుచో నేను చావునే యొప్పుకొందును.

పరశు...మంచిది అయితే ఇంక ఎల్లుండి ప్రొద్దున కురుక్షేత్రములో సశస్త్రుండగు పరశురాముని కలియుము. శస్త్రముతో రమ్ము.

భీష్మ.. శస్త్రమెందుకు?

పరశు ..దేవవ్రతా! నీకు శూరుడనను గర్వము చాలగలదు గను కనే నీవు పరశురాముని ఆజ్ఞనే తృణీకరించితివి నేను నీగర్వ మంతయు నణచెదను.

భీష్మ....నాకు భార్గవునితో యుద్ధము చేయునంతటిసాహసము లేదు.

పరశు.. భయపడుచుంటివా?

భీష్మ...భయమన నేమియో నేనెఱుగనే యెఱుగను. అయినను గురునితో యుద్ధముఁ జేయక రమే ఓటమినొప్పుకొనుచున్నాను.

పరశు...నీవు క్షత్రియ బాలుడఁ వేనా? పిఱికివాఁడా! నిన్ను నేను యుద్ధమునకు పిలుచు చున్నాను.

భీష్మ. నా ప్రార్థన యాలింపుఁడు.

చ॥ గురుఁడవు భూసురుండవు నకుంఠిత సాధుతపోనిధానుఁడై
ధరసువశంబుగాంచు జమదగ్నిసుతుండవునై ననిన్నుసం
గరమునడీకొనన్ మనసు గల్గదు క్షత్రియశౌర్యవహ్ని ని
క్కరణినిరెచ్చకొట్టుటలు కార్యముకాదు శుభాభిలాషికిన్॥

పరశు...నేను ఇరువదొక్కమాఱు ఈభారతభూమిని క్షత్రియ రహితనుగాఁ జేసితిని.

భీష్మ....అప్పుడు భీష్ముఁడు లేడు.

పరశు...ఇంత సాహసమా!

భీష్మ...గురువరా! శిష్యుఁడు పాదములకు నమస్కరించుచున్నాఁడు.

పరశు—ఎల్లుండి ప్రొద్దున కురక్షత్రమందలి రణరంగమునకు సాయుధుఁడవై రమ్ము,

భీష్మ—మంచిది. గురుని ఈయాజ్ఞను మన్నించెదను. భీష్ముఁడు పాదములకు నమస్కరించుచున్నాఁడు.

పరశు:..పొమ్ము. దేవవ్రతా! యుద్ధసన్నద్ధుఁడవగుము.
భీష్మ ... నేను సిద్ధముగ నుందును. (ప్రస్థానము.)
పరశు —ఆశ్చర్యము!
మ॥ పరమాశ్చర్యము! క్షత్రియుండవఁగ విశ్వంబందునీ వేసుమీ
యరయన్ భీష్మకనామమెంతయును నీకర్హంబు శీతాద్రిమా
దిరి నీసంయమ మప్రకంప్యము. గుణాబ్ధీ! శిష్యచూడామణీ!
కరమున్ నీజననంబునన్ గులముశ్లాఘ్యంబయ్యెసర్వోన్నతిన్
నీప్రతిజ్ఞాశక్తిని పరీక్షించెదను నీయీప్రతిజ్ఞ కఠోరకుఠారధా
రను సైచఁగలదో లేదో చూచెదను. (ప్రస్థానము.)

---

ద్వితీయదృశ్యము.

స్థానము—పడకటిల్లు. సమయము— సాయంకాలము,
(విచిత్రవీర్యుఁడు పరుండియుండును. సత్యవతి దగ్గిఱకూర్చుండును.)
సత్య . పగలు గడచినది. ప్రపంచము కాంతిహీనమును, మలినము నగుచున్నది. సూర్యుడస్తమించుచున్నాఁడు. నిర్భాగ్యురాల నగు నేను ఒకపుత్రుని పోఁగొట్టుకొంటిని. రెండువవాఁడును మృత్యుశయ్యపైఁబడి నిట్టూర్పులు నిగుడ్చుచున్నాడు. నేను చూచుచు చూచుచు నుండగనే వీనిముఖమండలమున మృత్యుకళ నెలకొనుచున్నది. మృత్యుగతిన డ్డగుటకు నాకుశక్తి లేదు విచిత్రవీర్యుఁడు నవ్వుచున్నాఁడు కలవరించుచున్నాఁడు.
విచిత్ర—(కనులువిప్పి) అమ్మా—అమ్మా!
సత్య...ఏమినాయనా! ఏమి? ఎందుకు ఉలికిపడితివి?
విచిత్ర....అమ్మా! నేనెక్క డనున్నాను?
సత్య—ఏమి! మనయింటిలోనే.
విచిత్ర...ఓహో! ఇప్పుడుఉదయమా సాయంకాలమా?
సత్య—సాయంకాలము
విచిత్ర....ఓహో! (మరల కనులు మూసికొనును)

సత్య—నీశరీరములో నెటులున్నది?

విచిత్రి—అమ్మా! (దగ్గు) బాగుగనున్నది

సత్య...నిజముగ బాగుగనున్నదా?

విచిత్రి...నిజముగ బాగుగనున్నది—అన్నయ్య ఏడీ?

సత్య....బయటనున్నాఁడు. పిలుతునా?

విచిత్రి...వద్దు. అప్పుడే అవసరములేదు చచ్చుటకుముందు ఒకమాఱు ఆయనతో కలియవలయును.

సత్య...అదియేమి నాయనా! అట్లెవ్వరేని యందురా?

విచిత్రి—చూడు. మరువఁబోకుము. నేను చచ్చుటకు ముందు ఒక సారి ఆయనను కలియఁగోరుచున్నాను. పిలువుము.

సత్య—నేనిప్పుడే ఆయనను పిలుచుకొని వచ్చెదను.

విచిత్రి—వద్దు ఆయన యెప్పుడును నావద్దనే కూర్చుండును. రాత్రి కన్నుమూయలేదు. ఎన్నియో మాటలు చెప్పినాడు. అమ్మా! ఇటువంటి అన్నయ్య యెవ్వరికిని యుండఁడు. (దగ్గి) అమ్మా! కొంచెము నీళ్ళు ఈయుము. (సత్యవతి నీళ్ళు ఇచ్చును)

విచిత్రి—అదుగో చూడుము. సూర్యుఁడస్తమించినాఁడు చూఁడు మమ్మా! (దగ్గు)

సత్య—ఏమి నాయనా?

విచిత్ర—ఈ మేడ చూడుము. దీనిపై సూర్యుని అంతిమ సౌవర్ణ కిరణములు పడుచున్నవి. ఎంతసుందర దృశ్యము!

సత్య—చాల సుందరదృశ్యము!

విచిత్ర—నాశరీరము మీదఁగూడ జీవితముయొక్క అంతిమ కిరణములు వచ్చి పడుచున్నవి మంచిది. అమ్మా! మనుష్యుఁడు చచ్చినపిమ్మట నెచ్చటకు బోవును?

సత్య...ఈమాట లెందుకునాయనా?

విచిత్రి—లేదు. ఊరకయే అడుగు చున్నాను— సరే. ఈ ఆకాశము ఇంత నీలముగా నేలయున్నది?

సత్య....ఇది యంతయు ఈశ్వరుని సృష్టి. ఆయనకే తెలియును.

విచిత్ర...మృత్యువుకూడ నిల్లే నీలవర్ణమును, ఇట్లే అనంతమునని నాకుతోఁచుచున్నది. అమ్మా! అన్నయ్య చూపులకెంత వీరుఁడుగఁ గనుపట్టుఁడు. (దగ్గు) దిండు సరిగా పెట్టుఅమ్మా!

(సత్యవతి దిండుసరిగా పెట్టును)

విచిత్ర—ఆయన శరీరమంతయు పేృముచే నిర్మింపఁబడినట్లు నాకు తోచును. కాని చాల గంభీరుడు. రెండవ సముద్రుడే (దగ్గు) ఏమి అమ్మా?

సత్య...నేనెఱుఁగను నాయనా!

విచిత్ర....అన్నయ్య పెండ్లి చేసికొనినచో సుఖపడువాఁడు. అన్నయ్య పెండ్లి యొందుకు చేసికొన లేదు అమ్మా!

సత్య...అబ్బా!

విచిత్ర...ఇదియేమి! చేతులతో నోరు మూసికొనుచున్నావు. ఏడవకుమమ్మా! అన్నయ్య పెండ్లిమాటరాఁగానే నీవు ఏడ్చుచుందువు — ఏడ్వకమ్మా!

సత్య....కాదునాయనా! నీవు ఎన్నేనియడుగుము. ఈమాట ఒక్కటిమాత్రి మడుగకుము.

విచిత్ర....ఎందుకమ్మా! ఈవేళ నీకుచెప్పకతప్పదు. నేనువిని అప్పుడు చచ్చెదను. (దగ్గు) ఇచ్చటనుండి పరలోకమునకుఁ బోయి నీకును ఆయనకును శాంతిసమాచారమేమేని పంపగలనేమో చూచెదను. చెప్పుమమ్మా!

సత్య...మీ అన్న స్వర్గీయ దేవతగాని భూలోక మనుష్యుఁడు గాడు. ఆయనను మనముసరిగా గుర్తింపజాలము. ఆయన స్థూలము కఠినము, ప్రకాశాంధకార మిశ్రితమునగు నీస్వార్థ రాజ్యమునకుఁ జెందినవాఁడుగాడు. ఆయన ఎచ్చటనుండి ఇచ్చటకు వచ్చెనో తెలియదు. స్వార్థత్యాగ మంత్రమును నోటిమాటలతో ప్రచారము చేయుటకు రాలేదు. దానిని క్రియారూపమున ప్రచారము చేయుటకువచ్చినాఁడు.

విచిత్ర.... చెప్పుమమ్మా! ఇంక చెప్పుము. అన్నయ్య మాటలు చె

ప్పుము. ఆయన జీవితచరిత్రమును పలుమారు నీముఖమున వింటిని. (దగ్గు) నేడుమరల చెప్పుము విందును. వారొక మా యాకథవంటివారు. ఎన్నిమారులు విన్నను ఇంకను వినవల యునని యుండును. (దగ్గు) కొంచెము నీళ్ళు ఇమ్ము అమ్మా!

(సత్యవతి నీళ్ళుఇచ్చును.)

సత్య...చాలకష్టముగా నున్నదా?

విచిత్ర...లేదు, ఏమియు లేదు. చంద్రుడుదయించుచున్నాడు. ఎంత సుందరముగ నున్నాడు! (చంద్రుని తెప్పలుఆర్పక చూచును)

సత్య...మఱియొకమారు మందుత్రాగుము నాయనా!

విచిత్ర...ఊరుకో అద్భుతము?

సత్య...ఏమి యద్భుతము!

విచిత్ర—అమ్మా! ఒకమారు నీ కోడళ్ళను పిలువుము? వారిసంగీతము ఒక్కమారు విందును (దగ్గు) వారిసంభాషణము వారి సంగీతము వినుట నాకు చాల ఇష్టము. వారునన్ను చాల ప్రేమించెదరు కాని నేను వారిని సుఖపెట్టలేకపోతిని. (దగ్గు) కొంచెము వారిని పిలువుమమ్మా!

సత్య—ఇదుగో పిలిచెదను. (సత్యవతి పోవును.)

విచిత్ర....సంగీతము వినుచు వినుచు చచ్చెదను. ఈ పున్నమ చందురుని పండువెన్నెలలో ఈ నల్లని యాకసము క్రింద సంగీతము వినుచు వినుచు చచ్చెదను. (దగ్గును)

(అంబి కాంబాలికల ప్రవేశము.)

విచిత్ర—అంబికా! అంబాలికా! ఒక్క పాటపాడుడు. నాడు సాయంకాలము పాడినపాట పాడుడు.

(అంబికాంబాలికలు పాడుదురు.)

గీ త క.

అడె యపార వినీల నభమున నలమెనుజ్జ్వలచంద్రికల్
సదనమున నీవేలయిటు ప్రమగ్నదవు పెట్టుచుదీపికల్

దిమ్ముమనఁదల యేల యీసౌద త్రెంపుప్రేమపు వల్లికన్
రమ్ము వేగవిలీన మపృదము రాత్రి యిట్టిది రాదిఁకన్॥
గనము చాతక ఖగవిలాసము క్రమ్మె భూమి నభమ్ములన్
వినఁద మవ్వాలకేగి యాపుము వీణమృదుల రవమ్ములన్
అదుగో మృత్యువ్రు తల్లివలె నిటకడుగుదెంచు ప్రియమ్మునన్
ఇదియె తరుణము చచ్చుటకు నే నిదియె పోదురయమ్మునన్
చాలుచాలున ధూళిఖేలలు చాలు క్రయ విక్రయములున్
ఏల నాకీ గోల యంత ముఁగించి తాయ వ్యయములున్
కరము వలసితి సొలసితిని యిత్తఱిని జేర్పుము నన్నటన్
నిరవధిక ధవళిమయు నిరవధి నీలిమను గలిసెయు నెటన్॥

(భీష్ముఁడు మాధవుఁడు ప్రవేశించెదరు. వెనుకగా సత్యవతి వచ్చును.)

భీష్మ...తమ్ముఁడా! ఇప్పుడెట్లున్నది? (నాడి చూచి) ఇదియేమి! వట్టి మంచుముద్దవలెనున్నది! శ్వాసకూడలేదు.

మాధ...(భయముతో) ఆఁ! ఏమి దేవవ్రతా!

భీష్మ...(మరల పరీక్షించి) ప్రాణములేదు.

మాధ.. కుమారా! ప్రాణాధికా! (విచిత్రవీర్యుని శరీరమును కౌఁగిలించుకొనును.)

సత్య....కుమారా! కుమారా! (మూర్ఛితయై నేలపైఁబడును.)

(అంబికాంబాలికలు భీతచేతస్కలై ఒకరినొకరు చూచుచునుందురు. భీష్ముఁడు ద్వారముపట్టుకొని నిలచియుండును)

-❖❖ ❖❖-

## తృతీయ దృశ్యము.

హాస్తినాపుర ప్రాసాదము. అపరాహ్ణము

(మాధవుఁడును దాశరాజును ప్రవేశించెదరు.)

మాధ—స్వయంవర సభనుండి నన్ను వెళ్ళఁగొట్టిరా?

దాశ—అవును.

మాధ...నీకు బాగుగ జ్ఞాపకమేనా?
దాశ—బాగా.
మాధ—తర్వాత భీష్మునకును. రాజులకును యుద్ధము జరిగినదా?
దాశ—అవును
మాధ—నీవుకూడయుద్ధము చేసితివా?
దాశ....ఆ. చేశాను
మాధ....ఏపక్షమున?
దాశ...ఏపక్షానా లేదు.
మాధ...మధ్యనుంచియా?
దాశ...సరీగ్గా మధ్యనూకాదు.
మాధ—మఱి యెట్లు?
దాశ...ఒకపక్క
మాధ...బాణము వేసితివా?
దాశ...ఆ. వేశాను.
మాధ...ఎవ్వరిపై?
దాశ....ఆసంగతి తెలియదు.
మాధ....కన్నులు మూసికొని వేసితివా?
దాశ...అవును.
మాధ...తరువాత పారిపోతివి కాంబోలు?
దాశ...ఆఁ పారిపోయాను.
మాధ...ఇన్నిరోజులనుండి యెక్కడనుంటివి?
దాశ....అడవిలో.
మాధ...అక్కడ నేమిచూచితివి?
దాశ...పెద్దపులిని.
మాధ—మొదట రాణిఅని అంటివి కాదు?
దాశ....అన్నాను.గాముల్నుం.
మాధ...తర్వాత?
దాశ...తర్వాత అదినస్నాంబడించింది.

మాధ....ఎవరు? పెద్దపులియా? రాణియా?
దాశ—అది సరీగ్గా తెలియలా
మాధ... వెంబడించినదా?
దాశ....అవును. ఎంబడించింది.
మాధ...ఇంకనీవు ప్రాణాలు దక్కించుకొని పారిపోతివి కాబోలు?
దాశ...ఆఁ పారిపోయాను. ప్రానాలు దక్కించుకొని పారిపోయాను.
మాధ...అక్కడనుండిపారితిన్నగా ఇచ్చటకువచ్చితివా?
దాశ—ఆఁ. తిన్నగా ఇక్కడకు వచ్చితిని.
మాధ...మీమంత్రియెక్కడ?
దాశ.. సచ్చిపోయాడు.
మాధ...ఎట్లుచచ్చెను?
దాశ—నాఅమ్ముచే.
మాధ—నీయమ్ముచేతనా?
దాశ—అవును. చివరికి అట్టాగే తెలిసింది.
మాధ—ఓహో!—నీవుకన్నులు మూసికొని వేసినబాణము నీమంత్రికి తగిలినదికాబోలు.
దాశ. అల్లాగే వుంది.
మాధ ...నీవు చావలేదా?
దాశ— లేదు.
మాధ...బ్రదికి యుంటివా?
దాశ—బ్రతికివున్నానల్లే వుంది.
మాధ ..ఎచ్చట నుంటివి?
దాశ—మధ్య
మాధ. .ఎవరి మధ్య?
దాశ—ఒకవైపునఇద్దము, ఒకవైపున రాణి
మాధ...రాణియా పులియా?
దాశ—పులి
మాధ. .నీవు పిచ్చివానివలె నున్నావు.

దాశ—నాకూ అల్లాగే తోస్తుంది.

మాధ—ఇప్పుడేమి చేసెదవు?

దాశ...అదే ఆలోశిస్తూ వున్నాను.

మాధ—ఇక్కడ నుందువా?

దాశ—అదే ఆలోశిస్తూన్నాను.

మాధ...లేక యింటికి పోదువా?

దాశ—అరే బాబో!

మాధ....నీభార్య చూపులకెట్టిది?

దాశ—బాబో

మాధ...చూడు ధీవర రాజా! నేను నీకొక యుపాయము చెప్పుచున్నాను.

దాశ—యేమిటి?

మాధ...ఇంటికి పొమ్ము.

దాశ—రాణి దగ్గరకా!—బాబో!

మాధ...అపుది యెట్టిదేని కానిమ్ము. ఆమె వలె నక్కఱకు వచ్చు మనుష్యుఁడు మఱియొకఁడు లేఁడు.

దాశ—ఎట్లా?

మాధ...చూడు. నెలజీతమిచ్చి పనివానిని పెట్టుకొనుము.—ఇంక తమాషాచూడు. వంటచేయువాఁడుఅంట్లుతోమఁడు. అంట్లుతోము వాఁడుపిల్లల పోషణము చూడఁడు. కాని పెండ్లాముచే చెప్పులు కట్టుట మొదలుకొని భగవద్గీత పారాయణము వఱకుకూడ చేయించవచ్చును. అట్టిపెండ్లామును విడువకుము.

దాశ...నిజమైనమాటే—అమ్మ బాబో! (వణకును.)

మాధ—ఏమి?

(దాశరాజు వ్రేలితో తెరవంకకు చూపించును.)

మాధ....మంచిది. నీరాణి ఇప్పటకే వచ్చినది. ఇదుగో నేనుతగవంతయు తీర్చెదను.

(ధీవరునిరాణి ప్రవేశించును.)

రాణి...ఓరి సిగ్గుమాలినోడా సివరికి అల్లుడింటి దగ్గిరి మకాం పెట్టావూ! దౌర్భాగ్యుడా!
మాధ—ఇంత తొందరా—ఇంత తొందర మంచిదికాదు. నీవనిన మాటలు అశ్లీలములు.
రాణి ..అయితే యేం?
మాధ—ఇది పతిభక్తికి లక్షణముకాదు.
రాణి...ఇసుమంటి పతిమీదనేనా బత్తి?
మాధ—పతిఎట్టివాఁడైని కానిమ్ము, అతఁడు పతియే, ఈజన్మములో మరియొక పతిగల్గు నుపాయములేదు. గాన వానితోఁగలసి మెల సియే యుండవలయును. లేనిచో జీవితమునకు శాంతియుండదు.
రాణి—నిజమే. మంచిది. ఇంకొ ఇటింకి పోదాము
మాధ....పొమ్ము ధీవరరాజా! నీభార్య నిన్ను చాలకోమలభాషతో పిలుస్తున్నది— పొమ్ము
దాశ...ఇది నన్నెప్పుడూ అవమానం చేస్తువుంటుంది.
రాణి—నేను కాబట్టి నీకు అవమానమన్నా చేస్తున్నాను లేకపోతే నిన్ను అవమానం చేశేవాళ్ళు కూడా లేరు. కావలిస్తే ఎక్కడకన్నా వెళ్ళి చూడూ ఎవరు అవమానం చేస్తారో చూద్దాము.
దాశ—ఎందుకు సేయరు? ఆవాళ్ల స్వయంవరంలో ఆళ్ళు అవమానం సేయలా?
రాణి—నిన్ను అవమానం చేశారా? ఇదియేమిటి! ఎక్కడనైనా మడసి మడసిని అవమానం చేస్తారు. మట్టిసుద్దను ఎవడు చేస్తాడు?— (మాధవునితో) నీవు ఎక్కడైనా విన్నావూ?
మాధ—ఛీఛీఛీ! నీభర్త మట్టిసుద్దా! ఇంక అవమానము చేయకుము.
రాణి...మంచిది— ఇంక ఇంటికిరా. అవమానం సేయనులే. రా.
మాధ....పొమ్ము. పోయి చెయ్యి పట్టుకొనుము.
ధీవరరాజు మెల్లమెల్లగాజడియుచువచ్చితన భార్యచేయిపట్టుకొనును.)
మాధ...ఇది బాగుగ లేదు. జడియకుము.

దాశ....ఏంచేయను!
మాధ...కొంచెము ప్రేమతో చేయిపట్టుకొనుము.
రాణి—ప్రేమ గీమ తర్వాత చూద్దాము. (లాగికొనిపోవును.)
మాధ...నిజముగ నిద్దఱును విచిత్రమైన వారే.

చతుర్థదృశ్యము.

స్థానము—గంగాతీరము. సమయము ప్రాతఃకాలము.
(జనులు స్నానము చేయుచు పాడుచునుందురు.)

గీతము

(అయిభువన మనోమోహినివలె)

అయిపతిత జనావనిగంగే
శ్యామవిటపిఘనతట విప్లావిని
సలిల స్నాత నరనారీ పావని!
బహు నగ నగరీ జనపద తీర్థవి
చుంబిత పాదయుగే శుభే ॥అయి॥
ప్రవహసి యుగే యుగే భారతవర్షే
స్తన్య సుధామపి వితరసి జనని
సస్యశ్యామలాం కురుషే మనుమపి
శీతలపుణ్య తరంగిణి ॥అయి॥
నారదకీర్తన పులకిత మాధవ
విగలిత కరుణామయి అయిమాతః
బ్రహ్మకమండ లూచ్ఛలిత ధూర్జటి
జటిల జాటాపతితేఽద్భుతే ॥అయి॥
నభసోజ్యోతిరి వాంధతమ సతలే
శతధాపతితా హిమగిరి గహ్వరే
హిమగిరితో భువ మవతరితాసి హే
జనని! మహోదధి సంగతే ॥అ॥
త్యక్త్వా భవ సుఖదుఃఖాన్నాతః
అంతిమశయనే శేష్యేఽహం యదా

వర్షకర్ణయుగే మమజల కలరవ
మంబ! సుప్తిమపి వర్షనేత్రయుగే! అయి!
వర్షశాంతిమపి శంకితహృదయే
వర్షసుధామపి మమ కలేబరే
జనని భాగీరథి సురధుని గంగే
కలకల్లోలిని జాహ్నవి! అయి!
(అందఱును పోవుదురు.)

గంగ...(ప్రవేశించి) ఈనదీతీరముననే చాలరోజులనుండి భీష్మ పరశురాములకు ఘోరసంగ్రామము జరుగుచున్నది. ఇందెవ్వఁడును గెలుచుటయులేదు. ఓడుటయులేదు. ప్రపంచము భయముచే నిస్తబ్ధమయి యాయుద్ధము నాలోకించెను. విస్మయముతో సముద్రగర్జనమువంటి యాసమరకల్లోలము నాకర్ణించెను. ఇన్నిరోజు లేకదీక్షతో పోరాడియు భీష్ముఁడలయలేదు. ధన్యుడవు భీష్మా! ధన్యుఁడవు కుమారా!

(వ్యాసుని ప్రవేశము)

వ్యాస...అమ్మా జాహ్నవి! వ్యాసుఁడు నీపాదములకు ప్రణమిల్లుచున్నాడు.

గంగ...వ్యాసా! ఏమిసమాచారము?

వ్యాస—అమ్మా! నీయొద్దున నేఁడు నేనట్టివింత చూడవలసి వచ్చినది. మానవునకును భగవానునకును విధివిరుద్ధమగు ఘోరయుద్ధము జరుగుచున్నది! క్షత్రియునకును బ్రాహ్మణునకును, శిష్యునకును గురువునకును సంగ్రామము న్యాయముగ నున్నదా? తల్లివగు నీవు భయముచే మెదలక యీదుర్ఘటనను చూచుచుంటివా?

గంగ....భయముచేఁగాదు వ్యాసా! మిక్కుటమగు నానందముతో మెదలక చూచు చుంటిని పుత్రగౌరవాభిమానముచే నేఁడు నాయెడ ఉప్పొంగుచున్నది. ఒకవైపునగురువు, రెండవవైపున శిష్యుడు. బ్రాహ్మణుని క్షత్రియుఁడు ప్రతిఘటించినాఁడు. భగ

వంతునితో తనచే పుట్టింపఁబడిన మానవుడు తలపడినాఁడు. అయినను హిమాచలమువలె నిశ్చలుఁడై నాపుత్రుఁడగు భీష్ముఁడు యుద్ధము చేయుచున్నాడు. ఇట్టి యద్భుతము నెక్కడ నేని యెవ్వడేని చూచెనా? వ్యాసా! ఇట్టినిర్వికృవిక్రమముండగు పుత్రుఁడెవరికిఁగలడు?

వ్యాస...అమ్మా! అయినను బ్రాహ్మణునితో క్షత్రియుఁడిట్లు యుద్ధము చేయుట యుచితముకాదు.

గంగ...అట్లుకాదు. వత్సా వ్యాసా! భార్గవుఁడు ఇరువదొక్కమాఱు ఈపృథ్విని క్షత్రియశూన్యనుగాఁ జేసెను. వారిరక్తబీజమునుండియే క్రొవ్విన బాపని గర్వమడంచుటకు భీష్ముఁడు జన్మించెను.

వ్యాస—కాని ఈశ్వరునితో మానవుఁడు యుద్ధముచేయుట ఏమి న్యాయము తల్లీ?

గంగ...వత్సా! వ్యాసా! ఈమానవ జీవితము ఈశ్వరునితోడి యొక అనంత సంగ్రామముగాదా? ఒకవైపున మృత్యువును దాని నల్లని పిశాచసైన్యమును మఱియొకవైపున అసహాయుఁడును దుర్బలుఁడునగు మానవుఁడు. మానవుని దుఃఖములఁజూచి నేనరోజును ఏకాంతస్థలమున నేడ్చుచుందును ఏడ్చిప్రయోజనములేదు. వ్యర్థముగ ఱాతిపై తలపగులగొట్టుకొనుట వంటిది. వ్యాసా! నీవేమనుకొంటివి?

వ్యాస...అమ్మా! అయినను—

గంగ—వ్యాసా! మానవుడు భ్రాంతిసాగరమున పడియున్నను తనశక్తిచే తరంగ గర్జనము నగుచుచు నిర్భయభావముతో తిరుగుచుండును. ఇదిసామాన్య విషయమా? మానవుఁడు గాఢాంధకారమునుండి వెడలి సూర్యునివలె ప్రకాశపూర్ణముగు సభ్యతామార్గమున నడచుచుండును. ఇది సామాన్యమా! మానవుఁడు అభావగర్భమున జన్మించి స్వార్థసంగ్రామోత్సంగమున పెరిగినాఁడు.అయినను అతఁడుతనశక్తిచే సార్థత్యాగ శిఖరము నధిష్ఠించెను ఇదితక్కువ గౌరవమా? ఆమానవజాతిలో నాపుత్రు

వ౯ు భీష్ముఁడు సర్వశ్రేష్ఠుడు. ఎవ్వాని స్వార్థత్యాగశక్తి సౌశీల్య మునకు వెఱచి మృత్యువుకూడ తలవంచుకొని ఎవని పాదముల క్రింద శాంతస్వరూపముతో నివసించి యున్నదో ఆభీష్ముడు సామాన్యుఁడా?

వ్యాస.. కాని ఈశ్వరునితో—

గంగ...నాకు ఈశ్వరుఁడౌశంకరుడే. ఆయన ఆజ్ఞను శిరసావహించెదను.

(శంకరుని ప్రవేశము,)

శంక...గంగా! అయితే నేను ఆజ్ఞాపించుచున్నాను! నీవీయుద్ధమును ఆపివేయుము. శాంతిమయమగు జలముతో ఈఅగ్నిని చల్లార్పుము, దేవవ్రతుఁడు స్వచ్ఛందమరణుఁడు పరశురాముఁడు అమరుఁడు. ఈయుద్ధమునకు అంతము లేదు ఇంకకొన్ని రోజుల వఱకిట్లే యుద్ధము జరిగినచో నింక ప్రళయము కల్గును!

గంగ—చిత్తము స్వామీ! కాని, శంకరా! నీవుమాత్రము హృదయము నుండి మహాత్మగర్వమును హరించితివి

శంక....కాని ఈయుద్ధములో పరశురామునకే అపజయము కల్గును.

(ప్రస్థానము.)

గంగ—తథాస్తు. మంచిది, ఋషివరా! ఇంక నీవుపొమ్ము.(ప్రస్థానము)

వ్యాస—ఇప్పుడు ద్వేషము నశించినది. చరాచరప్రపంచమున భ్రాంతినశించినది. ఎంతప్రమాదము! శంకరా! నీవు నిజముగ శంకరుఁడవు. (ప్రస్థానము.)

(భీష్ముని ప్రవేశము.)

భీష్మ...భార్గవుడెచ్చట? ఈదిబ్బపైనెక్కి ఆయనరాకచూచెదను. (దిబ్బపైనెక్కి) ఎంతదూరము కనిపించుచున్నది! అద్దారిని నల్లని చెట్లతోపులపై ఉషాసౌవర్ణ కిరణములు స్వాగత చుంబనము వలె వచ్చిపడుచున్నవి— ఈదిక్కున తెల్లని ఇసుక తిన్నెలు గనుదవ్వున గనపడుచున్నవి. మధ్య జాహ్నవిదేవి విరాజిల్లుచున్నది. అమ్మా! అతివిశాలమును జలమయమునునగునీయెూ

వక్షస్థల మపారకరుణచే నిండియున్నది. ప్రతివానికి నాశ్రయ మిచ్చుటకు సిద్ధముగనున్న నీయుత్సంగము మనస్సును ముగ్ధముగఁజేయుచున్నది. ద్వేషమును బోఁగొట్టుచున్నది. ప్రజ్వరిల్లుచున్న ఈర్ష్యాహంకారభావము నను శమింపఁజేయుచున్నది. అమ్మా! పాదములకునమస్కారము. (నమస్కరించి కూర్చుండును.)

(పరశురాముని ప్రవేశము.)

పరశు—దేవవ్రతుఁడు ముందుగనే వచ్చియున్నాఁడు. దేవవ్రతా!

భీష్మ....(ఉలికిపడి) గురుదేవా! వచ్చితిరా! (నమస్కరించును.)

పరశు.......శూరుఁడా! లెమ్ము. నేఁడు నిర్మలప్రభాతకాలమున ఈగంగా తీరమున, ఈ అరుణ కిరణ రంజితమగు నీలాకాశముక్రింద మూఁకొడెడముగ నిలఁబడి భీష్ముఁడును పరశురాముఁడును కవచ శిరస్త్రాణములఁ దాల్చి, కరమునఁ గరవాలముఁబూని, కన్నులెఱ్ఱచేసి యుద్ధము చేసెదరు. నేఁడు బాహుబలమున భీష్మపరశురాములలో నెవ్వరధికులో నిర్ణయముకాఁ గలదు. లెమ్ము, కత్తిఁబూనుము.

భీష్మ....గురువరా! యుద్ధమెందులకు? ఇంచుక దృష్టిబఱపి అటుగాంచుఁడు— ఎట్టిఅపూర్వదృశ్యము! అవ్వలియొడ్డున సూర్యనారాయణుఁడు మెల్ల మెల్లగా తూర్పుదిక్కున ప్రకాశమును విఱజిమ్ముచు వచ్చుచున్నాఁడు. ఈ దినరాత్రముల ప్రశాంత సంధిస్థలములో, ఈ గంగాతీరమున ఇప్పుడు యుద్ధమెందుకు?

పరశు—ఈ ద్వాపరయుగమున బ్రహ్మక్షత్రియులలో నెవ్వరధికులో చూచెదను.

భీష్మ—చూచుచు చూచుచు గురుదేవుని శరీరముపై నేను బాణప్రహారమెట్లు చేయుదును?

పరశు...నీపాపము లన్నియు నీగుధిరప్రవాహమున ప్రక్షాళితములగును భీష్మా! యుద్ధముజేయుము. నేను నిన్నుయుద్ధమున కాహ్వానముఁజేసితిని నీవు నీకత్తి పట్టుము. ఇరువదొక్కమాఱు ఈ పృథ్వి

ని క్షత్రియరహితముగఁజేసినవాయీగొడ్డలినినేను పట్టెదను—
భీష్మా! ఖడ్గము ధరింపుము.

భీష్మ—మంచిది. అట్లేయగుగాక— ఓస్వర్గమర్త్య పాతాళలోక వా
సులారా! మీరీ యపూర్వ సంగ్రామమును శ్రద్ధతోఁ జూడుడు

పరశు — దేవవ్రతా! ఈదెబ్బకాచుకొనుము.

(ఇద్దఱుపోరాడుదురు.)

భీష్మ—ఇంక చాలును, గురుని శరీరము గాయము కల్గించితిని.

పరశు...ఏమియులేదు. భీష్మా! ఏమియులేదు. నాయెడమకాలున సా
మాన్యమైన గాయముకలిగినది. శస్త్రము ధరింపుము. రమ్ము.
యుద్ధము చేయుము. ఇంక — భీష్మా! చాల రోజులనుండి
నేనిట్టి యుద్ధమును చేసియుండలేదు. నాప్రతి యంగము నం
దును ఉష్ణరక్తము సమరోత్సాహముచే తాండవమాడుచు
న్నది. యుద్ధము చేయుము. ఇంక. ఇంక!

భీష్మ...ఇంకచేయను. గురుసన్నిధిని శిష్యుఁడు ఓటమినిఒప్పుకొను
చున్నాఁడు.

పరశు—కాని నేను నా శస్త్రబలముచే లబ్ధము గాని జయమును
ఒప్పుకొనను—దేవవ్రతా! మఱల కత్తిపట్టుము.

భీష్మ....గురుదేవా!

పరశు—ఇప్పుడీఅనునయ వినయములు పనికిరావు. రమ్ము. యుద్ధ
ముచేయుము. ఇంక నాకేమియు నక్కఱలేదు.—యుద్ధము
చేయుము. చాలరోజులనుండి ఇట్టి యుద్ధమును జేయలేదు.
శిష్యా! రమ్ము. యుద్ధము చేయుము. (మఱల నిద్దఱును
యుద్ధముచేసెదరు. భీష్ముని ఖడ్గప్రహారముచే పరశురాముని
చేతనుండి పరశువు నేలఁబడును. పరశురాముఁడు వంగిదానిని
తీసికొనును.)

భీష్మ....ఇంక యుద్ధము చేయను. (కత్తిపాఱవేయును.)

పరశు....ఇదియేమి భీష్మా! నేను ఓటమినొప్పుకొనను. యుద్ధము చేయుము, యుద్ధముచేయుము.

భీష్మ....స్వామీ!—

పరశు—యుద్ధము చేయుము. దేవవ్రతా! ఇదియే నాకుగురుదక్షిణ యుద్ధముచేయుము. యుద్ధముచేయుము— ఇదియే తుదిసారి ఈమా యుపక్రియయగును. భీష్మా! కత్తిపట్టుము. విలంబము సహింపను. (గొడ్డలియెత్తును,)

(ఇంతలోనిద్దఱ మధ్యను గంగప్రవహించును. క్రమముగ విశాలమగును. అందు పరశురాముడంతర్ధానమగును. నదీమధ్యనుండిగంగాదేవి ప్రత్యక్షమగును.)

గంగ—సెబాసు దేవవ్రతా! సెబాసు. కుమారా! ధన్యుడవు. అటు జూడుము. ఆకాశమునుండి నీపైదేవతలు పుష్పవర్షము గురియుచున్నారు.

(పరశురాముని ప్రవేశము)

పరశు....వీరవరా! చూడుము. పరశురాముడు నేడు శిష్యగౌరవలబ్ధమగునానందమును బట్టజాలకున్నాడు. దేవవ్రతా! ధన్యుడవు. నేనునునీవంటిశిష్యుడుగల్గుటచే ధన్యుడను. నేను కేవలము నిన్ను పరీక్షింపగోరితిని. భీష్ముని జంపుటకై పరశురాముడిచటకు రాలేదు. వీరత్వమందును, విక్రమమందును, సాహసమందును స్వార్థత్యాగమందును, నిన్ను బోలినవాడు ఈభూమండలమున లేడని నేడు కనుగొంటిని. శిష్యాగ్రణీ! నీవుధన్యుడవు. దేవవ్రతా! రమ్ము. నిన్ను కవుగిలించుకొందును.



పంచమదృశ్యము.

హాస్తినాపుర రాజాంతఃపురము. రాత్రి.

సత్యవతి యొంటరిగా పాడును,

గీతము.

ఏల నాకింక బ్రదుకు
నాదు కన్నుగవపోయె బొత్తవిటి
వారవిచంద్రులు నస్తమించిరి.
మేదురముగ నలుదిక్కుల నలమెను
మిక్కుటంపు ఘోరాంధకారము ॥ఏల॥
ఆసలన్నియును నేలఁగలసినవి
ఆవరించెఁగదు నైరాశ్యమ్మిద
ఏసుఖమ్మునే జూరకొందునిఁక
నేమి తెరవు నాపాడు బగిసికిలి

సత్య....నాపుత్రుల నిద్దఱను పోఁగొట్టుకొంటిని. నేఁడు నేను పదద లితయు, ఘృణితయు, అనాథయునగు మహారాజ్ఞిని. అయినను అనంత యావనను,—మహర్షీ! చాలమంచివరము! జగదంబా నీదయకు మేర లేదు అమ్మా! దయామయు పేరెంతయు నీకు తగును—కాదు. కాదు. ఇదియంతయు వ్యర్థము. ఇందె వ్వరి దోషమును లేదు. దోషమంతయు నాదే. ఈదర్పము ని యమమును ధిక్కరించెడిది— ఇది ఆకాశమునకు తలయెత్తి నది. అమ్మా! నీవొక్కతన్నులోనే దీనిని మట్టిలోఁ గలిపితివి. మదోన్నత్తనై ప్రపంచములో నేధర్మదుర్గముపైకి నేను దాడి వెడలితినో అది యిప్పటికిని అట్టే అక్షతమును, అస్ఖలితమునై దర్పముచే తలయెత్తుకొని నిలచియున్నది. ఇంక నేనునిందితను, పదదళితను అయి కుందుచుంటిని. మహేశ్వరీ! నీ నియమ శృంఖలకు జయమగుఁ గాక. ప్రచండనూర్యుని ఆమేఘము గప్పివేయు చున్నది. జలకణమిశ్రితమగు శీతలవాతము వీచు చున్నది. అల యాటచే కన్నులు మూతలు పడుచున్నవి. నిద్రిం చెదను. (నేలపైనిద్రించును.)

(భీష్ముఁడు, వ్యాసుఁడు ముక్తయనుదాసియుప్రవేశించెదరు)

ముక్త....ఇంతకు మున్నిక్కడనే చూచితిని.

భీష్మ...అదుగో అక్కడ పరుండియున్నది.

వ్యాస....ఈమెయే నాతల్లి

సత్య—(నిద్రావస్థలో) వద్దు వద్దు ముట్టుకొనవద్దు—
నన్ను ముట్టుకొన వద్దు—నేను కన్యను.

ముక్త....ఇదుగో కలవరించు చున్నది.

భీష్మ—మధ్య మధ్య నిట్లే వాగుచుండునా?

ముక్త...చిత్తము.

భీష్మ—ఇంత దుర్బలయయ్యెనా?

సత్య...వద్దు బ్రాహ్మణా'—నేను వరమును గోరుటలేదు. నాకు వరము అక్కరలేదు. నన్ను విడువుము. నీకాళ్ళపైఁబడెదను. విడువుము.

వ్యాస—అభాగ్యురాలా!

సత్య...నాకొడుకు ఎక్కడ? నా—

వ్యాస—ఇదుగో నీకొడుకు నిలుచున్నాఁడు. అమ్మా!

సత్య ఎవరు? ఎవరు? (లేచి నిలుచుండును.)

భీష్మ—ఈయన వ్యాసమహర్షి.

వ్యాస...మఱియొక గుర్తుకలదు.—ద్వీపమందు నేను పుట్టుటచె నన్ను ద్వైపాయనుఁడందురు. నేను నల్లనివాఁడను. అందుచే కృష్ణద్వైపాయనుఁడని కూడ నందురు

సత్య—ద్వీపమునందు పుట్టితివా?

వ్యాస...నాతండ్రి పరాశర మహర్షి.

భీష్మ—పడుచున్నది—పట్టుకొనుము. (ముక్త సత్యవతిని పట్టుకొనును)

సత్య...(మెల్లగ) తర్వాత?

వ్యాస—నాతల్లి సత్యవతి—శంతను మహారాజురాణి

సత్య...కుమారా! కుమారా! ఇదియేమి! తల తిరుగుచున్నది. దేవతలారా! క్షమింపుఁడు. నాపాపములను హరింపుడు. నాపుత్రుని పుత్రుఁడని పిలుచు నధికారము నాకిందు. పుత్రా! వ్యాసా! —కాదు కాదు. నేనేమి ప్రలాపించుచుం

టిని! మహర్షీ! నేను ఈధీవరకన్య, ఈఅభాగ్యురాలు, శంత
ను మహారాజు విధవాంగన లోకారాధ్యుఁడగు వ్యాసమహర్షి
కి తల్లియా?

వ్యాస...అవును. నీవు నాకు తల్లివి.

సత్య - నీతల్లినా! —కుమారా! సత్యమా? నేను నీకు తల్లిని, నీవు
నాకు పుత్త్రుఁడవునా! నేను కళంకినిని. నీవు భారత ప్రసిద్ధుఁ
డవగు వ్యాస మహర్షివి! కుమారా! వ్యాసా! ఈమాట ఏమి
నీవు నన్ను ఏవగించుట లేదా! వద్దు. వద్దు. ఏవగించవద్దు.
సమ్మర ప్రపంచమున "మత్స్యగంధి పాపాత్మురాలు, భ్రష్టు
రాలు. పతిఘాతుకురాలు" అని చాటింపఁజేయుము. కాని
కుమారా! నీవు ఏవగించవద్దు. నేను కళంకినిని—

వ్యాస....అయినను కొడుకునకు తల్లి తల్లియే. ఎప్పుడును ఆశీర్వదిం
చుము. అమ్మా! (మోకరిలఁ బడును.)

భీష్మ—పాపిని పాదములకడ వ్యాసమహర్షి!

వ్యాస...తల్లిపాదములపై తలయుంచి పుత్త్రుఁడు ప్రార్థనము చేయును.
తల్లియే శిష్యునకు గురువు. గురునియాచరణముపై నాలో
చించు అధికారము శిష్యునకు లేదు. తల్లి బ్రాహ్మణునికన్న
కూడ ఎక్కువది. తల్లి స్వర్గముకంటె నధికప్రియమైనది.

భీష్మ... కాని కులటయగుస్త్రీ—

వ్యాస—దేవవ్రతా! నీవు మహాత్ముఁడవే. అయినను క్షత్త్రియ
పుత్త్రుఁడవు. క్షమామహిమ నెఱుంగుశక్తి నీకు లేదు. భీష్మా!
నీవు క్షత్త్రియులలో చాలగొప్పవాఁడవు. కాని బ్రాహ్మణుల
కన్న చాల తక్కువవాఁడవు.

భీష్మ... పరశురాముఁడును బ్రాహ్మణుఁడే. ఆయన కులటయగు
తనతల్లిని నరికివేసెను.

వ్యాస—భీష్మా! పరశురాముఁడు" బ్రాహ్మణుఁడా? అవును బ్రాహ్మ
ణుఁడే. పరశువు వాని అస్త్రము. తనధర్మమువదలి యేబ్రాహ్మ
ణుఁడు క్షత్త్రియధర్మమును గ్రహించునో వాఁడు బ్రాహ్మ

ణుఁడుగ గణింపఁబడడు. శాస్త్రమును విడిచి శస్త్రచర్చసేయుట బ్రాహ్మణుని పనికాదు. గనుకనే భార్గవుఁడు రామచంద్రునకు ఓడెను. భగవంతుఁడు మానవునకు ఓడెను.

భీష్మ... నేను నాగురుని నిందింపఁజాలను. (వెళ్ళఁబోవును.)

వ్యాస—దేవవ్రతా! ఆగుము. వినుము. నీవు క్షత్రియుఁడవు. శస్త్రచర్చ సేయుము. కాని శాస్త్రచర్చ చేయకుము. నీవు నీ హద్దును దాటకుము. ప్రళయమగును (సత్యవతితో) దేవీ! జననీ! వ్యాసునిపుణ్యబలముచే నీపాపములన్నియు ప్రక్షాళితములగుఁగాక. నావరములో స్నానముచేసి నీవు సర్వపాప వినిర్ముక్తవుగమ్ము. నీవు వ్యాసుని తల్లివి—నీపాదపరాగముచే నాశిరమును పవిత్రముఁజేయుము.

సత్య...ఇది స్వప్నమా? లేక యథార్థమా? ఇది యేటి సమస్య! ఇది యెట్టి వ్యంగ్యము! ఇదియేమియు నాకు గోచరమగుట లేదు.

(సత్యవతి పడఁబోవును. ఇంతలో గంగవచ్చి ఆమెను పట్టుకొనును.)

గంగ—సత్యవతీ! స్థైర్యము వహింపుము.

సత్య—(క్షీణస్వరముతో) నీవెవతెవు?

గంగ—నేను నీసవతినగు గంగను నాగర్భమునుండియే దేవవ్రతుడు జనించెను. ఎప్పుడును మనుష్యుని దుఃఖమును జూచి విలపించుచుందును. సోదరీ! భగవంతుఁడు నాకీమహాధికారము నే యొసంగెను సముద్ధతమగు గర్వమును చూర్ణము చేయుచుందును. దుఃఖతునిఁ జూచి కంటఁదడి పెట్టెదను. సహానుభూతితో నిందితునిఁ గౌగిలించుకొందును. శాంతిజలముతో పశ్చాత్తాపమును కడగి వేసెదను సోదరీ! నాఅశ్రుజలముచే నీపూర్వపాపములన్నియు ప్రక్షాళితములగుఁగాక.

—•••—

షష్ఠ దృశ్యము.

స్థానము—పర్వతమువద్ద శ్మశానము. సమయము.—రాత్రి.
(పర్వతశిఖరమునఁ గూర్చుండి అంబ తపస్సుచేయుచుండును)
శ్మశానములో శంకరుని యెదుట భూతగణములు పాడుదురు.

గీతము.

భూతనాథ భవభీమ మహేశ్వర విభూతిభూషణ త్రిశూలధారీ
వామదేవ శితికంఠ ధూర్జటే గౌరీధవపశుపతే పినాకీ (దే
మహాదేవ మృడశంభో వృషధ్వజ వ్యోమకేశ త్ర్యంబక త్రిపురా
స్థాణో కపర్దీ శివపరమేశ్వర మృత్యుంజయ గంగాధర స్మరహర
పంచవదన హరశశాంక శేఖర కృత్తివసన కైలాసనివాసీ॥

[క్రమముగ తెల్లవాఱును. భూతగణము లదృశ్యులగుదురు]

శంక.. (అంబతో) నీ వెవతెవు? ఈపర్వతశిఖరముపై నీవేల తపస్సు చేయుచుంటివి?

అంబ—(కన్నులు తెఱచి) తమ రెవరు?

శంక.. నేను శంకరుఁడను.

అంబ—(లేచి) శంకరుడవా! (పర్వతశిఖరమునుండి దిగును.)

అంబ—కాశీ రాజుకన్యయగు అంబ నమస్కరించుచున్నది.

శంక—కుమారీ! నీవీఘోరతపమేల చేయుచుంటివి! అన్నపానములను విడిచి కుసుమ కోమలమగు శరీరమును నీవేల కష్టపెట్టుచుంటివి? నీవేమి కోరుచుంటివి?

అంబ—భీష్ముని మృత్యువును. అదియును నాచేతిలోనే—ఇదియే కోరుచుంటిని.

శంక—రమణీ! ఇదియేమి వరము? నీవు కేవలము ప్రతిహింసకొరకే ఈ యౌవన ప్లావితమగు సుందర శరీరమును పాడుచేసి కొనుచుంటివా! రాజకుమారీ! ఇది రమణికి శోభావహమా!

అంబ...ఎందుకు కాదు? మహేశ్వరా! స్త్రీలు పురుషుల అన్యాయము కోపముననుసహించుచు వారి ప్రేమ రహితమగు కఠోర పిషాక్త ఖడ్గమునకు మెడ యొగ్గుచు వారి హృదయ దే

ధకమగు దుర్వ్యవహారమునకు మాఱుగవారిపై ప్రేమామృతో
మును వర్షింపుచు నుండవలయునని పురుషులు కోరవలయునా
శంక.. స్త్రీలకిదియే పని — ఇదియే కర్తవ్యము.
అంబ...ఇంక పురుషులపని సత్యము నన్యాయముసేయుటయు. స్త్రీల
ను పీడించుటయునా?—కాదు కాదు ద్రోహము సేతపురుష
ని ధర్మమనియు, మొదలక తలవంచుకొనిసహించుట స్త్రీల ధ
ర్మమనియునే నొప్పుకొనజాలను.
శంక—ఇదియే స్త్రీకర్తవ్యము. స్త్రీజాతికి సహనశీలతయే ఒక ప్రధాన
గుణము. స్త్రీయొక్కటను ఈప్రపంచములో స్నేహశీలయు,
ప్రేమమయియు, సేవామయియు నయి యుండును. ఆమె పు
ష్పములలో కమలము వలె నిర్మలసరోవరజలములో వికసి
తమై శోభాసౌందర్యమును పోషింపుచుండును. ఇదియే రమణీ
ధర్మము రమణి రమణీధర్మము ను పరిత్యజించినచో సంకపృథ్వి
నుండి గౌరవ మెగిరిపోవును.
అంబ—శంకరా! ఎగిరిపోవునుగాక. ఇందు నాకేమి? బ్రహ్మాండ
రక్షణ భారము నేనేమియు వహింపలేదు. ఈసృష్టిచేసిన
వారే దానిరక్షణమునకై యాలోచింతురుగాక.
శంక...అమ్మాయీ! వినుము.
అంబ....వినుటకు సమయములేదు. భీష్మునిజంపుటయే నాప్రతిజ్ఞ.
అణుమాత్రమును దానినుండి మీరునన్ను తొలఁగింపజాలరు.
వరము నిచ్చెదరా లేదా? నేను ప్రతిహింసను గోరుచున్నాను.
చెప్పుడు. ఇచ్చెదరా లేదా?
శంక...ఇవ్వనిచో?
అంబ...మరలతపము చేసెదను. శంకరా! ఈవరమునీయవా? నీకు ఈ
యకతప్పదు నీవునియమమునకు కట్టుబడి యుండలేదా? విశ్వే
శ్వరా! నీవు స్వేచ్ఛాచారివా? నీవు ఇచ్చియే తీఱవలయును.
మనోవాక్కాయములతో చేసిన సాధన యెన్నటికిని వ్యర్థ
ముగాదని వింటిని. ప్రభూ! ఇచ్చట పాపపుణ్యములకు భేదము

లేదు. ఏకాంత సాధన సఫలమయి తీరును. ఈజన్మమునందో మఱియొక జన్మమందో అది సఫలముగాక తప్పదు. తపము ప్పటికిని నిష్ఫలముకాబోదు. చెప్పుము. ఇచ్చెదవా? లేదా?

శంక... ఈవరము నేనీయజాలను నీవు మఱియొక వరము కోరుకొనుము. దేవవ్రతుఁడు స్వచ్ఛంద మరణుఁడు. అతని ఇచ్ఛకు విరుద్ధముగ అతని జంపుట సాధ్యము కాదు.

అంబ—నాసాధనాబలముచే దేవవ్రతుఁడు చేతులు జోడించి మోకరిలఁబడి స్వయముగ మృత్యువును ప్రార్థించును—శంకరా! నేను వివాదము చేయఁగోరుట లేదు—భీష్మునిమృత్యువుగోరుచున్నాను. అదియును కుసుమ కోమలమగు నీచేతులలోనే. చెప్పుము. ఇచ్చెదవా లేదా?

(కొంచెముదూరమునసన్యాసి వేషమున భీష్ముఁడుప్రవేశించును)

శంక....మఱియొక వరము కోరుకొనుము.

అంబ...నాకు మఱియొక్కటి అక్కఱ లేదు.

శంక...గొప్ప సంపద కోరుకొనుము.

అంబ—నాకక్కఱ లేదు.

శంక...అనంత యౌవనము?

అంబ—నాకేమియు నక్కఱలేదు. నాకిది యొక్కటియే కావలయును ఇచ్చెదవా లేదా?

శంక—విచిత్రమైనదానవు.

అంబ....అవును. విచిత్రమైనదాననే.

శంక—విచిత్ర మగుప్రతిహింస

అంబ—చాల విచిత్రము ఈ వరమిచ్చెదవా లేదా? చెప్పుము ఇవ్వనిచో పోవుదు—నేను మరల తపమారంభించెదను. చెప్పుము మృత్యుంజయా! ఈవరమిచ్చెదవా లేదా?

శంక...తథాస్తు కాని ఈజన్మములో కాదు. రెండవజన్మములో రమణీ! నీవు మఱల ఈ ధాత్రిపై ద్రుపదరాజునకు కన్యవై పుట్టెదవు. కాని ఈప్రతిహింసా ప్రవృత్తిచే నీవుస్త్రీ స్వభావ

మును వదలవలసి యుందువు. రెండవ జన్మములో నీవు సగ మాఁడుదానవును సగము పురుషుఁడవును అగుదువు. పురుష హాస్యము చేయునది యే ఆఁడుదియేని యగుఁగాక. నేను పైశాచిక వరము నీయఁజాలను. గనుక నీవరమిచ్చుచుంటిని.

అంబ— ఈదాసి కృతార్థ అయినది నమస్కారము.

శంక....విచిత్ర స్త్రీ ! (అంతర్ధాన మగును.)

అంబ...ఇంక ప్రపంచ మంతయు ఆఁడుదాని ప్రతిహింసా ప్రతాపమును జూచునుగాక. రమణీ ప్రతిహింసను దేవతలుచూతురుగాక. రమణీ ప్రతిహింస చచ్చినను పోదు. ఇంక రమణిని ఎవ్వగును అబలయనరు. ఇంక ఆఁడుదాని క్రోధాయణ నేత్రములను జూచి యెవ్వరును నవ్వరు. ఇంక పురుషుఁడు నిర్భయముగ ఆఁడుదానిని హింసింపఁడు. ఆఁడుదియేడ్చినచో దాని ప్రతి కన్నీటి చుక్కయు నిప్పురవ్వవలె ప్రజ్వరిల్లును. ఆఁడుదానిదీర్ఘ నిశ్వాసములు పురుషుని కర్ణములకు సర్పఫూత్కారమువలె నుండును. ఆఁడుదాని యార్తనాదము పురుషునకు మృత్యుశాపము నొసఁగును. భీష్మా! ప్రపంచమా! ఆఁడుదాని పైశాచిక మూర్తిని జూడుఁడు ఆఁడుదాని హృదయమునుండి భక్తి ప్రేమ, క్రోధము, జుగుప్స, అన్నియు పోవును. కాని ప్రతిహింసపోదు. ప్రతిహింస! ప్రతిహింస!

(ప్రస్థానము)

భీష్మ...రాజ కుమారీ! తెలిసినది. పరిత్యక్తవగుట కతన నే నీవీభైరవ రూపమును దాల్చితివి— ఆహా! నాశరీర హృదయములు కరగి నేనొక కరుణాసముద్ర మగుచో ఆనీటి చేతనే యీమంటను ఆర్పువాఁడను—జగదీశ్వరా! నాకీవర మొసఁగుము. నేను నవ్వుచు నవ్వుచు నా రక్తము ఈమెకు ఈయఁగల్గుదును గాక. (తెర వాలును.)



# భీష్మ.

## పంచమాంకము.

### ప్రథమదృశ్యము.

స్థానము— కౌరవసభ. సమయము— ప్రాతఃకాలము.

[భీష్మ ద్రోణ దుర్యోధన దుశ్శాసనాదులు కూర్చుండియుందురు కృష్ణుఁడెదుట నిలఁబడి యుండును.]

కృష్ణ... దుర్యోధన మహారాజా! స్వర్గస్థుఁడగు విచిత్రవీర్య మహారాజునకు ధృతరాష్ట్రుఁడు జ్యేష్ఠపుత్త్రుఁడును పాండురాజు కనిష్ఠపుత్త్రుఁడును అగుదురు. ధృతరాష్ట్రుఁడు పుట్టుగ్రుడ్డియగుటచే పాండురాజే సింహాసన మధిష్ఠించెను. ధృతరాష్ట్రపుత్త్రులగు మీఅన్నదమ్ములు నూటొక్కరును, రాజపౌత్త్రులుగాని రాజపుత్త్రులుగారు. పాండుపుత్త్రులగుటచే యుధిష్ఠిరాదులయిదుగురును రాజపుత్త్రులే. ఈరాజ్యము వారిదే, కనీసము ఈరాజ్యములో సగపాలు వారిది కాదని యెవ్వరును చెప్పఁజాలరు.

దుశ్శా— కాని వారిభాగమునే గాక వారిభార్యనుగూడ యుధిష్ఠిరుఁడు జూదములో ఓడినాఁడు. దయతలఁచి మేము వారిభార్యను వారికిచ్చివేసితిమి.

కృష్ణ... ఆజూదమునకు తగిన ప్రాయశ్చిత్తమును వారు బాగుగ అనుభవించిరి. రాజపుత్త్రులయ్యు పండ్రెండు సంవత్సరములు వనవాసము చేసిరి. ఒకసంవత్సరమజ్ఞాతవాసమునందుండి యొరులకు దాస్యముకూడ చేసిరి. ఇప్పుడు వారయిదుగురును అయిదు ఊళ్లను మాత్రమడుగుచున్నారు.

దుర్యో.... రాజ్యము వలయుచో వారు యుద్ధముచేసి తీసికొందురుగాక. భీముఁడు నాఁడు నిండుసభలో గదచే నన్ను నుగ్గుచేసెదననియు దుశ్శాసనుని నెత్తురు త్రావెదననియు బెదరింపుచు

చెప్పనే చెప్పె.

దుశ్శా— అన్నా! మనకా మాటలతో నిష్ఫలము పనిలేదు. రాజ్యము మాట, మేము తిరిగి ఈయము, ఎంతకు తొంబది మాటలు.

కృష్ణ... కాని యుధిష్ఠిరుఁడు అర్ధరాజ్యము కూడ అడుగుటలేదు.

దుశ్శా... మేము నాల్గవపాలు కూడ ఈయము.

కృష్ణ... వారు అదియును అడుగుటలేదు. అయిదు ఊళ్ళను మాత్రమే అడుగుచున్నారు.

దుశ్శా— మేము ఒక్కటికూడ నీయము.

దుర్యో... యుద్ధము చేసి తీసికొందురుగాక. భీముఁడు చాల—

దుశ్శా—మరల నదే. అన్నా! నీవు భీముని పేరెందుకెత్తెదవు? రాజ్యమీయమని తిన్నగ ఒకమాట చెప్పిన చాలదు?

కృష్ణ...శకునీ? దుర్యోధనుని చెవిలో నేమిచెప్పుచుంటివి? నీవే యీ కుటిలతంత్రమునకు కారణమవు.

శకుని— (ఆశ్చర్యమభినయించుచు) నేనా?

కృష్ణ... దుర్యోధన మహారాజా! నేను నిన్ను ఉదారుఁడవు కమ్మని కాని, దాతవుకమ్మనికాని, దేవతవు కమ్మనికాని చెప్పుట లేదు. నీవిప్పుడు హస్తినాపుర రాజువు. భారతచక్రవర్తివి. న్యాయము చేయుట రాజునకు కర్తవ్యము. న్యాయము చేయుము. వారు నీసోదరులు. వారు బలవంతులని విరాటుని యుద్ధములో ధృవమయినది. వారు క్షమావంతులు. ద్వైతవనములో గంధర్వరాజు యుద్ధమున నీకీసంగతి యనుభవము. వారు నిరీహులును సరళస్వభావులును గనుకనే వారు తమ రాజ్యమంతయు వదలి అయిదు ఊళ్ళను మాత్రమే అడుగుచున్నారు. ఇట్టిసోదరులతో వైరము పెట్టికొని వారికి కోపము తెప్పించకుము. ఇట్టి సోదరులను శత్రువులఁ జేసికొనకుము లేకున్న నీకు సర్వనాశనమగునని జ్ఞాపకముంచుకొనుము.

ద్రోణ.... వాసుదేవా! మీ సవెఘ్ఘఁడు. మీయుపదేశమిచ్చుటఫలింప నేరదు. ఇదియూషరక్షేత్రము. ఇచ్చట వర్షోదకము నిలువదు.

కృష్ణ...శకునీ! నీవుచేయఁదలచిన పాపము చేసివేసితివి. ఇంకదానిని హెచ్చింపకుము. పాపము పండినది. ధర్మమిప్పుడు సహింపజాలదు. చూడుము నీవు కోరినచో, ప్రయత్నముచేసినచో యుద్ధమాగగలదు.

శకుని...(ఆశ్చర్యముతో) నేనా?

కృష్ణ...అవును, నీనే. నీపితనికిమామవు. నీపితనికి మంత్రివి. నీవేళ క్రియను మద్యము ద్రావించి దుర్యోధనుని మత్తిలఁజేసితివి. నీవీ రాజభవనమును పాపపాషాణములచేఁ గట్టుచుంటివి. నీ వే మంత్రబలముచే వీరిని, ముఖ్యముగ అబోధోపహతుడగు నీకు ట్టవానిని (దుర్యోధనుని) వశపఱచుకొంటివో తెలియదు.

శకుని...(ఆశ్చర్యముతో) నేనా! కాదు వాసుదేవా! ఈవ్యవహారము లోనాకు జోక్యము లేదు.

కృష్ణ—అయితే యిప్పుడు నీవు దుర్యోధనుని చెవిలోచెప్పినదేమి?

శకుని—(ఆశ్చర్యముతో) నేనా' ఆఁ అది. నేను చెప్పినదేమన నేఁడు బాగుగ మబ్బుగనున్నది. ఈవేళఆఁ—ఆఁ— ఈవేళ ఆఁ పులగము వండించిన బాగుగ నుండునేమోయని.

కృష్ణ....వండవలసిన పులగమువండితివి. చాలబాగుగవండితివి!

శకుని....కొంచెము—

కృష్ణ—నాకు తెలియును. నీవుసర్వము నెఱుఁగుదువు. నీవుగొప్పకూట నీతినిపుణుఁడవును బుద్ధిశాలివియు నీవు ఆస్మీయ వ్యవహార ముచే రాజ్యమున కనర్థము తెచ్చిపెట్టుచుంటివను మాటయె ఱుఁగవని నేననుకొనను.

శకుని—శ్రీకృష్ణా! నేనేమియుచేయుటలేదు. అంతయుదైవమే చే యుచున్నాఁడు. లేనిచో ధర్మమూర్తియగుయుధిష్ఠిరుఁడు అడ వికి వెళ్ళుటయు ఆయన స్థానమున దుర్యోధనమహారాజు—

దుర్యో—మామా' యేమియనుచున్నావు!

శకుని—ఇంకదుర్యోధనుఁడు—భీష్మద్రోణ విదురకృపాది మహా త్ములుండ శకునిని మంత్రినిచేసికొనుటయు!

దుర్యో—మామా! యేమి అట్లనుచుంటివి?
శకుని—దైవలిఖితము నెవ్వఁడును తప్పింపఁజాలఁడు. భీష్ముఁడు దుశ్శాసనుని రక్తమును త్రాగునని భాగ్యమున వ్రాసియున్నచో నతఁడు తప్పక త్రాగును.
దుశ్శా—ఎట్లు త్రాగును?
శకుని...అదృష్టమున వ్రాసియున్నచో భీమసేనుఁడు తనగదతో దుర్యోధనుని తొడలు తప్పక విఱుగఁగొట్టును.
దుర్యో...ఏమిమామా! అట్లనుచుంటివి.
శకుని—ఓయీ! మామా మామా యనియేల యట్లఱచెదవు? మీ మామ మామయే. మీమామను ఎవ్వరును ఎత్తుకొనిపోరు. దైవలిఖితము నెవ్వరునుతప్పింపజాలరు. మీమామ మామయే
కృష్ణు...అయితే పాండవులకడ కీసందేశమే కొంపోవలయునా?
దుర్యో....అవును. దుర్యోధనుఁడు యుద్ధముచేయకుండ పాండవులకు సూదిమొనమోపునంత నేలయేని యీయఁడని చెప్పుము.
కృష్ణు—మంచిది ఇంక నేనుపోయెదను.
శకుని...అదియేమి! మేము మిమ్ముల నాహూతులఁ జేసితిమి. ఈఉత్సవ సామగ్రియంతయు మీకొఱకే. చూచుచుంటిరా?
కృష్ణు...ఆఁ చూచుచున్నాను. చాలపెద్దసన్నాహము. కాని యిందు భక్తికన్న బడాయియెక్కువగనున్నది.
దుర్యో...అదియెట్లు?
కృష్ణు—(శకునితో) శకునీ! వీరికేమియు తెలియలేదు. మనముభయులమే తెలిసికొంటిమి. మంచిది వెళ్ళుచున్నాను మహారాజా!
శకుని—కొంచెము ఫలాహారముపుచ్చుకొని పొండు. సత్కారమును స్వీకరింపుఁడు.
కృష్ణ—అవసరములేదు. సంభాషణముచేతనే తృప్తుఁడనయితిని. ఇంకనేమియు నవసరములేదు. (వెళ్ళబోవును.)
దుర్యో—(దుశ్శాసనునితో) పట్టుకొనుము.
కృష్ణ—నన్నుపట్టుకొందువా? ఔరా! మూర్ఖుఁడా! నేనుపట్టు ఈయని

చే సన్నివర్తేని పట్టుకొనఁగలరా? శకునీ! ఇప్పుఁడు వీరుని తో డ్కొనుట.

దుర్యో—పోనిమ్ము. పట్టుకొనుము. ముందుకుఁబొమ్ము. (దుశ్శాసన కర్ణాదులు కృష్ణుని బట్టుకొనుటకు ముందుకుఁబోయెదరు. విశ్వరూపము ధరించి కృష్ణుఁడు బిగ్గరగనవ్వును. వారిని తేఱిపార జూచి వక్రవినయముతో తలవంచును.)

కృష్ణ....ఇంకపోయెదను మహారాజా! (అంతర్ధానమగును.)

దుర్యో—ఎవ్వరును పట్టఁజాలకపోయిరా?

దుశ్శా—లేదు. ఆయన నేత్రములలో నెట్టియద్భుత దృశ్యములను చూచితిని! సృష్టిస్థితి-లయములన్నియునందే యున్నటులుండెను నేను నిశ్చేతుఁడనయితిని.

దుర్యో...ఇంక మీరో?

కర్ణ—నాకు నట్లేయయ్యెను.

దుర్యో....ఎట్లు?

కర్ణ....దానిని నేను చెప్పజాలను. ఒక్కమాటుగ భయము ఉల్లాసము, విచారము, కరుణ, ప్రేమ, అన్నియు, ఆ దృష్టిలో నుండెను. అప్పటి పరిస్థితిని సరిగా తెలుపఁజాలను.

దుర్యో...మీ రెందుకును కొఱగారు, మిమ్మును నమ్మికొనియే నేను పాండవులతో కయ్యమున కియ్యకొంటిని.

శకుని...దైవమా!

దుర్యో—కృష్ణుఁడెక్కడకు వెళ్ళినాఁడు?

కృపా....పాండవుల యింటికి.

దుర్యో—అయితే ఆయన పాండవుల పక్షమున నున్నాఁడా?

కృపా...అవును మహారాజా!

దుర్యో—మామా! కృష్ణుఁడీ యుద్ధమున మనపక్షమున నుండునని చెప్పితివి కదా?

శకుని....అవును అబ్బాయీ! ఇందులో నేమియు సంశయము లేదు. నేను గణితము వేసి చూచితిని.

దుర్యో—ఏమి గణితము వేసి చూచితివి?

శకుని... ఇదియే! ఈయుద్ధములో మీకు కృష్ణప్రాప్తి కలదు. నాగణితములో పొరపాటు ఉండునా? మీకు కృష్ణప్రాప్తి కలుగునంత వరకు నేను మిమ్ము విడువను. వెళ్ళి అనన్నాహము చేసెదను. గణితములో తప్పావతురాదు. (వెళ్ళును)

దుశ్శా—అన్నా! ఏమియు భయములేదు. కృష్ణుఁడు తన పదికోట్ల సైన్యమును మనకిచ్చినాడు. తానీయుద్ధములో శస్త్రము పట్టనని ప్రతిజ్ఞ చేసెను. నిరాయుధుఁడై పాండవులపక్షమున నుండి మాత్రమతఁడేమిచేయఁగలఁడు?

(గాంధారిప్రవేశించును.)

గాంధారి...దుర్యోధనా!

(దుర్యోధనుఁడు సింహాసనము నుండిదిగును అందఱునుతమతమయాసనముల నుండి దిగుదురు)

దుర్యో—కౌరవమాత రాజసభ కేల వచ్చినది?

గాంధా... అంతే ఇంక సంధికుదురదా?

దుర్యో—సంధి యసంభవము.

గాంధా...కుమారా! రాజ్యము యుధిష్ఠిరున కిచ్చివేయుము.

దుర్యో—అదియెట్లు జరుగును?

గాంధా...రాజ్యము యుధిష్ఠిరునిదే కదా.

దుర్యో...అదియెట్లులమ్మా!

గాంధా....దుర్యోధనా! నేను నీకు తల్లిని. నేను ఆజ్ఞనొసగుచున్నాను—రాజ్యము యుధిష్ఠిరునకిచ్చి వేయుము.

దుర్యో....కాని నాయనగారు—

గాంధా...మీనాయనగారు వృద్ధులు నంధులును. అనలేదృష్టిహీనతచే సంధులు పుత్రప్రేమచే మఱియు నంధులగుచున్నారు వారియనుమతి కావలయునా? —నేనాజ్ఞాపించుచున్నాను. యుధిష్ఠిరునకు రాజ్యముఇచ్చి వేయుము.

దుర్యో...కాని నాయన గారు— ఎప్పటికిని నాయనగారే

గాంధా—ఇంకతల్లి యెప్పటికిని తల్లి కాదుకాబోలు! అబ్బాయీ! నిన్ను తొమ్మిది నెలలు గర్భమున మోసినదెవరు? పాలిచ్చి నిన్ను పెంచిన దెవరు? దాసివలె నీకు నిరంతరము సేవచేసిన దెవరు?

తంత్రివరా—తల్లియా? అకటా! ఈశ్వరా! వీఁడా పుత్రుఁడు! గర్భవేదనచే మూర్ఛితయగు తల్లి మూర్ఛానంతరము అంధుఁడగు పకీరు బిచ్చములో డబ్బులకు వెదకి కొన్నటుల చేతులు సాచి తన సంతానమునే వెదకికొనును, పుత్రుని ముఖమును జూచి తల్లికి తీవ్రమగు ప్రసవ వేదన కూడ సుఖముగ నుండును ఆపుత్రుఁడు అటు పిమ్మట గూడ కేవలము మాతృ ప్రేమచే తనే పెరిగి పెద్దవాఁడగును. కాని పెద్దవాఁడయిన పిమ్మట తల్లితో తనకేమియు జోక్యము లేనట్లు తలఁచును. తల్లిమాట కేమియు విలువలేదు. అది మోకరిలబడి కన్నుల నీరు పెట్టుకొని చేతులు జోడించుకొని వేడుకొను బిచ్చగాని దుర్బల ప్రార్థన వంటిది. ఓరిమూర్ఖుడా! ఓరీఅజ్ఞానుఁడా! తల్లి నిన్నిప్పుడు కోరుభిక్షకూడ నీమంచికొరకే. తన కొరకు కాదు. కుమారా! యుధిష్ఠిరునకు రాజ్య మిచ్చి వేయుము.

దుర్యో.... ఎప్పటికిని లేదు. అమ్మా! ఇది యెన్నటికిని జరుగదు.

ంధా— ఓరీ మొండిపిల్లవాడా! నేఁడు మదాంధుఁడవై తల్లియాన తిని తిరస్కరింపకుము. నీకు సర్వనాశము గలుగనున్నది.!

శకుని.... పాండవదూతయగు కృష్ణుఁడు అంత్యోత్తరమును పుచ్చుకొని వెళ్ళినాఁడు. అక్కా! ఇంక సంధిచేయుట కుపాయములేదు.

గాంధా— ఉపాయమున్నది. మూర్ఖుడా! ధర్మమార్గమెప్పుడును తెలిసి యుండుము, రాజ్యమిచ్చి వేయుము.

దుర్యో...ఇది నావల్లగాఁజాలదు అమ్మా!

గాంధా— అగుచో పుత్రులున్నను పోయినను సరే. ధర్మమునకే జయమగు గాత! (ప్రస్థానము)

దుర్యో.... ఇదియేమి!

దుశ్శా— ఉరుము చున్నది.

దుర్యో... ఇంటిపై!

(దుర్యోధన భీష్మ ద్రోణులు దక్క అందఱును భయముతో పోవుదురు.)

భీష్మ— దుర్యోధనా! నీమొగము వెల వెలఁ బోవుచున్నదేల? వణఁకెదవేల? ఈసందర్భమున రానున్నదాని విషయమై నీకింకను సంశయమా?

దుర్యో... ఏమి యట్లనెదరు? పితామహా! నేను యుద్ధములో తప్పక జయించెదను. భీష్మద్రోణ కృపాంగ రాజకర్ణాదులు నాపక్షమున నుండగా—

భీష్మ— పాండవుల పక్షమున జనార్దనుఁడు గలఁడు.

దుర్యో... కౌరవుల పక్షమున పదికోట్ల యాదవసైన్యము గలదు.

భీష్మ— కాని పాండవులకు శ్రీకృష్ణుఁడు గలఁడు.

దుర్యో.... ఇచ్చట కొన్ని అక్షౌహిణుల సైన్యము,—

భీష్మ—ఒకవైపున అనేకాక్షౌహిణుల సైన్యమును, రెండవవైపున ధర్మమును, సర్వధర్మములకును మూలమగు జనార్దనుండును గలరు.

"యతోధర్మ స్తతః కృష్ణోయతః కృష్ణస్తతోజయః"

దుర్యో.... ఇదియేటి ఘోరాంధకారము! కాలమేఘము లనంతాకాశము నంతయు నావరించినవి. కడవలతో కుమ్మరించినటుల వానకురియుచున్నది! జయము! పరాజయము! ఇదివీరులజూదమాట- ఇందులో పవిత్రమే పణము—కాదు. కాదు. ప్రాణమేసి యిచ్చెదనుగాని మానము నీయను. ఎవరు? ఓహో! గురువు ద్రోణాచార్యులా! రెప్పయార్పక చూచుచుంటిరేమి?

ద్రోణ—నాయెదుట స్నానమునకై యొకగొప్ప రక్త గంగానది ప్రవహించుటను చూచుచుంటిని. అందులో స్నానముచేసి పాండవులు బయటకువచ్చిరి.

దుర్యో...ఏమిగురుదేవా?

ద్రోణ—భీష్మమహాత్ముని వచనము వింటివా—యతో ధర్మ స్తతః

కృష్ణోయతః కృష్ణస్తతో జయః॥ ఈభీష్మవచన మెన్నటికిని అసత్యము కాదు.

దుర్యో...అయితే పితామహులు కౌరవపక్షమున నేలయుండిరి?

ద్రోణ...భీష్ముని నేనెఱుంగను. కాని భీష్ముని మాట యసత్యము కాదనుట నిశ్చయము.

(దుర్యోధనుడు దక్క అందఱు పోవుదురు.)

దుర్యో—ముందుకు పోయిన కొలఁది అంధకారము మఱియు దట్టమగుచున్నది.—ఎవరు—మామా!

శకుని... (ప్రవేశించి.) ఆఁ నే నే

దుర్యో...సభకు మరల నేలవచ్చితివి మామా?

శకుని—మహారాజా! నేను భవిష్యత్తు చూచితిని.

దుర్యో—ఎవరిది?

శకుని—ఈ యుద్ధమునది. ఈయుద్ధములో నెవరికో యొకరికి జయము తప్పక కలుగును. కాని నాప్రాణమునిచ్చెదను గాని రాజ్యము గొంచెము కూడ నీయనని నీవు చేసిన ప్రతిజ్ఞయు భంగము కాదు. ఇదినిశ్చయమని నేను తెలసి కొంటిని.

దుర్యో....ఎవరు చెప్పిరి?

శకుని....ఇది మేఘశ్యామల పటమున విద్యుదక్షరములతో వ్రాసి యుంచుటను గాంచితిని.

దుర్యో—చూచితివా?

శకుని...ఆఁ చూచితిని. ఏమియు భయములేదు.

దుర్యో—హఠాత్తుగ ఎదురు గాలివీచినది. (ప్రస్థానము.)

శకుని—మూర్ఖుఁడా! నీకు ఏమియు తెలియలేదా? నీవింత యంధుఁడవు! ఈ యుద్ధములో కౌరవకులము నిర్మూలమగును—ఇందులో నాకేమి లాభము? ఏమియు లేదు—సాధారణమగు సంతోషము మాత్రమే. తిన్నయింటి వాసాలు లెక్కపెట్టుటయు తిన్నయింటిని ధ్వంసము చేయుటయు నాకు స్వభావము.

(ప్రస్థానము.)

## ద్వితీయదృశ్యము.

కౌరవరాజాంతఃపురము — సాయంకాలము.

(అంబికా అంబాలికలు పాడుదురు.)

### గీతము.

ఇం-తటిబలము మాయెడఁ దఁగూర్పవమా యీశ్వర! లోకరక్షాకర శ్రీకర,
సంతసమ్ము దరహాస మెసఁగ నీజగము త్యజింౘెద మోహగుణాకర!
బ్రదికి బాముకొను భాగ్యమేమి? జీవన కష్టములు జరానష్టమ్ములు
పదదళితమ్ములు గాగ నేగెదము బళిర! మాకివే వేలభీష్టముల్
వెనుకకు తిరిగియు చూచుకొనము మావితతదుఃఖముల నెవలెక్కించము
ఘనదీనులకు సుఖమ్ముఁగూర్చెదము కలిగిన మానిన చింత వహించము!

అంబి... మంచిపాట.

అంబా— చాల మంచిది.

అంబి.... ఇప్పుడు మన మేమని పాడుదము.

అంబా— ఏమి! విధవలగు మాత్రమున పాటయే పాడకూడదా!

అంబి.... కాని యిప్పుడు నీవు ముసలిదానవైతివి.

అంబా— ఎప్పటి నుండి?

అంబి... అదిమాత్రము తెలియదు. కాని ముసలిదానవైతివి.

అంబా— బాగుగనున్నది!— ముదుసలినైతినఁట. తెలియదఁట. ఇది పెద్ద చిక్కుగా నున్నది.

అంబి... నీవెండ్రుక లన్నియు నెరసినవి.

అంబా— నెరియనిమ్ము. మనస్సు మాత్రము నెరియలేదు. అట్లే యున్నది.

అంబి....ఆమాట నిజమే సోదరీ! మానవసృష్టికి పృథ్వియంతయు నట్లే నూతనముగ నున్నది. జీవితమింతవఱకు మధుమయమగు నొక మధుర స్వప్నము.

అంబా— అది యెంత మధురము గనుకనే వైధవ్యముకూడ ఆ స్వప్నమును బోఁగొట్టఁజాలక పోయెను. మృత్యువుకూడ ప్రాణభయముచే నాస్వప్నమును భంగపఱచఁ గోరలేదు.

అంబి....అంబాలిక యేడ్చును.

అంబా—ఛీ!

సత్య....కౌరవకులము నాశనమగుచో—

అంబా—అంబిక యేడ్చును

అంబి...పోనిమ్ము. నీవలన వచ్చునదేమి పోవునదేమి?

సత్య—ఉభయకులములు నశించుచో—

అంబి.. అత్తా! జీవితముయొక్క చెడుభాగమునే శంకించుకొని యేల వృథా కష్టపెట్టెదవు?

అంబా—ఏడ్వవలసినచో ఏడువవచ్చును. దానికై యిప్పటినుండియు చింతించుట యెందుకు!

అంబి....ప్రపంచములో దుఃఖము నిన్ను పట్టుకొనుటకై తిరుగుచున్నది. దానిని వంచుము— దానినుండి తప్పించుకొనుము.

అంబా—ఇంతే మోసగించుము.

అంబి...దుఃఖమువచ్చి నెత్తిమీదపడినచో—

అంబా—మందహాసముచే దానినియెగురఁగొట్టుము.

అంబి.. వీలైనంతవరకు

అంబా—అంతే,

అంబి.... అదుగో చూడుము సోదరీ! పావురముల గుంపొకటి యెగిరి పోవుచున్నది. చూడు—చూడు!

అంబా— వహ్వా! (ఇద్దఱునుపోవుదురు.)

సత్య....ఈ సుందరమగు హృదయమందలి అనంతయౌవనము వ్యాధి యొక్క జడిపింపులకు జడియదు— దానిని దాసినిగాఁ జేసి కొనును. వార్ధక్యపు దోపిడీతో సంధిచేసికొనును. భయమును నిద్రపుచ్చును. విశ్వమం దానందమయమగు నొకసంగీతమును వ్యాపింపజేయును, దీనిముందు ఈఅనంతయౌవన మెందుకుసరికి వచ్చును. ఈహృదయము శ్మశానమువలె నిరానందమగునపుడు వంగని నడుమును, అశిథిల మగు శరీరమును, దృఢములగు దంతములును, నెఱయని వెండ్రుకలును ఏమిచేయఁ

లవు! మహర్షీ! చాలమంచి వరమిచ్చితివి! విషసర్పమువలె నన్నుచుట్టుకొనియున్నది. నీవరము నీకే తిరిసికొనుము. సుందరీ! ఈ అనంతయౌవనము కారాగృహమునుండి నన్ను విడిపింపుము. ఈ అంతస్సారరహితమగు సుందర జీర్ణభవనము విరిగిపడి పోవును. చూర్ణమయిపోవును. రూపముయొక్క ఈవ్యంగ్యాభినయమును సమాప్తముచేయుము (ప్రస్థానము.)

## తృతీయ దృశ్యము.

(కృష్ణుఁడొంటరిగ నిలుచుండి పాడుచుండును.)

### గీతము

హేలబృందావనపు బూఁబొదరిండ్లనాటిప్రసంగముల్
ఏలనా కీవేళ తలఁపునకెక్కుచుండె సుఖాంగముల్
యమునయొడ్డున నాపచాపలునలరుటెత్తులుగుచ్చుటల్
విమలశారదచంద్రికలమౌనమున ద్వారముసొచ్చుటల్
మోవిఁబిల్లనగ్రోవి మొగమున మొలకనవ్వుల తేటలున్
అలినీల కళిందకన్యక యలరు తరఁగల పాటలున్
దవ్వులకు పరతెంచు నూపురధ్వనులుచక్కగవినబడుఁ
ఆ విచిత్రములన్నియును నేఁడపభవమ్ములనఁగనపడున్

(యుధిష్ఠిరుఁడు మున్నగు పాండవులు ప్రవేశించెదరు.)

కృష్ణు...ఏమిధర్మరాజా! ఈ రాత్రివేళ సపరివారముగ నాయొద్దకేల వచ్చితివి? నీవు నిద్రపోవవు, మఱియొకరిని నిద్రపోనీయవు.

యుధి...నీవు నిద్రపోవుచుంటివా వాసుదేవా?

కృష్ణ—నిద్రపోవుచుంటినో లేదో తెలియదు. కాని యొకస్వప్నము గాంచుచుంటిని. యెంత మధుర స్వప్నము! భగ్నమైపోయెను మంచిది పోనిమ్ము. ఏదియో క్రొత్తకబురు తెచ్చినటులున్నావు.

యుధి...కబురేమియు లేదు.

కృష్ణ—అయితే మఱియెందుకు?

యుధి...సలహాకొఱకు వచ్చితిని.

కృష్ణు—రాత్రియా?

అంబి—అయితే అత్తగారు పైకి పదునాలుగేండ్ల పడుచువలె నుండును కాని లోపల ముసలిదే.

అంబా... మనస్సులో నెప్పుడు నేమి యాలోచించు కొనుచుండునో తెలియదు. తనలో తాను ఎప్పుడు వాగుకొనుచునే యుండును.

అంబి— మఱియేమియు లేదు. ఆమె భీష్మతర్పణము చేయుచుండును.

(సత్యవతి ప్రవేశించును.)

సత్య— అంబికా!

అంబి... (ముందుకు బోయి) ఏమి అత్తగారూ!

సత్య— మీరిద్దఱు నిచ్చట నుంటిరా?

అంబా.... (ముందుకుఁ బోయి) అవును. ఇచ్చటనే యుంటిమి.

సత్య— ఇచ్చట మీరిద్దరు నేమి చేయుచున్నారు?

అంబి... బాల్యచేష్టలు చేయుచున్నాము.

అంబా— మీరెప్పుడు నాలోచించుచుందు రెందుకు అత్తగారూ?

సత్య... నేనెందుకాలోచించు చుంటినా? మీరాలోచించుట లేదా?

అంబా... ఎక్కడ! మాకేమియు తెలియుట లేదు అక్కా! నీకు తెలియుచున్నదా?

అంబి— లేదు-మంచిది. మేము ఆలోచించుటయెందుకు అత్తగారూ

సత్య—ఎందుకా ఆలోచించుట! కౌరవులకును పాండవులకును మహా యుద్ధము వాటిల్లినది. మీ మీ మనుమలు లొకరితో నొకరు ప్రాణము వరకు సేయక యుద్ధము చేయుచున్నారు. ఇంక మీకు ఆలోచించుటకే కనుపట్ట లేదు.

అంబి...ఏదీ? లేదు. అంబాలికా! నీకిందులో నేమేని యాలోచింపదగినది కనుపట్టుచున్నదా?

అంబా...ఏదీ? నాకేమియు తెలియుట లేదు.

సత్య....మీరు మనస్సులో మీ మీ మనుమలకు జయమభిలషించుచుంటిరా?

ఇద్దఱు—జ్ఞాపకము వచ్చుట లేదు.

సత్య... మంచిది మీ మనుమలకు ఘోరయుద్ధము జరుగుచున్న సం

గతి మీకిప్పుడు తెలిసియుండును.

ఇద్దరు...ఆఁ తెలసినది.

సత్య...ఈయుద్ధములో మీరేపక్షమునకు జయముకోరుచుంటిరి?

ఇద్దరు....ఉభయపక్షములకు.

సత్య....హాంశి! ఉభయపక్షములకు నెక్కడనేని జయము కల్గునా!

అంబి...ఎందుకు కలుగదు?

అంబా...చెప్పుడు.

సత్య...ఈయుద్ధములో కౌరవ పాండవులలో నెవ్వరోయొకరు నిర్మూలమయి పోదురు. మీకీవిషయమై చింత లేదా?

అంబి...ఎక్కడకి నీకున్నదా చెల్లెలా!

అంబా...బొత్తుగా లేదు.

అంబి....కానున్నది యగును...ఏమి చెల్లెలా!

అంబా—చింతించుటచే నేమిలాభము? ఏమి అక్కా!

సత్య.... బహుశః రెండువంశములును నిర్మూలములగును.

అంబి— ఇదియును కావచ్చును. ఏమి చెల్లెలా?

అంబా... కాకేమి?

సత్య— మృత్యుసహచరములును, కృష్ణవర్ణములు నగు ప్రేతములు తమ నిమపుకాళ్ళతో రణభూమియందలి దుర్గంధ వాయువునందు తిరుగుచుండును.

అంబి...తెలియుటలేదు. సోదరీ! నీకేమైన తెలిసినదా?

అంబా...లేదు. చాలకఠిన సంస్కృతములో చెప్పఁబడినది.

సత్య—మీరు మనస్సులో నేపక్షమునకు జయముకోరుచున్నారు?

అంబి....ఉభయపక్షములకు జయము కలుగదా?

సత్య...లేదు. ఒకపక్షమునకే కలుగును.

అంబా...జయము సమానముగ నుండదా?

సత్య...లేదు.

అంబి...అగుచో అంబాలికా పౌత్రులకే జయము గాక

సత్య...ఇదియేమి! పాండవకులము నాశనమగుచో—

యుధి.... మీయుపదేశము గోరుచున్నాను.

కృష్ణు...ఉపదేశము గోరుచుంటివా?—ఏవిషయమున? నేను ఉప
దేశము బాగుగ నీయఁగలను.

యుధి...వాసుదేవా! భీష్మపితామహుని యొక్కనిచే పాండవ సైన్య
మంతయు నాశనమగుచున్నది.

కృష్ణు...పాండవ సైన్యము నిత్యము తరిగిపోవుచున్నమాట సత్యము

యుధి.... ఈయుద్ధములో మాకు గెలిచెదమను నాశలేదు.

కృష్ణు.... ఇప్పటిస్థితి చూడగ నట్లేయున్నది.

భీముఁడు—తుదకు నీవును ఈమాటయే చెప్పుచుంటివా వాసుదేవా?

కృష్ణ—చెప్పక యేమిచేయుదు. నీవు పెద్దభీరుఁడవు కాబోలు? నీగద
యెచ్చటనున్నది? ఏమియూరకుంటివి? గదాధరా! దుశ్శాస
నుని రక్తమును త్రాగెదవా? త్రాగుము. అర్జునా! నీవు ఖాండ
వవనము గాల్చితివి. విరాటుని యుద్ధములో నెల్లర నోడించితివి
నీగాండీవమిపుడు నిద్రపోవుచున్నదా?

భీము...ఈసమయమున నిట్టిపరిహాసము బాగుగనుండదు వాసుదేవా!

కృష్ణు—బాగుగానుండు పరిహాస మన్ని వేళల తోఁచుచుండదు.
ఏమినకుల సహదేవులారా! ఒకమూల కూర్చుండి కన్నులుదిం
పుకొని నావంక కేల చూచుచుంటిరి?

యుధి...మిత్రమా! ఇపుడు దీనికుపాయమేమో చెప్పుము. ఉపదేశ
మొసఁగుము.

కృష్ణు....అదియే ఆలోచించుచుంటిని. సహదేవా! నాపిల్లనగ్రోవి యీ
టు తెమ్ము.

యుధి—పిల్లనగ్రోవి యెందుకు?

కృష్ణు—వాయించి చాలరోజులయినది. కొంచము తీసికొనితమ్ము.

యుధి...అది యిప్పుడు—

కృష్ణు—కొంచెము మనస్సు శాంతపఱచుకొననిమ్ము.

(కృష్ణుఁడు వేణువు వాయించుచున్నాఁడు)

నకులుఁడు—పిల్లనగ్రోవి ప్రారంభించితివా!

సహ—ఈవ్యవహారమునకును పిల్లనగ్రోవికిని సంబంధమేకనఁబడుటలేదు.

కృష్ణ—(వేణువు క్రిందనుంచి గంభీరభావముతో) యుధిష్ఠిరా! భీష్ముడు బ్రతికియుండగా ఈపక్షము జయించునను ఆశలేదు. ఇంక నేను ద్వారకకు వెళ్లుదునా?

సహ...ఔరా! పోట్లాట కల్పించి తనకిక జారుటకు ప్రయాణమా?

నకు—దీనినే చెట్టు నెక్కనిచ్చి నిచ్చెన లాగివేయుట యందురు

యుధి—కృష్ణా! ఈఘోరవిపత్తిలో మాకు నీవొక్కరుఁడవే యాధారము.

కృష్ణ....నే నేమి చేయుదును? ఈయుద్ధములో శస్త్రము పట్టనని నేను ప్రతిజ్ఞచేసియుంటిని. నా యాదవసైన్యమంతయు శత్రుపక్షమున నున్నది. అర్జునుఁడు మనఃపూర్తిగా యుద్ధము చేయుటలేదు. నే నేమి చేయుదును?

యుధి—అర్జునుఁడు మనఃపూర్తిగా యుద్ధముచేయుటలేదా?

కృష్ణ—లేదు. యుద్ధభూమిలో సారథిగానుండుటకే నే నియ్యకొంటిని. కాని నేనతనికంటె నెక్కువ పని చేయుచున్నాను.

భీమ—ఏమిచేయుచున్నావు బూడిద!

కృష్ణ—చేయుటలేదా! యుద్ధప్రారంభమున యుద్ధభూమిలో మూడుగంటలసేపు అర్జునునకు కర్తవ్యముపదేశించితిని. ఉపదేశమొసఁగు షరతు లేకున్నను అట్లుచేసితిని. కాని నాఉపదేశమంతయు వ్యర్థమయ్యెను. అర్జునునిలో ప్రాణమే లేనట్టును, కాళ్ళుచేతులు చల్లపడినట్లును అయ్యెను. బాణము వేయును, కాని వెంటనే నల్లమందు తిన్నవానివలె నావలించును. అర్జునుఁడు మనఃపూర్తిగ యుద్ధము చేయుచో—ఇంద్రునివలన అస్త్రశిక్షయు, శంకరునివలన పాశుపతమును బడసిన అర్జునుఁడు—శస్త్రశిక్షాబ్రహ్మచారియగు అర్జునుఁడు ధ్యానముంచుచో జయము గుప్పిటనున్నది. కాని యతఁడు యుద్ధక్షేత్రమున బాహుయుద్ధమును మాని వాగ్యుద్ధము నుజేయుచో—ఇంక నాకు సెలవింపు.

యుధి...అర్జునా! నీవు మనఃపూర్తిగ యుద్ధము చేయుటలేదా?

అర్జు—అన్నా! నేనేమి చేయుదును? బంధువర్గమును, గురుజనమును జంపుటకు నాకు చేతులు లేవవు, హృదయము విషాదముచే శిథిలమగును. నేనేమి చేయుదును అన్నా!

కృష్ణు...చేతులెత్తుము. హృదయము దృఢముచేసికొనుము.

యుధి—(కాతరభావముతో) అర్జునా!

కృష్ణ—అర్జునుఁడు మాత్రమేమి చేయును. యుద్ధప్రారంభమున నీవే తర్కము జేసి యితని యుత్సాహమును శాంతింపఁ జేసితివి. జ్ఞాతింధ యని అరచి గంద్రగోళము చేసితివి. ఎవ్వరికేది లభ్యము కావలయునో, ఎవ్వరివిషయమై ఎవ్వరేమి చేయవలయునో నేను చెప్పెదను. విచారణచేయుటకు మీరెవరు? అర్జునుఁడు పూనుకొనినచో భీష్మవధ యెంతపని?

అర్జు...భీష్మపితామహుఁడు స్వచ్ఛంద మరణుఁడు.

కృష్ణ—ఇంకనేమి! చక్కగానిద్రపొమ్ము—వాదము జేయకు మర్జునా నీకర్తవ్యమును నీవుచేయుము. క్షాత్రధర్మమును పాలించుము. తక్కినభారము నేనువహించెదను.

యుధి....(అనునయముతో) అర్జునా!

అర్జు...మంచిది అన్నా! అట్లేచేసెదను.

కృష్ణ—భీష్ముని స్వచ్ఛందమృతికి తగినఉపాయము చేసెదను. రమ్ము యుధిష్ఠిరా! నీ వొక్కపని చేయవలయును. మంచిది చేయవలసినపని తర్వాతచెప్పెదను. ఇప్పుడు మీరుపొండు. (కృష్ణుడు దక్క అందఱుపోదురు. కృష్ణుడు వేణువు వాయించును.)

(వ్యాసుని ప్రవేశము.)

కృష్ణ—ఎవ్వరు? వ్యాసమహర్షియా? పాదములకు నమస్కారము.

వ్యాస...పరమేశ్వరా! ఎవ్వఁడు ఎవనకినమస్కరింపుచున్నాడు? ప్రభూ నీలీలలు తెలిసికొనుట కష్టము. (నమస్కరించును) మాయ! మాయ! నారాయణా! భవిష్యత్కాల జ్ఞానము లేని మానవులు నీపదాంకములు ననుసరింపుచో ఈపృథ్వి మాయాజాల

ముచే తప్పించబడును.

కృష్ణు...జాగ్రత్త! మానవా! ఈమానవజాతి సీమబద్ధము. ఈశ్వరుఁడు అసీముడు. ఉభయులధర్మము భిన్నమైనది. మానవా! నేను విశ్వములో మనుష్యకతంగ కీటాదులహత్యల నెన్ని చేయుచున్నానో నీవేమి యెఱుఁగుదువు? మేక మనుష్యుల కాహారము. కప్ప పామునకు భోజనము. పురుగులు బల్లికి భక్ష్యములు. జీవమే జీవమునకు జీవనము. ఈబ్రహ్మాండములో ఆత్మరక్షణకై నిత్యము ఘోర సంగ్రామము జరుగుచున్నది. ఇదియే ఈశ్వరుని పని.

వ్యాస....ఎందుకు?

కృష్ణు....జాగ్రత్త! ఆమహోద్దేశ్యము మనుష్యున కవేద్యము.

వ్యాస—మనుష్యుఁడు దానికిబాహ్యుఁడా?

కృష్ణు...ఎప్పటికిని కాదు. వ్యాసా! ఈమహాసంగ్రామములో మనుష్యుడొక్కరుఁడే స్వార్థత్యాగము చేయుటకు సమర్థుఁడు వానికివెలుపలస్వార్థప్రసారము కలదు. బాహ్యము బాహ్యముతో యుద్ధము చేయుచుండును. ఇదిగాక అంతరంగమున నేను మఱియొకయుద్ధమును గల్పించితిని, అది తనప్రవృత్తితో తనప్రవృత్తియే యుద్ధము సేయుట. బ్రహ్మాండములో సర్వము నేనే. దాని సారాంశము మనుష్యుడు. పాలలోని నెయ్యి మనుష్యుఁడు. ఈ వృక్షముయొక్క కోమల పుష్పము మనుష్యుఁడు. వ్యాసా ఈసృష్టినాదే. మనుష్యుఁడు యథార్థముగ మనుష్యుఁడగుచో వాఁడు ఈశ్వరునికన్న గొప్పవాఁడు కాఁజాలును.

వ్యాస—ఇదియెట్లు నారాయణా! ఈశ్వరునికన్న మనుష్యుఁడు గొప్పవాఁడు కాఁజాలునా!!!

కృష్ణు....తప్పకగల్గును. అయితే ఆమనుష్యుఁడు యథార్థమనుష్యుడు కావలయును.

వ్యాస—ఇదియేమి శ్రీకృష్ణా! నీకన్నులలో నశ్రుజలమున్నవి, పెదవులపై చిఱునవ్వును!

కృష్ణ—ఏందుకా ధ్యానమహర్షీ! వేణువు వాయించుదునా?

(వేణువు వాయించును.)

చతుర్థదృశ్యము.

స్థానము—కురుక్షేత్రము. సమయము—రాత్రి.

(భీష్ముఁడు ఒంటరిగా నిలచియుండును.)

భీష్మ....శూన్య జీవితమిప్పుడు బాగుగ నుండుట లేదు. ఆనాఁటి కా నాఁడు ఆయువు క్షీణించుకొని వచ్చుచున్నది. సహచరులు బంధువులు అనుచరులు మున్నగువారు ఒక్కరొక్కరుగ కాలసముద్రమున మునుగుటను గాంచితిని శైథిల్యభారమున కుంగుచు విగతవైభవుఁడనై నేను కాల ప్రవాహమున శీర్ణ పర్యవసానమును గ్రహించి కొట్టుకొని పోవుచున్నాను! జీవిత కర్మక్షేత్రమున క్రమముగ నంధకారము వ్యాపించుచున్నది. హిమావృతంబగు హిమాలయమువంటి జీవితశిఖరమున నిలఁబడి భూతకాల శిఖరానన్న భూమిని గాంచు చుంటిని. శూన్య—శూన్య జీవితమిప్పుడు బాగుగ నుండుటలేదు.

(గాంధారియు, కుంతియు, ప్రవేశించెదరు.)

భీష్మ...ఎవ్వరు? కుంతీ!

(ఇద్దఱును నమస్కరించెదరు.)

భీష్మ...కుంతీ! ఏమి సమాచారము? పాండవులు కుశలమా!

కుంతి...అదియే కుశలము నేఁడు నాపుత్రులుత్సాహశూన్యులును భయాకులులును, నిర్జీవులు నగుచున్నారు.

భీష్మ...ఏమి అమ్మా?

కుంతి—యుధిష్ఠిరుఁడు జయాశను వదలి మరల అడవికి ప్రయాణమగుచున్నాఁడు.

భీష్మ....ఎందుకు? శ్రీకృష్ణుఁడు తన పక్షమున నుండ నతనికి భయమెందుకు? కుంతీ! మహర్షులుకూడ నిరంతరము చరణ కమలముల ధ్యానము చేయుచుండియు నర్వాణిని పొందఁజాలరో అట్టి శ్రీకృష్ణుఁడు. తన స్నేహపాశమున బద్ధుఁడయియుండ

అతనికి జయమెట్లు లేదమ్మా!

కుంతి—దేవా! జయమెట్లు కలుగును? ఈ తొమ్మిది రోజుల యుద్ధమునకే పాండవులసేన సగము నశించినది. మిగిలినదికూడ అర్థార్థముచే శిథిలమగుచున్నది. ఈసేన మీనిశిత శరధారలముందు ఎన్నిరోజులు నిలువఁగలదు? మేము యుద్ధములో జయము గోరుటలేదు. మరల నడవికి వెళ్ళుచున్నాము. అందుకనియే నేను అక్కగారగు గాంధారిని కలిసియువచ్చితిని.

భీష్మ...నీపుత్రుఁడగు అర్జునుఁడు మహావీరుఁడు.

కుంతి....అర్జునుని వంటి నూర్గురు వీరులును ఒకభీష్మునికి సరిరారు. ఒక అర్జునుఁడేమి చేయఁగలఁడు?

గాంధా...మీరు గొప్ప బుద్ధిశాలురు. మీరు దుర్యోధనుని పక్షము విడువుఁడు.

భీష్మ...అదియెట్లు గాంధారీ?

గాంధా....ఎఱుఁగుదును. మీరుకౌరవులకు పితామహులగునట్లే పాండవులకును అగుదురు. యుద్ధములో ఒకమనుమల పక్షమునుండి రెండవమనుమలపై బాణము బ్రయోగించుట భీష్మునకు సరిగాదు. మీరు దుర్యోధనుని పక్షము విడువుఁడు.

భీష్మ— ఇది నావల్లకాఁజాలదు గాంధారీ! దుర్యోధనుఁడురాజు. నేను ప్రజను. రాజునకాపత్కాలమునసాయము చేయుట ప్రజకు కర్తవ్యము.

గాంధా... దుర్యోధనుఁడు రాజుకాఁడు. వాడు ఇతరుల అధికారమును హరించిన దొంగ. ఇతరుల సంపత్తిని హరించి సింహాసనమున కూర్చుండినమాత్రమున నెవ్వఁడును రాజు కాఁజాలదు దేవా!

భీష్మ— అది యేమి గాంధారీ? దుర్యోధనుఁడు నీపుత్రుఁడు.

గాంధా... అవును. దుర్యోధనుఁడు నాకొడుకు. అయ్యా! తల్లికి పుత్రుఁ డెట్టివాఁడో మీరెఱుఁగుదురా? అతఁడామె శరీరమునకు బలము, కనులకు జ్యోతి, అంధునకు చేతికఱ్ఱ, రోగికౌషధము, ఆసన్నమరణునికి రామనామము. అతఁడామె జీవితము పు

కర్మభూమికి సెలయేరు. సంసారసాగరమును దాటుటకు నావ. ఈజన్మములోని సర్వస్వము. పరలోకమున ఆశ, జన్మజన్మాంతరములందలి పుణ్యరాశి. అతఁడు ఆమెకు వేదనా సమయమున సఖుఁడు, శోకసమయమున సాంత్వన, దీనావస్థయందు భిక్ష, నిరాశాసమయమున ధైర్యము. దుర్యోధనుఁడు నాకు పుత్రుఁడే కాని యాపుత్రుఁడే సత్యన్యాయధర్మవివేకములను తప్పునాఁడు నాకేమియుఁ గాఁడు. ఆనాపుత్రుఁడే సింహాసనమునఁ గూర్చుండి అన్యాయమను రాజదండము గ్రహించి పృథ్విని దుర్నీతితో పరిపాలించు నాఁడు నాకేమియుఁ గాఁడు. ఆనాపుత్రుఁడే రాజ్యమున అశాంతియు, అరాజకత్వమును, నిరంకుశతయు, అన్యాయమును వ్యాపింపఁ జేయు నాఁడు అయ్యా! మీకు నేనేమని చెప్పుదును—అగ్నిహత్య చేసికొనవలె ననిపించును. బాల్యమునందే విషముపెట్టి వీని నెందుకు చంపితిని కాదాయని విచారముగల్గును. అయ్యా! నేను దుర్యోధనుని తల్లినే. మీరు దుర్యోధనుని పక్షము విడువుఁడని ప్రార్థింపుచున్నాను.

భీష్మ— కాని గాంధారీ! నేనాతని యన్నము కుడిచితిని.

గాంధా... ఇంతమాత్రమా! ఈసామ్రాజ్యము దుర్యోధనునిది కాదు. దుర్యోధనుని తండ్రిది కాదు. ఈసామ్రాజ్యము భీష్మునిది— దుర్యోధనుని యన్నము మీరు కుడిచితిరా? కాదు దుర్యోధనుఁడే నేటిదనుక మీవలనచే లభ్యమగు అన్నముదినుచున్నాఁడు—పోషించు. మీమాటయే నిజమగుచో అన్నదాత హత్యచేయుట కాదేశించిన మీరు చేసెదరా?

భీష్మ— ఇది హత్యయా!

గాంధా... అవును. ఇది హత్య. ఇది ఒకహత్యయే కాదు. సహస్రహత్యల సముదాయము. యుద్ధమును మీరు పెట్టిన మాత్రమున హత్య హత్య కాదా? మహారాజా! పాండుపుత్రులు జీవనోపాధికై అయిదుగ్రామములు మాత్రమడుగగా మహాంధుఁడవు

దుర్యోధనుఁడు యుద్ధముచేయక సూదిమొనయంత భూమియు నొసఁగననియె. అధర్మపూర్ణమగు స్వేచ్ఛాచారమును ధర్మవిదులగు భీష్ములు తమబాహుబలముచే ప్రచారము చేయుచున్నారు.

భీష్మ— గాంధారీ! ఇది అన్యాయమని యెఱుఁగుదును. కాని ఆపత్సమయమున నేను రాజపక్షమును విడువఁజాలను. భీష్ముఁడు తనజీవితములో కృతఘ్నుఁడు కాఁజాలఁడు.

గాంధా... కుంతీ! ఇది అరణ్యరోదనము. భీష్మదేవుఁడెంతయు రాజభక్తుఁడు. కర్తవ్యమునకై తల్లి కొడుకును విడువఁగలదు. కాని భీష్మదేవుఁడు రాజును విడువఁజాలఁడు. రమ్ము సోదరీ! (వెళ్ళబోవుదురు.)

భీష్మ... ఆగుఁడు.

(ఇద్దఱును ఆగుదురు.)

భీష్మ— వద్దు. వెళ్ళుఁడు.

(గాంధారియు కుంతియు వెళ్ళుదురు. భీష్ముఁడచ్చటనే తిరుగుచుండును.)

భీష్మ... ఆగుచో నింకనది యే యగుగాక— ఆత్మహత్య చేయుట పాపము. అయినను నేనా పాపము చేసెదను. ఈధరాతలమున ధర్మరాజ్యమును స్థాపించుటకు నేను నరకమునకు పోదును. నిజముగ నేను అధర్మపక్షమున నున్నాను. కాని రాజభక్తిని, కృతజ్ఞతను విడువఁజాలను. చాలసంకటముగ నున్నది! నేను స్వచ్ఛంద మరణుఁడనగుట కూడ అన్యాయము. అయితే యీవిధమున తనమృత్యువును పిలుచుకొనుట ఆత్మహత్య కాదా అది యేయగుఁగాక— ఎవ్వరచటను? ఆధారమూర్తి యెవరు!

ఛాయామూర్తి— ప్రతిహింస

భీష్మ... ప్రతిహింసయా!

ఛాయా— భీష్మా! రేపుసి శత్రువుచే నాప్రతిహింస పూర్తియగును.

భీష్మ— ఎట్లు? ఎక్కడకు పోదువు! నామృత్యుసమాచారమును చె

ప్పము. చేకష్టము.

భాయా... రేపు మరల కురుక్షేత్రపు మైదానమున నన్ను చూచెదవు
(అదృశ్యమగును)

భీష్మ— మూర్తి అంధకారమున లీనమయినది. ఆశ్చర్యము! మంచి
డి. ఇంక శంకలేదు.

(కౌరవుల ప్రవేశము.)

దుర్యో... పితామహా!

భీష్మ— (ఉలికిపడి) ఎవ్వరు? కౌరవా! ఏమి సమాచారము?

దుర్యో... పితామహా! నీపరాక్రమము నిర్వక్రము. పాండవులురణభూ
మినిడిచి పాఱిపోవుచున్నారు. అదుగో వారిపలాయనధ్వని వి
నంబడుచున్నది.

భీష్మ— అబ్బాయీ! అదిపలాయన ధ్వనికాదు అదిపాండవుల ఉల్లాస
పూర్ణమగు ఉత్సవకోలాహలము.

దుశ్శా.... ఉత్సవ కోలాహలమా!

భీష్మ— అది పదవనాడు భీష్ముఁడు యుద్ధమునఁగూలుటను సూచింపు
చున్నది.

దుర్యో... యుద్ధమున భీష్ముఁడు గూలుటయా!

భీష్మ— దుర్యోధనా! నేఁడు తుదిసారి చెప్పుచున్నాను. యుద్ధము నిలి
పి వేయుము. ఇంకను సమయమున్నది. లేనిచో ఈయుద్ధమున
కౌరవకులము నిర్మూలమగుటతప్పదు.

శకుని...భీష్ముని మాట యెప్పుడును అసత్యముకాదు.

దుశ్శా... మామా!

శకుని— విజయలక్ష్మి యెంతయు చంచల.

భీష్మ...అబ్బాయీ! తుదిసారి చెప్పుచున్నాను. యుద్ధమాపి వేయుము.

దుర్యో— ఎన్నటికిని కాదు. పితామహా! ప్రాణములిచ్చెదముగాని
కౌరవుల మర్యాదను పోనీయను.

భీష్మ...దైవేచ్ఛయిటులున్నది. మనుష్య మాత్రుఁడనగు నేనేమిచేయ
గలను! నేను భవిష్యత్తును జూచుచున్నాను. నేఁడీ కురుక్షేత్ర

ముచే కప్పఁబడును.

కృష్ణ...జాగ్రత్త! మానవా! మీమానవజాతి సీమబద్ధము. ఈశ్వరుఁడు అసీముడు ఉభయులధర్మము భిన్నమైనది. మానవా! నేను విశ్వములో మనుష్యపతంగ కీటాదులహత్యల నెన్ని చేయుచున్నానో నీవేమి యెఱుఁగుదువు? మేకమనుష్యుల కాహారము. కప్ప పామునకు భోజనము. పురుగులు బల్లికిభక్ష్యములు. జీవమే జీవమునకు జీవనము. ఈబ్రహ్మాండములో ఆత్మరక్షణకై నిత్యము ఘోర సంగ్రామము జరుగుచున్నది. ఇదియే ఈశ్వరుని పని.

వ్యాస....ఎందుకు?

కృష్ణ....జాగ్రత్త! ఆమహోద్దేశ్యము మనుష్యున కవేద్యము.

వ్యాస—మనుష్యుఁడు దానికిబాహ్యుఁడా?

కృష్ణ...ఎప్పటికినికాదు వ్యాసా! ఈమహాసంగ్రామములో మనుష్యుఁడొక్కరుఁడే స్వార్థత్యాగము చేయుటకు సమర్థుఁడు వానికి వలుపస్వార్థపరిహారము కలదు. బాహ్యము బాహ్యముతో యుద్ధము చేయుచుండును. ఇదిగాక అంతరంగమున నేను మఱియొకయుద్ధమును గల్పించితిని, అది తనప్రవృత్తితో తనప్రవృత్తియే యుద్ధము నేయుట. బ్రహ్మాండములో సర్వము నేనే. దాని సారాంశము మనుష్యుఁడు. పాలలోని నెయ్యి మనుష్యుఁడు. ఈ వృక్షముయొక్క కోమల పుష్పము మనుష్యుఁడు. వ్యాసా ఈసృష్టినాదే. మనుష్యుఁడు యథార్థముగ మనుష్యుఁడగుచో వాఁడు ఈశ్వరునికన్న గొప్పవాఁడు కాఁజాలును

వ్యాస— ఇదియెట్లు నారాయణా! ఈశ్వరునికన్న మనుష్యుఁడు గొప్పవాఁడు కాఁజాలునా!!!

కృష్ణ ...తప్పకగల్గును. అయితే ఆమనుష్యుఁడు యథార్థమనుష్యుఁడు కావలయును.

వ్యాస—ఇదియేమి శ్రీకృష్ణా! నీకన్నులలో నశ్రుజలమున్ను, పెదవులపై చిఱునవ్వును!

నాకన్నుల నీరుగమ్ముచున్నది. భక్తా! పురుషోత్తమా! పుణ్యశ్లోకా! మహాభాగా! వీరవరా! శౌరీ! ఆదర్శత్యాగీ! నిన్ను పాపము స్పృశించునా? దానికంత సాహసమా? చూడుము ఆపాపము నీమహిమచే నీపాదముల క్రిందపడి కరిగి పోవుచున్నది.

పంచమ దృశ్యము.

స్థానము— యుద్ధరంగము. సమయము. ప్రదోషకాలము

(కృష్ణార్జునులును శిఖండియు ప్రవేశించెదరు.)

కృష్ణుడు....అర్జునా! యేమి చూచుచుంటివి? సమర భూమియందు విస్మయముచే స్తంభితుడ వైతివేల? రథమధిష్ఠింపుము, యుద్ధముచేయుము

అర్జున....కృష్ణా! ఎట్టిఆశ్చర్యము! ఇటుచూడుము.

కృష్ణ. ఏమి అర్జునా!

అర్జు—ఇట్టి యుద్ధమును. నీవెప్పుడేని చూచితివా వాసుదేవా? అదుగో చూడుము భీష్మ కార్ముక నిర్ముక్తంబులగు బాణంబులు ప్రళయ మేఘంబుల పగిది సూర్యకిరణంబులఁ గప్పివేసినవి. ఇదుగో చూడుము! మెరుపువలె కత్తి మెరయుచున్నది. ఒక్క భీష్ముడు నూర్గురు భీష్ములవలె యుద్ధము చేయుచు శత్రుహృదయముల వజ్రములవంటి బాణములు నాటుచున్నాఁడు. వేలకొలఁది యోద్ధలొక్కమ్మడి ఆయనను గవిసియు నిమేషమాత్రమున నిహతులై నేలగూలుచున్నారు అవిగో సహస్రభేరీ భాంకారములును రణకోలాహలములును, ఆర్తనాదములును దిక్కులు పిక్కటిలఁ జేయుచున్నవి. హయహేషలును, కరిబృంహితములను జీల్చుకొనుచు భీష్ముని ధనుష్టంకారము మాఱు మ్రోగుచున్నది. భీష్ముఁడిట్టి యుద్ధము చేయుటను నేనెప్పుడును చూడలేదు

కృష్ణ....అర్జునా! నిజముగా నిది చాల వింతగానున్నది.

అర్జు...అదుగో చూడుము. పాండవసేన పాఱిపోవుచున్నది. మేఘము వెంట పవను డట్లు దాని వెనుక భీష్ముఁడొక్కరుఁడును తన

యారదమును పరుగెత్తించుచున్నాఁడు. ఉత్సాహముచే నాయన కణము రెట్టింపు పెరిగినది. ధనువును గట్టిగా పిడికిట బిగియఁబట్టి పాదముల బాగుగా మోపియున్నాఁడు వృద్ధశరీరమున చెమ్మటవడిగా కారుచున్నది. పెదవులను కరుచుచున్నాఁడు. సాక్షాత్తు మృత్యుస్వరూప మాయనయందు కనుపట్టుచున్నది. నేత్రములయందు ప్రళయజ్వాల వెడలుచున్నది. ఈయన వృద్ధ భీష్ముఁడా లేక వజ్రపాణి యగు ఇంద్రుఁడా! పితామహా! ధన్యుఁడవు ఏమి యుద్ధము! ఏమియుల్లాసము! ఈనాటి భీష్ముఁడు పూర్వపు భీష్మునికన్న విక్రమమున మించినవాఁడు.

తెరలో—పాహిపాండు. పాహిపాండు.

(ధనుర్బాణములు ధరించి యుధిష్ఠిరుఁడు ప్రవేశించును.)

యుధి—అర్జునా! నీవిచట నిలఁబడి యుంటివా!

కృష్ణ....ఏమియు ననకుము అర్జునుఁడు యుద్ధదృశ్యమును చాల బాగుగాఁ జూచుచున్నాఁడు.

యుధి....అర్జునా! అర్జునా!

అర్జు....(ఉలికిపడి) అన్నా!

యుధి—ఇచ్చట దేనికి నిలఁబడితివి?

అర్జు....ఇంచుక విశ్రమించుటకు.

యుధి...ఇచ్చట పాండవసేనా సంహార మగుచున్నది.

తెరలో...పాహిపాండు. పాహిపాండు.

యుధి—ఆయార్తనాదము వినుము అటుచూడుము. భీష్మ పితామహుఁడు రథచక్రములు ధ్వనిచేయ శత్రుహృదయముల గజగజవణికింపుచు విజయోల్లాసముచే పిడుగువలె ఈదిక్కునకే వచ్చుచున్నాఁడు. అర్జునా! యుద్ధమునకు సాగుము.

అర్జు...ఇదుగో యుద్ధమునకు వెళ్ళుచున్నాను. ఏమియుభయము లేదు

కృష్ణ....అర్జునా! కనులు తెరచితివా!

అర్జు...నేడిక భీష్మార్జునుల మహాసమరమున ప్రళయము రానున్నది. సారథీ! రథమునడుపుము.

కృష్ణ...శిఖండీ! నీవు అర్జునునికి ముందుండుము.

దృశ్య పరివర్తనము.

స్థానము—యుద్ధభూమిలో నొకభాగము.

(భీష్ముఁడు యుద్ధవేషమున నుండును.)

భీష్మ...ఇది శిఖండి బాణములు గావు. నాహృదయమున వజ్రములవలె నాటుకొనునివి అర్జుని బాణములు. అర్జునా! నీవు వేయఁజాలిన బాణములు వేయుము. నేను నాత్రోయ్మ్న తె అచి యుంచితిని. నేఁడంతయు సమాప్తమగును—సారధీ! రథమును యుద్ధమధ్యమునకు గొంపొమ్ము. భీష్ముఁడంతటి సమత్రముననే యుద్ధభూమిని వ్రాలును. ప్రపంచమంతయు చూచుఁగాక.

—౦—

షష్ఠ దృశ్యము.

స్థానము. కౌరవుల యంతఃపురము. సమయము, సంధ్యాకాలము

(అంబికాఅంబాలికలు మాటలాడుచు నుందురు.)

అంబి—పదిరోజులనుండి నిరంతరాయముగ సాంపరాయము జరుగుచున్నను విజయలక్ష్మి మౌనమువహించి కూర్చున్నది.

అంబా...నిద్రపోవుచున్నటులున్నది.

అంబి....కలగనుచున్నది

అంబా...గుఱ్ఱుకొట్టుచున్నది.

అంబి...భీష్ముఁడు యుద్ధము చేయుచున్నాఁడా!

అంబా—చేయక మరియేమి చేయుచున్నాఁడు?

అంబి...పది దినములనుండి ఎడతెంపులేక యుద్ధముచేయుచున్నాడా?

అంబా...ఆఁ చేయుచున్నాఁడు.

అంబి—ఈ ముసలాయన అమరుఁడగుట యెఱింగి వీరు ఆయనచే చాలపని చేయించుచున్నారు.

అంబా—అమరుఁడెట్లు? భీష్ముఁడమరుఁడెట్లు?

అంబి ..అమరుఁడన్న మాటయే.

అంబా....అమరుఁడా? లేక స్వచ్ఛందమరణుఁడా?

అంబి—ఎట్లయిన నొకకు బుద్ధిపూర్వకముగ ఎవ్వడు తనకు చావుకోరును?

అంబా. .నిజము అక్కా! బుద్ధిపూర్వకముగ ఈమనోహర ప్రపంచమును ఎవ్వఁడు విడువఁగోరును?

(వ్యాకుల భావముతో వెంట్రుకలు విరియఁబోసికొని గాంధారి ప్రవేశించును.)

గాంధారి....వింటిరా అమ్మా?

అంబికాంబాలికలు.. ఏమి! అమ్మాయీ!

గాంధా—ఈదారుణ సంగ్రామమున నేఁడు భీష్ముఁడు పడిపోయెను
(అంబికాంబాలికలు శిలా ప్రతిమలవలె నిలఁబడుదురు)

గాంధా.. ఏమమ్మా! మెదలక శిలాప్రతిమలువలె నిలబడినారింకను చూచుచుంటిరేమి? ఏడ్వరేమి? ఏడ్వుడు— నేనును మీతో ఏడ్చెదను. నాకు ఏడ్పువచ్చుటలేదు. ఎవ్వరోనాగొంతు పిసికినట్లులున్నది. ఏడ్వుడమ్మా

అంబి—గాంధారీ!

గాంధా—ఏమి! ఆగితివేమి! చెప్పుము! ఏడ్వుము. ఏమి! మరలనేడ్వవేమి! (అంబాలికతో) ఏమి! పెదవులు చప్పరించుచుంటివి. ఏమి చెప్పుచుంటివి? బిగ్గరగా! ఇంకబిగ్గరగా! ఈప్రళయపు తుపానులో నాకేమియు వినిపించుటలేదు. ఇంకను బిగ్గరగా.

అంబా...భీష్ముకు పడిపోయెనా? పృథ్విపై భీష్ముఁడు లేడా?

గాంధా....ఉన్నాడు—యుద్ధభూమిని శరశయ్యపైఁబడి ఉత్తరాయణము నిరీక్షించుచున్నాఁడు. అంతదనుక మృత్యువాయనను స్పృశించుటకు సాహసించలేదు దూరముగ నిలబడి యున్నది. కాని తర్వాతయేమియగును?

అంబా....తర్వాత ఏమియగును?

గాంధా...తెలియదు. భీష్ముని మరణానంతర మేమి కానున్నదో తెలియదు. ఈఆకాశమిటులే నీలముగ నుండునా? మనుష్యులు సంచరించుచు సంభాషించుచు నుందురా? ఇంక మనము బ్రదికి యుందుమా?

అంబి—ఏమిచెల్లెలా,

అంబా—ఏమిఅక్కా!

గాంధా—దేవ! నీవీ సుదీర్ఘశుష్కశూన్యజీవితము నితరుల కొఱకే ధరించితివి. నేడుచచ్చినదియునితరుల కొఱకే. ఇంత మహోత్కృష్టమగు జీవితము ఇంతమమకారము, ఇంతశక్తి అన్నియు నితరులకొఱకే! ఇంక నీకొఱకు అక్షయకీర్తి యొక్కటియే.

అంబి—ఇదియేమి? ఈదుఃఖ భారముచే క్రుంగిపోవు చున్నటులను మట్టిలోకలిసి పోవుచున్నటులును అవుచుంటిని—రాజర్షి శ్రేష్ఠుడెచ్చటకు పోయినాడు? వేలి ప్రభావముచే దుర్భర పతి వియోగ దుఃఖమును నవ్వుచు సహించితినో మునలితనములో, ఇంతవఱకు సివిధమున నుంటినో ఆ నావార్షము, ఆదీప్తి, అంతఃకరణమందలి ఆ అనంతయౌవనము ఎచ్చటకుపోయెను! సోదరీ!

అంబా...ఎప్పుడును నేను ఏడ్చియుండలేదు. గనుకనే నిలిచియున్న ఆదుఃఖప్రవాహము నేడు సందుపొంది యుప్పొంగుచున్నది. నాహృదయమును చూర్ణము చేసికొని కొట్టుకొనిపోవుచున్నది అక్కా!

అంబి—ఏడ్వుము. బిగ్గరగ ఏడ్వుము. దుఃఖము కన్నీరుగమారి కొట్టుకొని పోవునుగాక. మనరోదనధ్వని పర్వతత్రి వ్యాపించుగాక.

గాంధా....ఎవరువారు?

(వృద్ధారూపమున సత్యవతి ప్రవేశించుచు.)

సత్య...ఓసీ! మీరింకను బ్రతికియున్నారా?

గాంధా—ఇదుగో సత్యవతియు వచ్చినది. ఇదియేమి! క్షణములో నీమె జరాగ్రసిత యయ్యెను. ఆ అనంతయౌవన—

సత్య—ఎచ్చట! ఎవ్వరును లేరు!
అంబి—మేమిచ్చట నుంటిమమ్మా!
సత్య....అంబాలికా!
అంబా—ఆఁ నేను ఉన్నాను,
సత్య—ఎచ్చట? నాకు కనుపించుటలేదు.
గాంధా....ఇదియేమి! గుడ్డిదికూడ నయ్యెనా!
సత్య—అంబికా! అంబాలికా! ఎచ్చట మీరిద్దఱు?
ఇద్దఱు...మేమిచ్చటనే యుంటిమమ్మా!

సత్య...ఆఁ అమ్మాయని పిలువుఁడు అమ్మా యని పిలువుఁడు. (రొమ్ముపై చేయిపెట్టుకొని) ఇచ్చటనే ఇచ్చటనే పిలువుఁడు అమ్మాయని పిలువుడు. నాడు అతఁడు నన్నట్లే పిలిచెను. ఒకరోజున నన్నతఁడు అమ్మాయని పిలిచెను. తర్వాత—
అంబి...(గాంధారితో) అమ్మాయీ! అమ్మకు ధైర్యము చెప్పి ఓదార్చుము.
గాంధా—అందఱ దళయు నొక్కటే. ఎవ్వరెవ్వని నోదార్చెదరు! ఎవ్వరెవ్వనికి ధైర్యముచెప్పెదరు!

సత్య—రండు బిడ్డలారా! నాఒడిలోనికి రండు. నన్ను కౌగిలించుకొనుఁడు. మీరెచ్చటనున్నారో నాకుకనిపించుటలేదు కౌగిలించుకొనుడు. (ఏడ్చి) కౌగిలించుకొనుడు బిడ్డలారా! మిమ్ము కౌగిలించుకొని నిద్రపోయెదను (ఇద్దఱును కౌగిలించుకొని) ఏది! చల్లదనములేదు. మండిపోవుచున్నాను. మండిపోవుచున్నాను. అమ్మా!
గాంధా—అమ్మా!
సత్య...ఎవ్వరు? గాంధారీ! నీవింకను బ్రదికియుంటివా? మంచిది. రమ్ము. మనమందఱము కలిసి బిగ్గరగ ఏడ్చెదము. ఏకస్వరములో నేడ్చెదము.

గీతము.

అతఁడె నా నిఖిలప్రపంచంబతఁడె నా హృదయంబునున్
అతఁడె నాకనుదోయి శాశ్వతునతఁడె నాహాస్యంబునున్
అతఁడె మామక హృదయజ్వాలయు నతఁడెనాగళహారమున్
అతఁడె నాదు విచిత్రచంద్రిక అతఁడె గాఢాంధకారమున్
అతఁడె నాకష్టంపు చావును అతఁడె నా సుఖగానమున్
అతఁడె రాతిరి తెల్లవాఱట యతఁడె నా యవసానమున్
అతఁడె నా యిహలోక జీవిత మతఁడె పరసహకారియున్
అతఁడె హాహాకారమును మఱి యతఁడ నాజయభేరియున్

సత్య...కుమారా! ప్రాణాధికా! (గాంధారిని కౌఁగిలించుకొనిమూర్ఛపోవును.

అంబికాంబాలికలు—అమ్మా! అమ్మా!

గాంధారి... వీణాతంత్రి తెగిపోయినది—చనిపోయినది

అంబికాంబాలికలు—చనిపోయినదా?

గాంధా...అవును. చనిపోయినది.

(అంబికాంబాలిక లొండొరులవంక చూచుకొందురు.)

సప్తమదృశ్యము.

స్థానము— యుద్ధభూమి. సమయము— ప్రాతఃకాలము

(అర్జునుఁడును శిఖండియు వెళ్ళుచుందురు.)

శిఖండి—అర్జునా! యుద్ధములో భీష్ముఁడు పడిపోయెను, ఇంకనీవ్రచింత వహించెద వేల? మోహగ్రస్తునివలె తడఁబడుచు నడచెద వేల?

అర్జు....శిఖండీ! నాహృదయముచాలదుర్బలమగుచున్నది ,,అర్జునా! యేమిచేసితివి? ఏరొమ్మపై నీవు నిద్రించువాఁడవో దానినే వజ్రము వంటి బాణముతో నెట్లుగొట్టితివి? ,, అనుఆవిటువు పలుకులు ఇంకను నాచెవులందు ప్రతిధ్వనించుచున్నవి. పితామహుఁడు —వృద్ధపితామహుఁడు—మనుమఁడు తన పెడద తొడఁదను కలికి ములుకులు నాటుటఁ జూచి అతివిచార

ముతో అతి సంక్షోభముతో విల్లమ్ములు క్రిందనుంచి తనతో
మ్మును ముందుకు సాచెను. అనవాయువున యుద్ధములో
నేను ఉన్మత్తునివలె నగుటచే ఈమాట నాలోచింపలేకపోతిని
అర్జునుని బాణములచే నిరాయుధుఁడగు భీష్మునివధ జరిగినది!

శిఖండి...వీరవరా! ఈమాట యెవ్వరనిరి? భీష్మపతనమునకు నా బా
ణములే కారణములు.

అర్జు....శిఖండీ! క్రింద బాగుగ త్రవ్వబడినపుడు పర్వతము వ్రేలితో
నెట్టిన క్రిందపడును.

శిఖండి....నీయీ చిత్తక్షోభము వ్యర్థము. కానున్నది అయినది.

అర్జు...నీవుచూడలేదు. నేఁడు భీష్ముడెట్లు పడెననుకొంటివి? ప్ర
చండ మధ్యాహ్నమార్తాండుఁ డాకసము నుండి పడినట్లు
పడెను. ప్రపంచమంతయు కంపించెను. వెంటనే ఆకాశమున
ప్రళయాంధకారము గ్రమ్మెను. నాకవాసుల హాహాకారము
నాకు స్పష్టముగ వినఁబడెను. మఱియు—(గద్గదస్వరముతో)
పద, పితామహునియొద్దకు పోదము.

శిఖండి...(పోవుచుపోవుచు) అర్జునా! భీష్మపతనముచే నా హృదయ
మున నేఁడీ యుల్లాసమేల వెల్లివిఱియుచున్నది? ఎవరో నా చె
వులలో నేడు నీప్రతిహింస తీరినది అని చెప్పుచున్నటులు
న్నది. ఇదియేమి అర్జునా?

అర్జు—ఇదియేమి శిఖండీ!

శిఖండి....నేనుఁ రాను. నీవుపొమ్ము అర్జునా!

అర్జు—ఏమి వీరవరా?

శిఖండి...నేను రాఁజాలను. నీవుపొమ్ము అర్జునా!

(ఇద్దఱును ఇరుప్రక్కలనుండి పోవుదురు.)

—o—

అష్టమ దృశ్యము.

స్థానము—కురుక్షేత్రము. సమయము— సంధ్యాకాలము
(భీష్ముఁడు శరశయ్యపై పరుండియుండును. విదుర ద్రోణకృపాచార్యులును కౌరవ పాండవులునుఎదుట నిలచియుందురు.)

ద్రోణ...పాండవులారా! కౌరవులారా!పుత్రులారా నేఁడు ప్రకాండమగు సంహారకాండ మారంభమైనది. సమరమున భీష్ముఁడు పడిపోయెను. కాల కరాల కృష్ణపటమున రుధిరాక్షరములతో తొలు దొలుత భీష్ముని నామము వ్రాయును. ఈజాబితా త్వరలోనే పూర్తియగును.

విదుర...ఏమిచింత లేదు. ఈ కాల సంగ్రామమున కౌరవపక్షము వారెవ్వరును బ్రతుకఁబోరు.

కృష్ణ—భీష్మపతనము నేఁడు కాఁబోవు యుద్ధపరిణామమును సూచించినది.

యుధి...పితామహా! చాలబాధగ నున్నదా?

భీష్మ....ఏమియు లేదు— దుర్యోధనా!

దుర్యో—పితామహా!

భీష్మ—తల క్రిందకు వ్రేలాడుచున్నది. దిండు పెట్టుము
(దుర్యోధనుఁడొక మెత్తని దిండును తలక్రింద పెట్టును)

భీష్మ....(దాని నవతలికి త్రోసి) భీష్ముని కిదింకా! అర్జునా! అర్జునా!
(అర్జునుఁడు తన యమ్ములపొదిని భీష్ముని తలక్రిందపెట్టును.)

భీష్మ...అర్జునా! భీష్మహృదయము నీవే యెఱుగుదువు! ఏమి అర్జునా!

అర్జు...(కంట నీరుపెట్టుకొని) పితామహా! క్షమింపుము నాతల తిరిగిపోవుచున్నది. కన్నులయందు చీఁకటి క్రమ్ముచున్నది.

భీష్మ....కాదు కాదు, కుమారా! నీవుధనంజయుఁడవు నేనుచేయజాలని దానిని నీవు చేసితివి— నీవు కర్తవ్యము నెఱవేర్చితివి దుర్యోధనా! జలము—

దుర్యో—(స్వర్ణకలశముతో నీరుతెచ్చి) పితామహా! జలము త్రాగుము.

భీష్మ....ఈజలమా!—అర్జునా! నీవు జలమిమ్ము.

(అర్జునుఁడు గాండీవమున బాణము సంధించి భూమిపై గొట్టగా పాతాళగంగ ఊర్ధ్వధారగా వచ్చి భీష్ముని నోటఁబడును.)

భీష్మ...కుమారా! తృప్తిఅయినది.

(ఉద్భ్రాంతభావములో గాంధారియు ఆమె వెంట కుంతియు ప్రవేశించెదరు.)

గాంధా...నాయనా! నాయనా! (కాళ్ళపైఁబడును.) భీష్మదేవా! ఎచ్చటకు పోయెదవు?—ఈ ప్రపంచమును దరిద్రముచేసి ఎచ్చటకుపోయెదవు? దీనమగు ఈమానవ లోకమున అంధకారముగిప్పి ఎచ్చటకుపోయెదవు? నాయనా! వెళ్లవద్దు మానవగౌరవమార్తాండా! కౌరవకల్యాణా! నాపుత్రులు నీశరణుచొచ్చిరి వారీ విపత్తి సాగరమున సంకటములో నీమీాదనే ఆశపెట్టుకొని యున్నారు. వారిని ఒంటరులుగ జేసి యెచ్చటకు పోదువుదేవా?

భీష్మ...అమ్మాయీ! గాంధారీ! ధైర్యము వహింపుము నీవిట్టులధైర్యము పూనుటసరిగాదు. నీకు నూర్గురుపుత్రులున్నారు.

గాంధా...ఈ నూర్గురు పుత్రులును శోకము పెంచువారలే. నాయనా! నీవు మొదట నుండియు కౌరవులకు సహాయకుండవు. వెళ్ళవద్దు. లెమ్ము. ధనుర్బాణములు ధరింపుము కౌరవ విపక్షులను భస్మము చేయుము.

భీష్మ....శోకింపకుము. ధర్మమునకు జయము కలిగినది. గాంధారీ! సంతోషింపుము.

గాంధా...నీవు చెప్పినది సత్యము. నాయనా! ధర్మమునకు జయము యినది. ఏమియు చింతలేదు. విజయమయినది. ఏమియుచింత లేదు. విజయవాద్యముల వాయింపుము. ద్రోణుని బలియాయెను. కర్ణుని బలియాయెను దుర్యోధనుని బలియాయెను. కాని ధర్మమే జయించును. నాయనా! ఏమియు దుఃఖములేదు.

(గంగా ప్రవేశము.)

గంగ...నాయనా! దేవవ్రతా! ఎచ్చటనుంటివి. వత్సా! దేవవ్రతా

భీష్మ—పూర్వపరిచితమగు ప్రియస్వరముతో బాల్యమున మాయమ్మ పిలుచుచే ఁతతో నన్ను పిలుచునదెవరు?

గంగ—నేను— ఆ నీతల్లినే కుమారా!

భీష్మ—పాదములకు నమస్కారము. పాండవులారా! కౌరవులారా! నమస్కరింపుడు, (అందఱు నమస్కరించెదరు.)

గంగ—ఈ అన్యాయయుద్ధమున నాపుత్రుని బాణములతోఁ గొట్టిన దెవరు?

కుంతి—అన్యాయయుద్ధమునఁగాదు. న్యాయయుద్ధముననే పితామహుఁడు పడిపోయెను

గంగ—న్యాయయుద్ధమున నాపుత్రుని వధింపఁజాలిన వాఁడు నేటి దనుక మూఁడులోకములందును పుట్టలేదు. న్యాయయుద్ధమున జంపబడు పుత్రుల నేనుగర్భమున మోయలేదు. నాపుత్రుని వధించిన వాఁడెవడు! చెప్పుడు!

అర్జు—(ముందుకుబోయి) ఆనరాధముఁడ నేనే యమ్మా!

గంగ-నీవా? క్షుద్రుఁడవగు నీవు న్యాయయుద్ధమున భీష్ముని వధించితివా? ఇది యసంభవము— ఇదుగో శాపమొసఁగుచున్నాను అన్యాయ యుద్ధమున నాపుత్రుని హృదయమున బాణము నాటినవాఁడును ఆత్మ పుత్రశోకముచే గుందుగాక.

భీష్మ — ఇదియేమి ఇట్లుచేసితివి.— అమ్మా జాహ్నవీ! నీశాపము నుపసంహరించుకొనుము.

అర్జు...వద్దు వద్దు పితామహా! అమ్మా! జాహ్నవీ! శాపమిమ్ము. నీవు కోరినంత, నీవలన నగునంత శాపమిమ్ము. పుత్రశోక మతి తుచ్ఛము. అమ్మా! నేను భీష్ముని వధించితినను దుఃఖము నూరు పుత్రశోకములతో సమానముగ నాహృదయమును పీడించుచున్నది. శాపమిమ్ము. నీచేత నగునంత దుఃఖము నిమ్ము. ఈ మహాదుఃఖమను అగ్నికుండమున నేను భస్మ

దుర్యోధన— పితామహా! (మాటరాదు)

భీష్మ...కుమారా! అర్జునా! ధైర్యము వహింపుము. నన్నెవ్వరును చంపలేదు. మృత్యువు నావశముననుండును— అమ్మా! పోవుటకనుజ్ఞ యీయుము.

గంగ....పొమ్ము పురుషసింహమా! నీలోకమునకు పొమ్ము, వత్సా! దేవవ్రతా! ప్రాణాధికా! నీవు దేవతవు. నీవు భూతలమున దేవతలువలె అనాసక్తము, నిష్కళంకమును, దుర్జయమును, ఉజ్జ్వలమునగు జీవితమును గడపితివి. పొమ్ము. పుత్రా! నాపాదరజమును మస్తకమునఁ దాల్చి ఈ శుభయాత్ర జేయుము. (ప్రస్థానము.)

భీష్మ...కౌరవ పాండవులారా! రాత్రివచ్చినది. చీఁకటిపడుచున్నది. మీమీ శిబిరములకు పొండు, ఈబహిరంగపుయుద్ధరంగమున శరశయ్యపై పరుండి నేనొంటరిగా మేలుకొందును. శిబిరములకు పొండు అమ్మాయీ! గాంధారీ! కౌరవపాండవులారా! పొండు.

(భీష్ముని యొద్దనుండి అందఱును పోదురు. చీఁకటిదట్టమగును.)

భీష్మ—ఓకరుణామయా! నేఁడు నాకుదర్శనమిమ్ము. జగద్గురూ! శ్రీకృష్ణా నీవే పాపుల కంతిమ సమయమున నాధారమవు. నేనుపాపాత్ముఁడను. నరాధముఁడను. దర్శనమిమ్ము. ఈజీవనమరణముల సంధిస్థలమున ఈ సంకటమున వచ్చి దర్శనమిమ్ము స్వామీ! నాకు ఎదుట దిగంతవ్యాప్తమగు నిస్సీమ మహాసముద్రము గనిపించుచున్నది. దాని గంభీర గర్జనము వినిపించుచున్నది. దయామయా! హరీ! దర్శనమిమ్ము.

(శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షమగును.)

కృష్ణ—ఇదుగో వచ్చితిని దేవవ్రతా! ఏమియు భయము లేదు.

భీష్మ....దయామయా! హరీ! అంతిమ మార్గమును చూపించుము. నీపాదనౌకను సహాయముగ నిమ్ము.

కృష్ణ—ఓ త్యాగీ! సన్యాసీ! భీష్మా! యోగీ! ధర్మవీరా! అదుగో చూడుము. గగనచుంబితమగు కాలశిఖరమున ప్రకాశపూర్ణమగు ధర్మమందిరము విరాజిల్లుచున్నది. అదుగో ధూపపరిమళము వచ్చుచున్నది. అదుగో వినుము శంఖము మ్రోగుచున్నది. త్యాగీ! వీరవరా! పొమ్ము. ఏమియు చింతలేదు. ఒద్దన నావసిద్ధముగ నున్నది. దానిపైనెక్కి ఆత్మీయపుణ్య ధ్రువజ్యోతిః ప్రకాశమానమగు మార్గమునఁబొమ్ము నీవు ధన్యుడవు. నీ అక్షయకీర్తి ప్రపంచమున సర్వదా భక్తిపూర్వముగ గానము చేయఁబడును.

(తెర వాలును.)

సమాప్తము.

—o—

శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 75 | 18 | వస్సుయ | వయస్సు |
| 88 | 14 | అ | అది |
| 102 | 27 | అభిక్షు | ఆభిక్షు |
| 106 | 22 | శున్నదో | చున్నదో |
| 116 | 6 | గూఢ్వర | గూఢస్వర |
| 123 | 10 | మనుగలిసెయు | మయుగలిసెను |
| 127 | 11 | ఇటింకి | ఇంటికి |
| 135 | 14 | యిమయ | మయియగు |
| 147 | 11 | నిశ్చితు | నిశ్చేష్టితు |
| 167 | 15 | ప్పివేసి | గప్పివేసి |

# ఆంధ్ర గ్రంధ రత్నాకర ప్రచురణములు.

—o—

| | | | |
|---|---|---|---|
| 1. | దుర్గాదాసు | (నాటకము.) | రు 1—4—0 |
| 2. | మేవాడుపతనము | ,, | 1—4—0 |
| 3. | చంద్రగుప్త | ,, | 1—0—0 |
| 4. | రాణాప్రతాపసింహ | ,, | 1—4—0 |
| 5. | భీష్మ | ,, | 1—4—0 |
| 6 | కాళిదాసభవభూతులు | (నాటకవిమర్శనము.) | 1—0—0 |
| 7. | సాత్రాజితీపరిణయము | (ప్రబంధము) | 0—12—0 |

అచ్చులోనున్న గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1. | గులిస్తాను | (చక్కనినీతికథలు) | రు 1—0—0 |
| 2 | సొరాబురుస్తుము. | (నాటకము) | 0—12—0 |
| 3. | షాజహాను | ,, | 1—0—0 |
| 4 | సంఘసంస్కారసమస్య | | 0—4—0 |
| 5. | శివానందలహరి | (సంస్కృతశ్లోకఆం | 0—6—0 |
| 6. | అమరుకకావ్యము | ధ్రపద్యసహితము) | 0—6—0 |

☞ అర్ధణాబిళ్ళ పంపిన మాకాట్యాటలాగు ఉచితముగ పంపఁబడును. జవాబుగోరువారు రిప్లయికార్డు వ్రాయవలయును.

మేనేజరు

ఆంధ్ర గ్రంథ రత్నాకరము.

(కృష్ణా జిల్లా) గుడివాడ.

# ఆంధ్రగ్రంథ రత్నాకరము

## గుడివాడ

---

ఆంధ్రసారస్వతమున కత్యావశ్యకములును అపూర్వములునుగు గ్రంథరత్నములం బ్రకటించి యథాశక్తి ఆంధ్రవాఙ్మయము నందలి కొఱంత దీర్చుటయే ఈ గ్రంథమాల యొక్క ప్రధానోద్దేశ్యము. ఇందు సంవత్సరమునకు మూడునాలుగు గ్రంథరత్నములు వెలువడును. ఇవిగాక కొన్ని అనుబంధ గ్రంథములుగూడ వెలువడును. ఎనిమిది అణాలు ప్రవేశరుసుము ఇచ్చి చందాదారులుగ చేరువారికి మేము ప్రకటించు గ్రంథములన్నియు రూపాయికి నాల్గుఅణాలు చొ॥ తగ్గించి ఈయబడును. అనుబంధములు కొనవలసిన నిర్బంధము లేదు కోరినచో అవికూడ తగ్గింపుధరలకే ఈయఁబడును చందాదారులు రత్నములను మాత్రము తప్పక కొనవలయును. మా గ్రంథమాలకు ఒకేమాఱుగ రు 116, 50, 25 రూపాయలు విరాళము లిచ్చువారి నామములు క్రమముగ రాజపోషకులు, ప్రధానపోషకులు, పోషకులు అను శీర్షికలక్రింద ప్రతిరత్నమందును ప్రకటింపఁబడును మా రత్నములన్నియు వారికి ఉచితముగ నొసఁగఁబడును. పత్రికలకు మంచికమీషను ఈయఁబడును.

---

ఇందు వెలువడిన గ్రంథములు

౧వ రత్నము.

## దుర్గాదాసు

ఇదినూతనముగ ఆంధ్రప్రపంచమున నవతరించిన యొక అత్యుత్తమనాటకము ఆధునికనాటకలేఖకులలో నగ్రగణ్యుఁడగు శ్రీ ద్విజేంద్రలాల్ రాయల బంగాళీనాటకమున కిది తేటతెలుఁగున ననువాదము. ద్విజేంద్రుఁడు నాటకకళావ్యాపనమునకై యవతరించిన మహాపురుషుడుగాని సామాన్యుఁడుగాడు. అతని నాటకములలో పవిత్రత, ఔదార్యము, దేశభక్తి, స్వార్థత్యాగము, విశుద్ధహాస్యము నిండియుండును. అందు ఉన్మాదక శృంగారమేమాత్రము నుండదు. ప్లాటులో

నింక ద్విజేంద్రునిచే పెట్టినదిపేరు. ఇది ప్రఖ్యాతిజెందిన కలకత్తాథియేటరులలో ప్రదర్శింపఁబడినపుడు ప్రేక్షకులెల్లరు జయధ్వానములచే నాట్యశాలను ప్రతిధ్వనింపజేసిరి. ఇట్టిసర్వాంగశోభితమగు నాటకము "నభూతో న భవిష్యతి." హిందూమహమ్మదీయుల నైకమత్యము నుద్బోధించు నిట్టిగ్రంథము నిదివఱ కెవ్వరును వ్రాయలేదు సినీమాలో ప్రదర్శింపఁబడి పెక్కుఆంధ్రుల హృదయముల కొల్లగొనినది ఈనాటకరాజమే ఈగాంధీయుగమందు ద్విజేంద్రుని గ్రంథముల ప్రచారమత్యావశ్యకము వెల రు 1-4-0 చందాదారులకు రు 1-0-0

---

౨వ రత్నము

## కాళిదాసభవభూతులు

ఇదియు ద్విజేంద్రునిదే. సంస్కృతనాటక వాఙ్మయమున అగ్రస్థానము వహించిన ఇద్దఱు మహాకవుల యొక్క సర్వోత్తమ నాటకముల విమర్శనము. ఇది పేరునకు 'కాళిదాస భవభూతులు' గాని ఇందు ప్రాసంగికముగ ఇంగ్లీషు, జర్మను, ఫ్రెంచి, గ్రీకుభాషలలో ధురంధరులగు కవుల నాటకములు గూడ చక్కగ విమర్శింపఁబడినవి. నాటకకళ, కవిత్వకళ, పాత్రపోషణము, ప్లాటుమున్నగు నెన్నియో గంభీర విషయములు కడుహృద్యముగ చర్చింపఁబడినవి నాటకతత్త్వ మెఱుంగఁగోరువారి కింతకంటె నుత్తమగ్రంథము వేఱొకటిలేదు.
వెల రు 1—0—0. చందాదారులకు రు 0—12—0.

---

3వ రత్నము.

## సాత్రాజితీ పరిణయము

బిల్వనాథీయము, ఆంధ్రమత్స్యపురాణము మున్నగు ననేక గ్రంథములు రచించిన శ్రీ అడవి సాంబశివరాయ కవిశిఖామణిచే రచింపఁబడిన ఐదాశ్వాసముల చక్కని ప్రబంధము.
వెల 12 అణాలు. చందాదార్లకు 9 అణాలు.

---

౪వ రత్నము

# చంద్రగుప్త

మౌర్యసామ్రాజ్యస్థాపకుఁడగు చంద్రగుప్తుని చరిత్ర ఇంత మనోజ్ఞముగ నిదివర కెవ్వరును రచించలేదు విశ్వప్రేమ, దేశభక్తి పితృభక్తి మున్నగు మహోన్నతభావము లిందు కడు హృదయంగమముగ చూపింపబడినవి ఇందు ఛాయా, హెలీనాల అపూర్వచరిత్రము చదివిన రోమాంచితమగును చాణక్య, చంద్రగుప్త, మురా చంద్రకేతుల చరిత్రములు చక్కఁగ చిత్రింపఁబడినవి. ఇందు అమృత గుళికలవంటి చక్కనిపద్యములును గీతికలును గలవు. ప్రదర్శన యోగ్యము. వెల 1—0—0. చందాదారులకు 12 అణాలు.

---

౫వ రత్నము.

# రాణా ప్రతాపసింహ

మొగలుల యుచ్ఛిష్టమున కాసింపక మాతృదేశమునకై కఠోర దారిద్ర్యవ్రతము నవలంబించి మరణాంతమువఱకు తనప్రతిజ్ఞను పాలించిన రాణా ప్రతాపసింహుని యుజ్జ్వలచరిత్రము ఈనాటకమున మనోహరముగ చిత్రింపఁబడినది రాజపుత్రుల ప్రబోధమునకై తనజీవితము నర్పించిన జోషీ బాయియొక్కయు శక్తసింహుఁడు, పృథ్వీరాజు, దౌలతున్నిసా, మెహరున్నిసా మున్నగు పాత్రలయొక్కయు చరిత్రములు ఇందు చదివి తీరవలయును ఇందలి వచనమును పద్యములును వీరరసమును వర్షింపును. (అచ్చునకున్నది)

వెల 1—4—0. చందాదారులకు రు 1—0—0.

---

౬వ రత్నము

# భీష్మ

ఇది ద్విజేంద్రలాల్ రాయల యత్యుత్తమమగు పౌరాణిక నాటకము. ఇందు భీష్ముని బ్రహ్మచర్యము, పితృభక్తి, స్వార్థత్యాగము

మున్నగు గుణములు కడుమనోహరముగ చూపింపఁబడినవి. భీష్ముని చరిత్రమునింత యుజ్జ్వలముగనింతవఱకు నేనాట్యకారుఁడును చిత్రింప లేదు. కాశీరాజు పుత్రియగు అంబచరిత్రము అద్భుతముగ నుండును దాశరాజుప్రసంగము కడుపు చెక్కలుచేయును ఆంధ్రదేశమున పెక్కు నాట్యసమాజములవారు దీనిని ప్రదర్శించుటకు ప్రయత్నించు చున్నారు పద్యములు రసవంతములు

వెల రు 1—4—0 చందాదారులకు 1—0—0.

---

# అనుబంధములు

౧వ అనుబంధము

## అర్ధానుస్వార శకటరేఫచంద్రిక

ఎచ్చట అరసున్నలుంచవలయునో ఎచ్చట శకటరేఫము వ్రాయవలయునో దీనివలన సుగమముగ తెలిసికొనవచ్చును స్కూలు విద్యార్థులకును తెలుఁగున వ్యాసములు వ్రాయువారికిని మిక్కిలి ఉపయోగకరము వెల 6 అణాలు చందాదారులకు 4 అణాలు

---

౨వ అనుబంధము

## సాసూను వైద్యశాలలోని గాంధిమహాత్ముడు

మహాత్మునిపై భారతదేశీయులకేగాక విదేశీయులకుఁగూడ నెట్టి ప్రేమభావమున్నదియు వారి సాన్నిధ్యముచే సాసూను వైద్యశాల ఎట్లు ప్రేమవాతావరణముగ మారినదియు ఇందు చక్కగ వ్రాయఁబడెను గ్రంథకర్త శ్రీమహాదేవదేశాయిగారు

వెల 1½ అణాలు చందాదారులకు 1 అణా

---

3 అనుబంధము

## మయూరధ్వజ చరిత్రము

ఇదియొక చక్కనిహరికథ ఇందలిపద్యములును గేయములును చాలహృద్యములుగ నుండును.

వెల రు 0-8-0 చందాదారులకు వెల రు 0-6-0

శ్రీ

౪ వ అనుబంధము

## మేవాడుపతనము

ఇది యొక యపూర్వనాటకము ఇందు కళ్యాణి, సత్యవతి, మానసియను పాత్రలచే క్రమముగ పతిభక్తి, దేశభక్తి, విశ్వప్రేమయను మహోన్నత భావములు కడుహృద్యముగ నిరూపింపఁబడినవి. ఇదియును దుర్గాదాసునవలె ప్రస్తుతకాలమునకు అనుగుణముగ నుండును నాటకశైలియు, గీతములును సరళముగను మనోహరముగ నుండును

వెల రు 1—4—0 చందాదార్లకు రు 1—0—0

---

౫ వ అనుబంధము

## శుద్ధాంధ్రనిర్వచన శతకంఠరామాయణము

భాష అచ్చతెనుఁగైనను సులభమగు వాడుకశైలిలో నుండి చదువరులందరిని హృదయరంజకముగ నుండును 5 అణాలచీట్లు పంపు గ్రంథాలయముల కిది ఉచితముగ పంపఁబడును

వెల రు 1—4—0 చందాదార్లకు రు 1—0—0

---

మావద్ద విక్రయమునకుదొరకు ఇతరగ్రంథములు

## హిందీ - తెలుఁగునిఘంటువు

లేఖకులు.—పండిత జంధ్యాల శివన్న శాస్త్రిగారు

స్వయముగా హిందీనేర్చుకొనువారికి ఇదియున్న ఇంక నే నిఘంటువును అక్కరలేదు దీనిమూలమున హిందీ గ్రంథములన్నియు సులభముగ అర్థముచేసికొనవచ్చును ఇందు ౨౦ వేలకుపైగా హిందీ ఉర్దూ ఫార్సీ శబ్దములకు అకారాదిక్రమముగ తెలుగుఅర్థము వ్రాయఁబడినది మఱియు ప్రతిశబ్దమునకును పుంలింగ స్త్రీలింగ విశేష్య విశేషణ అవ్యయాది భేదములు వ్రాయఁబడియున్నవి గ్లేజు కాగితములు, క్యాలికోబైండు వెల 2 రూపాయలు.

---

శ్రీ

# బాలభారతీ గ్రంథనిలయము

చాగలమఱ్ఱి

కర్నూల్ (జిల్లా)—దత్తమండలము

స్థాపితము 1923

## ఇందు వెలువడిన గ్రంథములు

(ప్రథమ రత్నము)

## సువర్ణకేసరీ కృష్ణసేన (నవల)

కథాచమత్కృతి అద్భుతము ఇందు సందర్భానుసారముగా పెక్కు సాంఘిక విషయములు చర్చింపబడినవి వెయ్యేల చదువ మొదలిడిన అంత్యమగువఱకును విడువరు

| | | |
|---|---|---|
| వెల చందాదారులకు | రు 0-12-0 | పోస్టేజి వేరు |
| ఇతరులకు | 1- 0-0 | |

---

ద్వితీయ రత్నము

## కలియుగదర్పణము (నాటకము)

వృద్ధ వివాహములు, అతిబాల్యవివాహములు, కలియుగానర్థములనియు—యవ్వనకంటకములనియు—ప్రదర్శించుటకు "కలియుగదర్పణమే" దర్పణము.

| | | |
|---|---|---|
| వెల చందాదారులకు | రు 0-12-0 | పోస్టేజి వేరు. |
| ఇతరులకు | 1- 0-0 | |

---

తృతీయ రత్నము

# మనోరమా విజయము (చరిత్రాత్మక నాటకము)

గ్రంథకర్త: గండ్లూరి నరసింహారావుగారు

రిటయిర్డు రివిన్యూయినస్పెక్టరు, జంబులమడుగు

వెల చందాదారులకు రు 0-12-0

ఇతరులకు 1- 0-0

---

# ప్రియదర్శిని

చిత్రపట శోభితమును చరిత్రాత్మకమునునగు నవలా రాజము. మూగ్రంథకర్త: పాలపర్తి సూర్యనారాయణరావుగారు.

వెల చందాదారులకు రు 0-12-0 ఇతరులకు రు 1-0-0

---

# గండికోట

ఒకపురాతన పట్టణముయొక్క చరిత్రము చక్కగ చిత్రింపఁబడినది. చందాదారుల కుచితము. ఇతరులకు ౨ అణాలు మాత్రమే.

---

# ప్రేమ.

భక్తియోగాది బహుగ్రంథకర్తలగు శ్రీబాబూ అశ్వినీ కుమారదత్తుగారి బంగాళీ గ్రంథమునకు శ్రీమతి గుడిసేవ నాగమణిదేవిగారి తేటతెల్లమగు ఆంధ్రానువాదము. ఇందుప్రేమను గూర్చి విపులముగవ్రాయబడినది. వెల రు 0—6—0

**ఆంధ్ర గ్రంథ రత్నాకరము, గుడివాడ.**